₹30

# దక్కన్ ల్యాండ్

సామాజిక రాజకీయ మాసపత్రిక

VOL 11వ వసంతంలో

130 ISSUES నూట ముప్పై వ సంచిక

పూర్తి చేసుకున్న దక్కన్ ల్యాండ్



- తెలంగాణ నూతన సచివాలయం
- నిజాం హైదరాబాదు సంస్థానంలో దళిత ఉద్యమం
- తెలంగాణలో నీలి విప్లవం
- పర్యావరణ దారిలో తెలుగు సాహితీ వెలుగులు







రాజధాని నగరం నడిబొడ్డున
తలెత్తుకుని నిలిచిన
డా॥ బి.ఆర్. అంబేద్కర్ విగ్రహం,
నూతన సచివాలయం,
తెలంగాణ
అమరవీరుల స్మారక స్థూపాలు
తెలంగాణ పునర్ నిర్మాణానికి
ప్రతీకలు.
- ముఖ్యమంత్రి కేసీఆర్

ప్రత్యేక కథనం లోపలి పేజీల్లో




















## బోధ్ గయలో మహాబోధి టెంపుల్

బుద్ధుడి జీవితానికి మరీ ముఖ్యంగా జ్ఞానోదయానికి సంబంధించిన నాలుగు పవిత్ర స్థలాల్లో మహాబోధి ఒకటి. మొదటి ఆలయం అశోక చక్రవర్తి కాలంలో వర్తమాన శక పూర్వం మూడో శతాబ్ది లో నిర్మించబడింది. ప్రస్తుత ఆలయం వర్తమాన శకం ఐదు లేదా ఆరో శతాబ్దికి చెందింది. గౌతమ బుద్ధ అడుగుజాడలు అన్ని రకాల యాత్రికులకు, సంస్కృతుల అన్వేషకులకు, నిపుణులకు, అందరికీ ఎంతో పవిత్రమైనవి. బోధ్ గయ లోని మహాబోధి ఆలయం బుద్ధుడి జ్ఞానోదయంతో ముడి పడిన ప్రాంతంగా వివిధ రకాల సందర్శకులకు తిరుగులేని సందర్శనీయ స్థలంగా ఉంటోంది. అశోకుడు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించడం, ఆ తరువాత ఆయన బౌద్ధానికి బాగా ప్రాచుర్యం కల్పించడం అనేవి కళింగ యుద్ధంలో సాధించిన విజయంతో, పట్టాభిషిక్తుడైన పదేళ్ల తరువాత బోధ్ గయను సందర్శించడంతో ముడిపడి ఉన్నాయి.

–సువేగా




"CHANDRAM" 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029.
Fax: 040-27635644Mobile: 9030626288
E-mail: desk.deccan@gmail.com website : www.deccanland.com




# మెయిల్ బాక్స్

## చిరస్మరణీయుడు కేవల్ కిషన్

వెలుగు చూడని ఎందరో వైతాళికులను, వీరులను, యోధులను, సాహితీ ఆణిముత్యాలను తెలంగాణ ప్రభుత్వం స్మరించుకుంటున్నది. అలాంటి దారిదీపాలలో కేవల్ కిషన్ చిరస్మరణీయుడు. వారు మన మధ్య లేకపోయినా ప్రజల గుండెలలో గుడికట్టుకున్నారు. ఎంతలా అంటే వారు మరణించిన చోట సమాధివద్ద ప్రజలు జాతర చేస్తారు. జాతరలో బండ్లు తిరుగుతాయి. దేవుని బిళ్ళలవలే, ఫొటోలవలె, లాకెట్లవలె కేవల్ కిషన్ చిత్రం గల బిళ్ళలు, ఫోటోలు, లాకెట్లు జాతరలో తీసుకొని ప్రజలు ధరిస్తారు. ఎందరో తమ పిల్లలకు కిషన్ అని పేర్లు పెట్టుకుంటారు. అంతటి సేవలు చేసిన మహనీయుడు కేవల్ కిషన్. 1922 మే, 7న ఉమ్మడి మెదక్ జిల్లా మాందాపురం గ్రామంలో మున్నాబాయి, నారాయణ దంపతులకు జన్మించారు. ప్రజల స్వేచ్ఛ, విముక్తి పోరాటాలే తన ధ్యేయంగా పనిచేశారు. పేదలను సమీకరించి ఎన్నో సమావేశాలు నిర్వహించిన కేవల్ కిషన్ 1960 డిసెంబర్ 26వ తేదీ రాత్రి 11.30 గం॥ మాసాయిపేట నిరుపేదలతో సమావేశమై తిరిగి వస్తుండగా పోల్కంపల్లి వద్ద అనుమాన పరిస్థితిలో ప్రమాదానికి గురై అసువులు బాసాడు. నలభై ఏండ్లన్న రాకముందే నూరేళ్ళు నిండాయి. కేవల్‌కిషన్ అమర్ రహేహై. కేవల్ కిషన్ గురించి నేటి తరానికి తెలియజేసిన దక్కన్ ల్యాండ్ పత్రికకు ప్రత్యేక ధన్యవాదాలు.

**– ఎ. నీలం కిషన్**
నర్సాపూర్, మెదక్



## సాంచి స్థూపం

మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ నగరానికి యాభై కిలోమీటర్ల దూరాన ఉన్న సాంచిలోని బౌద్ధ స్మారక చిహ్నాలు గురించి, అశోక చక్రం, స్థూపం గురించి, బుద్ధుని అవశేషాల గురించి చాలా వివరంగా తెలియజేసిన రచయిత సువేగా గారికి కృతజ్ఞతలు. దక్కన్‌ల్యాండ్ యాజమాన్యానికి ప్రత్యేక ధన్యవాదాలు.

**– వి. వెంకట్**
హైదరాబాద్,



## విశ్వమానవుడు అంబేద్కర్

అంబేద్కర్ రచించిన రాజ్యాంగంలోని ఆర్టికల్ 3 ద్వారానే తెలంగాణ రాష్ట్రం సాధించుకున్నాం. అంబేద్కర్ ఆశయాల్ని ముందుకు తీసుకెళ్తున్న సీఎం కేసీఆర్‌కు ప్రత్యేక వందనాలు. అనేక పోరాటాలకు, మార్పులకు తెలంగాణ స్ఫూర్తి. ఆ స్ఫూర్తి ఇప్పుడు 125 అడుగుల అంబేద్కర్ విగ్రహం రూపంలో దేశానికి కండ్లకు కడుతుంది. హైదరాబాద్ నగరం నడిబొడ్డున సగర్వంగా, సమున్నతంగా చరిత్రలో లిఖించదగ్గ విగ్రహావిష్కరణ జరపడం సంతోషదాయకం. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాన్ని బోధించే బుద్ధిజం, అంబేద్కర్ జయంతి రోజు ఏప్రిల్ 14న ఆవిష్కరించడం శుభ పరిణామం. బౌద్ధగురువులు, మంత్రులు, అధికారులు, తెలంగాణ ప్రజల మధ్యన కనుల పండువగా వేడుకను నిర్వహించడం సంతోషదాయకం. రచయిత కట్టా ప్రభాకర్, దక్కన్‌ల్యాండ్ మాసపత్రిక యాజమాన్యానికి ప్రత్యేక అభినందనలు.

**– బి. సతీష్ మాదిగ**
నల్గొండ



## సంగీత శిరోమణి ఉస్తాద్ బడే గులాం

ఏప్రిల్ 23న ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ వర్ధంతి సందర్భంగా రచయిత శ్రీధర్‌రావు దేశ్‌పాండే అందించిన వ్యాసం చాలా చక్కగా ఉంది. వారి గురించి ఎన్నో విషయాలను తెలియనవి శ్రోతులకు తెలియజేశారు. పాటియాలా ఘరానా సంగీత సంప్రదాయాన్ని సమున్నతంగా నిలబెట్టిన మహనీయుడు ఉస్తాద్. తండ్రులవద్ద శిక్షణ పొందినప్పటికీ పెద్దయ్యాక తనదైన పాటియాల – కసూర్ గాయన శైలిని అభివృద్ధి చేశారు ఉస్తాద్. శ్రోతలు ఎక్కువగా ఇష్టపడే ఆదాన్, భూపాలి, హమీర్, జైజైవంతి, జాన్ పూరీ, మాల్ కౌన్స్ లాంటి రాగాలను ఎక్కువగా ఆలపించేవారు. హంసధ్వని లాంటి మధురమైన, కఠినమైన రాగాలను కూడా అలవోకగా పాడేవారు ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్. ఒక ముసల్మాన్‌ను వినాయక మండపానికి ఆహ్వానిస్తున్నామన్న భావన కార్యక్రమ నిర్వాహకులకు లేదు. తాను వినాయక మండపంలో పాడబోతున్నానన్న స్పృహ ఉస్తాద్‌కు లేదు. ఇదీ ఆనాటి నుంచి ఈ దేశంలో పరిఢవిల్లిన గంగా జమునా తహేజీబ్. తన జీవితాన్ని సంగీత కళా రంగంలో ధారవోసిన మహనీయుడు "ఉస్తాద్ బడే గులాం అలీఖాన్".

–పెమ్మసాని పద్మ, గుంటూరు 

## పరిశోధకులకు శుభవార్త **దక్కన్ ల్యాండ్‌కు ISSN ఆమోదం**

**దక్కన్ ల్యాండ్ మాసపత్రిక** ISSN (International Standard Serial Number) **ఆమోదం పొందినదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. మా** ISSN **2581-3188. ప్రముఖ, ఔత్సాహిక, పరిశోధకులు తమ పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక రచనలను ప్రచురింపజేసి వినియోగించుకోవడం ద్వారా ప్రాచుర్యం చేసుకోవడానికి ఈ సదవకాశాన్ని సద్వినియోగపరుచుకోవాలని కోరుతున్నాం.**

**రచయితలు తమ రచనలను పంపవలసిన చిరునామా :**
**"చంద్రం"** 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029 Telangana.
**సంప్రదించవల్సిన ఆఫీస్ ఫోన్ : 9030626288**
E-mail: desk.deccan@gmail.com
website: www.deccanland.com
**- ఎడిటర్**

ISSN 2581-3188

విషయసూచిక


# దక్కన్ ల్యాండ్

సామాజిక, రాజకీయ మాసపత్రిక

సంపుటి: 11 సంచిక: 10 పేజీలు: 60

జూన్ - 2023

సంపాదకులు
**మణికొండ వేదకుమార్**
9848044713
editordeccan@gmail.com

సహాయ సంపాదకులు
**కట్టా ప్రభాకర్**

సర్క్యులేషన్
**హెచ్. మోహన్‌లాల్**

వాణిజ్య ప్రకటనలు
**సయ్యద్ ఖైజర్ భాష**
9030626288

ఫొటోగ్రాఫర్
**టి.స్వామి**

కవర్‌పేజీ
**మహాబోధి టెంపుల్**

layout & composing @
CHARITHA IMPRESSIONS

printed @ DECCAN PRESS
ఆజామాబాద్, హైదరాబాద్-500 020.

కార్యాలయ చిరునామా






DECCAN LAND
"CHANDRAM" 3-6-712/2, St.No. 12,
Himayatnagar, Hyderabad - 500 029
TELANGANA
Mobile: 9030626288
Fax: 040-27635644
E-mail: desk.deccan@gmail.com
website : www.deccanland.com



**కృతజ్ఞతలు**

దక్కన్ ల్యాండ్ మాసపత్రికకు సలహాలు, సూచనలు అందించిన వివిధ రంగాల నిపుణులకు మా కృతజ్ఞతలు.





# లోపలి పేజీల్లో...



నిజాం హైదరాబాదు సంస్థానంలో దళిత ఉద్యమం



బోధ్ గయలో మహాబోధి టెంపుల్ కాంప్లెక్స్

# షోయబుల్లాఖాన్

దాదాపు వంద సంవత్సరాలు నిరంతరంగా కొనసాగి అంతిమ విజయంతో లక్ష్యాన్ని సాధించిన భారత జాతీయ, స్వాతంత్ర్య, ఉద్యమాలలో నిరంకుశ పాలకుల నిర్బంధాలకు, అమానుష చర్యలకు, అక్రమ ఆంక్షలకు గురి అయి చెఱసాలలో కఠిన శిక్షలు అనుభవించిన, ఉరికంబాలెక్కిన, శరీరాలలో బుల్లోట్లు నిండిన, బాకుల పోట్లతో శరీరాలు ఛిద్రమయి రక్తం చిందిన, చివరికి అమూల్య ప్రాణాలను కోల్పోయిన దేశభక్తులు, స్వాతంత్ర్య సమరయోధులు అనేకులు, అసంఖ్యాకులు, దేశభక్తి, మాతృభారతి సేవానురక్తి జలపాతాలయి పొంగివచ్చి కొందరు గళమెత్తగా, మరి కొందరు కలాలను ఎత్తినారు.

దేశభక్తులందరికి, స్వాతంత్ర్య యోధులందరికి, సకల భారత జనకోటికి స్ఫూర్తినిచ్చింది. ఆలంబనమయినది. ముందుకు నడిపించింది కఠోర వజ్ర సంకల్పం. స్వాతంత్ర్య సాధన ప్రబల ఆకాంక్ష. స్వాతంత్ర్య సాధన అగ్నిహోత్రంలో ఉడుతాభక్తిగ ఎవరికి అందిన సమిదలను వారు జ్వలింపజేసారు. భారత జాతీయ, స్వాతంత్ర్య ఉద్యమాల చరిత్రలో భారతీయ పత్రికలు, పాత్రికేయులు, పత్రికా రచయితలు, సంపాదకులు అత్యంత సాహస వంతంగా నిర్వహించిన పాత్ర మహోజ్వల మయినది. అదొక ఉజ్వల అధ్యాయం. దేశభక్తి ఉద్దేశించిన పత్రికల, స్వాతంత్ర్య యోధులయిన పాత్రికేయుల, పత్రికా రచయితల, సంపాదకుల గొంతు నొక్కడానికి, వారి మేధస్సులను బంధించ డానికి, వారి కలాలకు సంకెళ్లు వేయడానికి బ్రిటిష్ పాలకులు పలు దుష్టచట్టాలను ప్రవేశపెట్టి పత్రికా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు కళ్లెంచారు.

అయినప్పటికీ, అన్ని అవరోధాలను ఎదుర్కొంటూ స్వాతంత్ర్య ప్రియులు పత్రికా ప్రచురణను కొనసాగించారు. తమ పత్రికల ద్వారా స్వాతంత్రోద్యమాన్ని విజృంభింపజేయడానికి అపార కృషి జరిపారు. గాంధీజీ మొదట దక్షిణాఫ్రికాలో, తరువాత స్వదేశంలో తన ఆశయాలకు సిద్ధాంతాలకు కాహళిగా హరిజన్, నవజీవన్ పత్రికలను స్వయంగా తన సంపాదకత్వంలోనే ప్రచురించారు. గాంధీజీ కంటే ముందు గత శతాబ్ది ప్రారంభంలో భారత జాతీయ, స్వాతంత్ర్య ఉద్యమాలలో ప్రముఖ స్థానం ఆక్రమించిన లోకమాన్య బాలగంగాధర తిలక్ స్వరాజ్యం నా జన్మహక్కు అని గర్జించి యువతరాన్ని ఉత్తేజపరిచారు.

ఆయన సంపాదకత్వంలో, మార్గదర్శకత్వంలో ప్రచురితమయిన రెండు పత్రికలు కేసరి (మరాఠీలో) మరాఠా (ఇంగ్లీషు). మహామేధావి తిలక్ ఈ రెండు పత్రికలలో రాసిన వ్యాసాలు వాటిలో, ఆయన ఇతర రచనలు ఆంగ్లేయ పాలకులకు ఆగ్రహం కల్గించాయి. ఆయనకు వ్యతిరేకంగా 1898లో ఒక కేసుపెట్టి 18 మాసాల కఠిన కారాగార శిక్ష విధించారు. 1908లో మరో కేసు పెట్టి 6 సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష విధించి మాండలేల (బర్మాల) నిర్బంధించారు. మండలే జైలులో తిలక్ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. అయినప్పటికి ఆ జైలులోనే ఆ మహా భాష్యకారుడు గీతారహస్య వ్యాఖ్యానం రచించారు. బ్రిటిష్ ఇండియాతో పోల్చినప్పుడు హైదరాబాద్ తదితర సంస్థానా లలో రాచరిక నిరంకుశత్వం ప్రజల హక్కులను జీవితాలను విపరీతంగా అణగదొక్కింది. నాటి హైదరాబాద్ సంస్థానంలో ఒకవంక నిజామ్ నిరంకుశ పాలన, మరోవంక నిజామ్ ప్రోత్సాహంతో మతోన్మాద పైశాచిక మూకల రాక్షసత్వం, అమానుష కృత్యాలు భయంకర పరిస్థితిని సృష్టించాయి.

కవులు, రచయితలు, సంపాదకులు, పత్రికా రచయితలు, మేధావులు, దేశభక్తితో, మానవతా దృక్పదంతో, ఆవేశంతో ఆవేదన పొందిన భయానక మైన రోజులవి. నిజాం రాజు నిరంకుశ పాలనల మతోన్మాదులు చెలరేగి అగ్నిగుండం సృష్టించిన భయంకరమయిన రోజులవి. మారణ హోమం మండిన ఆ రోజుల్లో నిజాం నిరంకుశత్వాన్ని, నిజాం నీడలో పడగలిప్పి బుసకొట్టిన మతోన్మాదాన్ని అమానుషత్వంతో చెలరేగిన దుండగులను నరరూప రాక్షసులను ధైర్యసాహసాలతో ప్రతిఘటించి, వనవత్వ విలువల పరిరక్షణ నిమిత్తం కంకణం కట్టిన నిరుపమాన యోధుడు, పాత్రికేయుడు, పత్రికా సంపాదకుడు షోయబుల్లాఖాన్, పూర్వపు హైదరాబాద్ రాష్ట్ర విముక్తి ఉద్యమ, స్వాతంత్ర్య సమర చరిత్రలో ప్రముఖుడు. షోయబ్ పాత్ర రక్తాక్షరాలతో లిఖితమవుతుంది. ఆయన అసమానత్యాగం ఉత్తేజపరచే ఒక ఉజ్వల అధ్యాయం. ఆ అమరవీరుని గాథ ఆదర్శప్రాయం, చిరస్మరణీయం, హిందూ ముస్లిం సోదరత్వానికి సజీవ ప్రతీక షోయబుల్లాఖాన్.

షోయబ్ పుట్టింది వరంగల్లు జిల్లా మానుకోటలో. ఆయన తండ్రి హబీబుల్లాఖాన్. నిజాం సర్కారులో ఒక పోలీసు అధికారి. షోయబ్ జననానికి చారిత్రక ప్రాధాన్యం ఉంది. దాదాపు వంద సంవత్సరాల కిందట అప్పుడే భారత రాజకీయ రంగంలో అడుగుపెట్టి ఒక వినూత్న రీతి స్వాతంత్ర్య సమరానికి శంఖారావం విన్పించిన గాంధీ మహాత్ముడు దేశమంతటా పర్యటిస్తూ 1920 అక్టోబర్ 12వ తేదీన విజయవాడ నుంచి వార్ధ రైలులో వెళ్లుతూ మానుకోట రైలు స్టేషనులో కొద్ది నిమిషాలు ఆగి అక్కడకి చేరిన అసంఖ్యాక ప్రజలకు

(తరువాయి 8వ పేజీలో)

# తెలంగాణ ప్రజలకు దశాబ్ది ఉత్సవ జేజేలు

ప్రత్యేక తెలంగాణకు తొమ్మిదేండ్లు నిండాయి. సుదీర్ఘ పోరాటం తర్వాత వందలాది మంది ఆత్మబలిదానాల తర్వాత 2014 జూన్ 2న తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఆవిర్భవించింది. జూన్ 2 నుంచి 21 రోజుల పాటు తెలంగాణా దశాబ్ది ఉత్సవాలు ఘనంగా జరగబోతున్నాయి. ఈ ఆనంద సమయంలో తెలంగాణ ప్రజలందరికీ దశాబ్ది ఉత్సవ జేజేలు.

నీళ్లు, నిధులు, నియామకాలు నినాదంగా తెలంగాణా ఉద్యమం సాగింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడిన తర్వాత ఆ కలల సాకారానికి రాష్ట్ర ప్రభుత్వం మిషన్ భగీరథ, కాళేశ్వరం, కాకతీయ మిషన్ ఇతర నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణాల వల్ల తెలంగాణాకి ఆ చివరి నుంచి ఈ చివరి వరకు సాగునీరు, తాగునీరు అందిస్తుంది. వ్యవసాయోత్పత్తిలో జాతీయ స్థాయిలో ముందుంది. నిరంతరం జలాలతో కళకళలాడుతున్న చెరువులు, జలాశయాల్లో మెరుగైన చేపపిల్లల పెంపకానికి చేయూతనిచ్చి వేలాది మత్స్య కార్మికులకు ఉపాధి, ఆక్వా యూనివర్సిటీ ఏర్పాటు చేయబోతుంది. గొర్రెల పెంపకం దార్లకు అండగా నిలిచింది. గురుకులాలు, ఉర్దూ మీడియం స్కూళ్లు, సాంకేతిక కళాశాలల ఏర్పాటుతో విద్యారంగ అభివృద్ధికి బాటలు వేసింది. పారిశ్రామిక రంగంలో లక్షలాది కోట్ల పెట్టుబడులను సంపాదించకలిగింది. ఓఆర్ఆర్, దాని అనుసంధాన రహదారుల నిర్మాణం, మెట్రో వంటి వాటి ద్వారా రవాణా సౌకర్యాలు, హరితహారం, మూసీ సుందరీకరణ, డ్రైనేజీవ్యవస్థల ప్రక్షాళనలకు ప్రణాళికలతో ముందుకు పోతున్నది. దళితబంధు, రైతుబంధులతో పాటు వెనుకబడిన వర్గాలకు, వివిధ చేతివృత్తుల వారికి, స్త్రీలు, మైనార్టీల సంక్షేమం కోసం వివిధ పథకాలు ప్రవేశపెట్టింది. తెలంగాణ సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక రంగాలలో వివిధ కార్యక్రమాల ద్వారా చేయూత నిస్తుంది.

నూతనంగా నిర్మించిన డా॥ బి.ఆర్ అంబేద్కర్ తెలంగాణ సచివాలయం తెలంగాణ పునర్నిర్మాణానికి ప్రతీకగా నిలుస్తోంది. ప్రపంచంలోనే పేరున్న కట్టడాలకు ఏమాత్రం తీసిపోని విధంగా నాణ్యమైన, సౌందర్యం కలిగిన పనితనం ప్రస్ఫుటమయ్యేలా నిర్మించిన ఒక చారిత్రక కట్టడం.

అసమానతలు లేని సమాజ నిర్మాణానికి మహాత్మాఫులే, డా॥ అంబేద్కర్ భావధార ఆవశ్యకతను గుర్తించిన రాష్ట్ర ప్రభుత్వం 125 అడుగుల అంబేద్కర్ విగ్రహాన్ని సచివాలయం సమీపంలో నిర్మించింది.

రాష్ట్ర సాధన కోసం తొలి, మలి ఉద్యమాల్లో తమ ప్రాణాలను త్యాగం చేసిన అమర వీరుల జ్ఞాపకార్థం తెలంగాణ అమరుల స్మారక స్థూపాన్ని సచివాలయం ఎదుట నిర్మించారు. దీనిని జూన్ 2న సీఎం కేసీఆర్‌గారు ఆవిష్కరించనున్నారు. ఇది దీపంలోని జ్వాల దీపారాధనలో ఒత్తి వలె మట్టి ప్రమిద ఆకారంలో నిర్మితమైంది. అంతర్జాతీయ సాంకేతిక నిపుణత దీని ప్రత్యేకత.

దశాబ్ది ఉత్సవాలు జరుపుకుంటున్న తెలంగాణ ప్రజలకు మరోసారి జేజేలు.

వేదకుమార్.యం.

(మణికొండ వేదకుమార్)

ఎడిటర్

(6వ పేజీ తరువాయి)

దర్శనం ఇచ్చారు. ఆ రోజు పోలీసు అధికారి హబీబుల్లాఖాన్ మానుకోట స్టేషనులో శాంతి భద్రతల బాధ్యత, విధి నిర్వర్తించడానికి నియుక్తులయ్యారు.

గాంధీ మహాత్ముడి నిరాడంబరత్వం, ఆయన ముఖంలోని తేజస్సు హబీబుల్లాఖాన్‌ను బాగా ఆకర్షించాయి. స్టేషనులో విధి నిర్వహణ తరువాత ఇంటికి వెళ్ళిన హబీబుల్లా ఖాన్‌కు కొడుకు పుట్టిన శుభవార్త తెలిసింది. తన పసిబిడ్డ ముఖంలో హబీబుల్లాఖాన్‌కు గాంధీ మహాత్ముడు కన్పించాడు. ఆ బిడ్డకు షోయబుల్లాఖాన్ అని నామకరణం చేసారు.

ముద్దుగా అందరు ఆ బిడ్డను 'గాంధీ షోయబ్' అని పిలిచేవారు. షోయబ్‌లో చిన్నప్పటి నుంచే చురుకుతనం ఎక్కువ. బాల్యంలోనే షోయబ్ రచనా పాటవం వికసించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఆయన పట్టభద్రుడు. పట్టభద్రత అనంతరం పత్రికా రచయితగా ఆయన జీవన రంగంలో ప్రవేశించాడు. షోయబ్ పత్రికా రచన మొదట తేజ్ వారపత్రికలో ప్రారంభమయింది. సామాజిక ప్రయోజనంతో, నిజాం నిరంకుశత్వానికి వ్యతి రేకంగా, మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ మతోన్మాదాన్ని ఖండిస్తూ తన లేఖినిని శక్తివంతమయిన ఒక అస్త్రంగా ప్రయోగించడానికి షోయబ్ కంకణం ధరించాడు.



నిజాం నిరంకుశ పాలనలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, అరాచకత్వాలను, తీవ్రంగా విమర్శిస్తూ షోయబ్ రాసిన వ్యాసాలు తేజ్ పత్రికలో ప్రచురితమయినాయి. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ అధిపతి ఖాసిం రజ్వీ దుష్ట విధానాలను, మతతత్వాన్ని, అక్రమ చర్యలను విమర్శించినందుకు నిజాం ప్రభుత్వం తేజ్ పత్రికను నిషేదించింది.

ఆ రోజుల్లో ప్రముఖ స్వాతంత్రోద్యమనాయకులు మందుముల నరసింగరావు సంపాదకత్వంలో వెలువడుతున్న "రయ్యత్" ఉర్దూ పత్రికలో షోయబ్ రచయితగా ప్రవేశించాడు. రయ్యత్ పత్రికలో గూడ షోయబ్ నిర్భయంగా నిజాం నిరంకుశత్వాన్ని, దమన నీతిని, మతోన్మాదాన్ని ఖండిస్తూ రాసాడు. నిజాం ప్రభుత్వం రయ్యత్‌ను సైతం నిషేధించింది. షోయబ్ స్వయంగా, తన సంపాదకత్వంలో ఇమ్రోజ్ పత్రికను ప్రారంభించాడు. నిజాం నిరంకుశ పాలనను, మతతత్వాన్ని అధికారుల దమన నీతిని బట్టబయలు చేసి ఖండించే వార్తలకు, వ్యాఖ్యలకు, సునిశితం విమర్శలకు, మరకలకు షోయబ్ తన పత్రికలో అత్యధిక ప్రాధాన్యం ఇచ్చాడు. స్వతంత్ర భారత యూనియన్‌లో హైదరాబాద్ సంస్థానం బేషరతుగా విలీనం కావాలని షోయబ్ తన పత్రికలో గట్టిగా వాదించాడు.

ఆ రోజుల్లో అది అతి సాహసం. ఖాసిం రజ్వీ బహిరంగంగానే షోయబ్ మీద విమర్శలు కురిపించసాగాడు. షోయబ్‌ను బెదిరిస్తూ ఆకాశరామన్న ఉత్తరాలు రాసాగినవి. నిజాలను వ్యతిరేకించే వారి చేతులను నరికి వేస్తామని బెదిరించారు.

ఈ అనామకుల ఉత్తరాలతో 1948లో హైదరాబాద్ సంస్థానం పరిస్థితి అదుపు తప్పి భయంకర స్వరూపం ధరించింది. ఆ సంవత్సరం ఆగస్టు 20వ తేదీన ఇమ్రోజ్ సంపాదకుడు షోయబ్‌కు మరో బెదిరింపు లేఖ వచ్చింది. అందులో ఆయనను రజ్వీ అనుయాయులు ఘోరంగా దూషించారు. ఆ రోజు సాయంత్రం హైదరాబాద్ నగరం కాచిగూడలో గల ఇమ్రోజ్ పత్రిక కార్యాలయానికి వెళ్ళి బూర్గుల రామకృష్ణారావు తదితరులు షోయిబ్‌తో చాలాసేపు ముచ్చటించారు.

ఆ రోజే అందిన బెదిరింపు లేఖ ప్రస్తావన వచ్చింది. రజ్వీ అనుచరులు మతోన్మాదులని, దుర్మార్గులని, జాగ్రత్తగా ఉండాలని రామకృష్ణారావు ఆందోళన స్వరంతో షోయబ్‌కు సలహా ఇచ్చాడు. నేను గాంధీ మహాత్ముడి అడుగు జాడలలో, అహింసా మార్గంలో నడుస్తూ అన్యాయాలను, అక్రమాలను వ్యతిరేకిస్తున్నాను. మతోన్మాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాను. నా మాతృభూమి భారతదేశం కోసం ప్రాణత్యాగం చేయడానికైనా సిద్ధమే.... అని షోయబ్ నిశ్చలంగా రామకృష్ణారావుతో అన్నాడు. తరువాత ఆగస్టు 22వ తేదీన షోయబ్ రాత్రి 12 గంటలకు యధాప్రకారం పత్రిక పని పూర్తి చేసి దగ్గరలో ఉన్న ఇంటికి వెళ్ళుతున్నాడు. ఆ నడిరాత్రి షోయబ్ మీద రజాకార్ రక్కసులు, మతో న్మాదులు దాడి చేశారు. షోయబ్ వెంట ఉన్న సహచరుడు ఇస్మాయిల్ ఖాన్ గూడ దుండగుల దాడిలో గాయపడ్డాడు. ఇస్మాయిల్ ఖాన్ బిగ్గరగా వేసిన కేకలు విని చుట్టుపక్కల వారు బయటికి వచ్చారు. రజాకార్ దుండగులు పారిపోయారు. రక్తపు మడుగులో షోయబ్‌ను వెంటనే ఆసుపత్రికి తరలించారు. 'ఇమ్రోజ్ పత్రిక ప్రచురణ ఆగరాదు. ధర్మం జయిస్తుంది...' అన్న చివరి సందేశంతో దేశభక్తుడు, యువ సంపాదకుడు షోయబుల్లాఖాన్ ఆసుపత్రిలో చేరిన కొన్ని గంటలకే అమరుడయ్యాడు. అప్పుడు షోయబ్ వయస్సు అరవయి ఎనిమిది సంవత్సరాలు.

ఆ రోజుల్లో భారత ప్రభుత్వపు ఏజెంట్ జనరల్‌గా హైదరాబాదులో ఉన్న జాతీయ నాయకుడు, భారత రాజ్యాంగ రచన కమిటీ సభ్యుడు కె.ఎమ్. మున్నీ యువ సంపాదకుడు షోయబ్ జాతీయవాది, దేశభక్తుడు, సాహసవంతుడైన జర్నలిస్ట్ అని మున్నీ ప్రశంసించారు. పూర్వపు హైదరాబాద్ సంస్థానం విముక్తి ఉద్యమ చరిత్రలో, విశేషించి నాటి పాత్రికేయులు అత్యంత సాహసవంతంగా నిర్వహించిన పాత్రలో యువసంపాదకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, మానవతావాది షోయబుల్లాఖాన్ త్యాగ గాథ నిరుపమానమయినది. ఉన్నత పాత్రికేయ ప్రమాణాలకు విలువ ఇచ్చే పాత్రికేయులు, సంపాదకులందరికి షోయబ్ ఆదర్శప్రాయుడు.

*(తెలంగాణ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ ప్రచురించిన 'తెలంగాణ తేజోమూర్తులు' నుంచి)*

**-దేవులపల్లి ప్రభాకరరావు**



# నిజాం హైదరాబాదు సంస్థానంలో దళిత ఉద్యమం

మనదేశంలో బాబాసాహెబ్ అంబేద్కర్ అస్పృశ్యతకు కులవివక్షకు వ్యతిరేకంగా 1916లో ఉద్యమం ప్రారంభిస్తే మహాత్మాగాంధీ హరిజనోద్యమం 1921లో మొదలైంది. అత్యంత ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ఈ రెండింటికన్న ముందే 1906లోనే నిజాం హైదరాబాదు రాష్ట్రంలో దళిత ఉద్యమాన్ని భాగ్యరెడ్డివర్మ అనే సంఘసంస్కర్త శ్రీకారం చుట్టిండు. మాదరి భాగయ్య అనే తెలంగాణ మాదిగ కులానికి చెందిన వ్యక్తి భాగ్యరెడ్డివర్మ అనేపేరుతో జగన్ మిత్రమండలి స్థాపించి దళితుల్లో చైతన్యం కలిగించడానికి మరియు అగ్రకులాల్లో వున్న అస్పృశ్యతా భావాన్ని తొలగించడానికి ఎంతగానో కృషిచేశారు. ఇతనిపై బ్రహ్మ సమాజ ప్రభావం అధికంగా ఉండేది. నాటి తెలంగాణలో ప్రత్యేకంగా దళితులలో కొనసాగుతుండిన జోగిని దురాచారానికి వ్యతిరేకంగా తొలి ఆలోచనలు చేసిన వ్యక్తి భాగ్యరెడ్డి వర్మనే అని నిస్సందేహంగా చెప్పవచ్చు. 1911లో ఆదిహిందూ సోషల్ సర్వీసెస్ లీగ్ సంస్థను స్థాపించి దక్కన్ హ్యూమానిటేరియన్ లీగ్ సంస్థకు కార్యదర్శిగా ఉంటూ భాగ్యరెడ్డివర్మ ఆదిహిందూ ఉద్యమాన్ని ప్రారంభించారు. ఆది హిందువులే ఈ దేశ మూలవాసులని అగ్రవర్ణాలవారు ఆర్యులని విదేశాల నుండి ఈ దేశానికి వలస వచ్చిన ఈ అగ్రవర్ణాలవారు మూలవాసులైన తమను అణచివేస్తూ పెత్తనం చెలాయిస్తున్నారని దృఢంగా విశ్వసించేవాడు. ఆ విశ్వాసంతో హైదరాబాదు సంస్థానంలో వున్న దళితులను ఆదిహిందువులుగా పేర్కొన్నారు. ఆయన మొదటిపేరు భాగయ్య. ఆర్యసమాజంవారు ఆయన సేవలను గుర్తించి 1913లో వర్మ అను బిరుదును ప్రధానం చేసినారు. భాగ్యరెడ్డివర్మ ఇతర కులాలలోని అభ్యుదయ భావాలు కలిగిన వ్యక్తులను ఆకర్షించి వారి సహాయం పొందారు. ఆయన భావాలతో ఏకీభవించిన నిజాం న్యాయవ్యవస్థలో న్యాయమూర్తిగా పనిజేస్తుండిన రాయ్‌బాలముకుంద్, మునగాలరాజు నాయని వెంకటరంగారావు. మాడిపాటి హనుమంతరావు రాజాబహద్దూర్ పద్మారావు శ్రీకిషన్ నారాయణ్ గుణాజి వెలింకర్ వంటి నాటి హైదరాబాదు సంస్థాన ప్రముఖులెందరో నాటి ఆది హిందూ లీగ్ కార్యక్రమాల్లో పాల్గొనేవారు. మద్రాసు రాష్ట్రం నుంచి కాశీనాథుని నాగేశ్వర్‌రావు ఆదిహిందూలీగ్ కార్యక్రమాలకు ఆర్థిక సహాయం చేసేవాడని తెలుస్తుంది. ఆదిహిందూలీగ్ బాలబాలికల విద్యాభివృద్ధిపై దృష్టిని సారించి పనిచేసింది. వయోజన హరిజనుల కోసం రాత్రి పాఠశాలలు నిర్వహించింది. 1925లో హైదరాబాదు నగరంలో ప్లేగువ్యాధి వ్యాపించినప్పుడు ఆదిహిందూలీగ్ నాయకత్వంలో స్వచ్ఛంద సేవాదళం అపారమైన సేవాకార్యక్రమములు నిర్వహించి సవర్ణుల ఆదరాభిమానాలు సాధించింది. అని మందముల నర్సింగ్‌రావుగారు తన ఆత్మకథ అయినటువంటి "50 సంవత్సరాల హైదరాబాదు"లో పేర్కొన్నారు. హరిజనుల సమస్యలపై సమాజంలో అవగాహన కల్పించే నిమిత్తం "హైదరాబాదు" అను తెలుగు వారపత్రికను నడిపేవారు. ఆదిహిందూ భవనంలో గ్రంథాలయం, పఠనాలయం, బాలబాలికలకు పాఠశాలలను నిర్వహించేవారు.

భాగ్యరెడ్డివర్మ స్థాపించిన జగన్‌మిత్రమండలి అస్పృశ్యతా నిర్మూలను కృషిచేసేది. హరికథలు, భజనలు, సభల ద్వారా ప్రజల్లో చైతన్యం తెచ్చేందుకు కృషిచేసింది. జగన్ మిత్రమండలి 1911లో మన్యసంఘంగా మారింది. బాల్య వివాహాలకు వ్యతిరేకంగా దేవదాసి, జోగిని వంటి సాంఘిక దురాచారాల నిర్మూలనకై పనిజేసింది. 1915లో భాగ్యరెడ్డివర్మ గారు "స్వస్తిక్‌దళ్" అను సంస్థను స్థాపించారు. ఈ సంస్థ సభ్యులు సామాజిక సేవాకార్యక్రమాల్లో పాల్గొనేవారు.




1925లో ప్లేగువ్యాధి హైదరాబాదులో వ్యాపించినప్పుడు ఈ సంస్థ సభ్యులు రోగులకు సేవలందించారు. బాలకుముద్, సేట్ ఘనశ్యాంజీ, దరమ్‌వీర్, వామన్‌నాయక్ మొదలగు వారు ఈ సంస్థ సభ్యులుగా కొనసాగినారు. భాగ్యరెడ్డివర్మ ఆదిహిందూ వాలంటీర్ దళాన్ని మరియు దేవదాసి నిర్మూలనా సంఘాలను స్థాపించి జోగినీ దురాచార నిర్మూలనకు కృషి చేసిండు. పాండురంగ జోషి, మాడిపాటి హనుమంతరావు ధర్మవీర వామన్‌నాయక్‌లతో కలిసి అంబర్‌పేటలో హిందూ స్మశాన వాటికను ఏర్పాటు చేశారు. 1921లో "ఆదిహిందూ సామాజిక సేవా సమాఖ్య"ను ఏర్పాటు చేశారు. దీని మొదటి సదస్సు 1921లో హైదరాబాద్‌లో జరిగింది. దీనికి అధ్యక్షత వహించింది. టి.జె. పాపన్న బెల్గాంవాసి. 1924 వరకు జరిగిన ఆదిహిందూ మహాసభలకు అధ్యక్షత వహించిన ప్రముఖులు కేశవరావు వామన్‌నాయక్ రాజా ధన్‌రాజ్‌గిర్‌లు. 1930లో జోగీపేటలో జరిగిన మొదటి ఆంధ్రమహాసభ సమావేశంలో భాగ్యరెడ్డివర్మ పాల్గొని

అంటరానితన నిర్మూలన హరిజన విద్యాభివృద్ధికి సంబంధించిన తీర్మానాలను ఆమోదింపజేశారు. ఆరోజుల్లో ఆదిహిందూ ఉద్యమ ప్రచారానికి అనేక నాటకాలు వేసేవారు. ఆ నాటకాల్లో ప్రధానమైంది. "సత్యహరిశ్చంద్ర" నాటకం. బాలబాలికల కోసం జంటనగరాలలో అనేక పాఠశాలలు ఏర్పాటు చేశారు. 1934 నాటికి 26 పాఠశాలలను ఏర్పాటుచేశారు. వీటిని నిజాం ప్రభుత్వం చేపెట్టి నడిపింది. భాగ్యరెడ్డివర్మ దేవదాసీ వ్యవస్థ నిర్మూలనకు చేసిన కృషి వల్లనే నిజాం ప్రభుత్వం "దేవదాసీ" వ్యవస్థను రద్దు చేస్తూ ఫర్మానా జారీ చేసింది.


భాగ్యరెడ్డివర్మ

అరిగె రామస్వామి భాగ్యరెడ్డివర్మ సమకాలికుడు. నిజాం హైదరాబాదు సంస్థానంలో దళితుల చైతన్యానికి కులవివక్షకు వ్యతిరేకంగా ఉద్యమాలు చేపట్టి దళితుల్లో వున్న మూఢ విశ్వాసాలు జంతుబలులు బాల్యవివాహాలకు వ్యతిరేకంగా ముమ్మర ప్రచారల కొనసాగించారు. బ్రహ్మసమాజ సిద్ధాంతాన్ని అనుసరించినప్పటికి ఇతను దళితులు హిందువులు వేరని విశ్వసించేవాడు. 1922లో ఆదిహిందూ జాతీయోన్నతి సభను స్థాపించి ఆ సంస్థ ద్వారా దేవదాసీ నిర్మూలనకు పనిజేసిండు తరువాతి కాలంలో అరుంధతీయ మహాసభను స్థాపించి మాదిగకులాల్లో చైతన్యం కలిగించారు. అరిగే రామస్వామి సంఘ సంస్కర్తే కాదు గొప్ప కవికూడా.


అరిగె రామస్వామి

అంబేద్కర్ అడుగుజాడల్లో దళితవర్గాల విముక్తికై నిజాం సంస్థానంలో మరో ఉద్యమం నడిపిన వ్యక్తి డా॥ బి.యస్. వెంకట్రావు. నిజాం రాష్ట్రంలోని దళితుల విద్యా ఉపాధి, రాజకీయ రంగాలలో అనేక హక్కులు సాధించిపెట్టిన ఘనత ఆయనది. దళితుల్లో మూఢనమ్మకాలు జంతుబలులు మద్యపానం వంటి వాటికి వ్యతిరేకంగా పోరాడి వారిలో విద్యావ్యాప్తికి కృషి చేసిండు. వెంకట్రావు అనేక దళిత సంఘాల్ని స్థాపించిండు. 1922లో ఆది ద్రావిడ సంఘంను 1927లో అరిగె రామస్వామితో కలిసి ఆదిహిందూ మహాసభను స్థాపించారు. ఈ సంస్థల ద్వారా దేవదాసీ వ్యవస్థ నిర్మూలనకు మరియు దళితుల ఐక్యతకు ఎనలేని కృషి చేసిండు. 1926లో సికింద్రాబాదులో ఆదిహిందూ మహాసభను స్థాపించి దానికి అనుబంధంగా గ్రంథాలయాన్ని నెలకొల్పి దళితుల్లో విద్యావ్యాప్తికై రాత్రి పాఠశాలను ప్రారంభించారు. 1936లో "అంబేద్కర్ యూత్‌లీగ్"ను స్థాపించి దళిత యువకుల ప్రగతికి కృషిచేసిండు.

1947లో విద్యాశాఖ మంత్రిగా నిజాం హైదరాబాదు రాష్ట్రంలో నియమితులై మెట్రిక్ పాసైన దళిత విద్యార్థులందరికి కాలేజీలలో ప్రవేశం కల్పించిండు. అర్హులైన దళిత విద్యార్థులకు నిజాం ప్రభుత్వం ద్వారా విదేశీ విద్యావకాశాన్ని కల్పించారు. దేశంలోనే తొలిసారిగా నిజాంను ఒప్పించి కోటిరూపాయతో షెడ్యూల్డు కులాల ట్రస్ట్‌ఫండ్ పేరుతో దళిత సంక్షేమం కోసం ప్రత్యేక నిధిని ఏర్పాటు చేయించారు. చిన్న చిన్న దళిత సంఘాలన్నింటిని ఏకం చేసి "హైదరాబాదు డిప్రెస్ట్ క్లాసెస్ అసోసియేషన్"ను ఏర్పాటు చేశారు. నిజాం హైదరాబాద్ రాష్ట్రంలో దళితవర్గాలకు డా.బి.యస్. వెంకట్రావు చేసిన సేవలకు గుర్తింపుగా అతను "హైదరాబాదు అంబేద్కర్"గా ప్రసిద్ధి పొందాడు. పూర్వహైదరాబాదు రాష్ట్రంలోని ఔరంగాబాదు జిల్లాకు చెందిన బత్తుల శ్యామ్‌సుందర్ బి.యస్. వెంకట్రావుతో కలిసి దళిత జాతుల సమాఖ్య కార్యదర్శిగా పనిజేసిండు. కొంతకాలం అంబేద్కర్ స్థాపించిన షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్‌కు అధ్యక్షులుగా ఉన్నారు. హైదరాబాద్ రాష్ట్ర దళిత సమస్యల్ని నిజాం ప్రభుత్వం దృష్టికి తీసుకెల్లడంలో ప్రముఖపాత్ర పోషించారు. దళితులు తమ అభివృద్ధి కోసం సామాజిక రాజకీయ హక్కుల కోసం ముస్లింలతో కలిసి ఉద్యమించి సాధించుకోవాలనేది అతని అభిప్రాయం. పెక్కుజాతీయ అంతర్జాతీయ వేదికలపై దళితుల స్థితిగతుల్ని శ్యామ్‌సుందర్ ప్రస్తావించారు. దళితులు తమ ఆత్మగౌరవం చిహ్నంగా అంబేద్కర్ విగ్రహాలను ప్రతిష్టించే కార్యక్రమాన్ని తొలిసారిగా బీదర్‌ల శ్రీకారం చుట్టారు. 1957లో ఇండియా డిప్రెస్డ్ క్లాసెస్ అసోసియేషన్ అధ్యక్షుడిగా దేశంలోని దళితుల ఐక్యతకు కృషి చేసిండు. 1968లో శ్యామ్‌సుందర్ మరాట్వాడి యూనివర్సిటికి అంబేద్కర్ పేరు పెట్టాలని సూచించారు.

భాగ్యరెడ్డివర్మ రామస్వామి వెంకట్రావు శ్యామ్‌సుందర్‌లతో పాటు వారి సహచరుల కార్యక్రమాలతో వారు స్థాపించిన సంస్థలతో పాఠశాలలతో దళితులలో క్రమంగా చైతన్యం వికసించి అది రాష్ట్ర వ్యాప్తంగా వేరు వేరు రూపాల దళిత ఆత్మగౌరవ ప్రకటనా ఉద్యమంగా క్రమంగా రూపుదిద్దుకుంది అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

- ప్రొ॥ జి.లక్ష్మణ్,
m : 98491 36104
e: laxmangadeou@gmail.com


# రాముడు కాదు కృష్ణుడు కాదు

ఆ తర్వాత చాలా సంవత్సరాల వరకు అతను రోడ్లమీద పిచ్చివాడిలా తిరుగుతూ, భిక్షమెత్తుకుంటూ కనిపించేవాడు. మళ్ళీ కొన్ని రోజులకు పూర్తిగా కనబడకుండా మాయమయ్యాడు.

× × ×

ఆ నెలలోనే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన రోజులు. శాలిబండలోని రూప్‌లాల్ బజార్ బస్తీల ఉండే నానక్‌బౌలి వద్ద మేం ఇల్లుకొనుక్కున్న రోజులు. అప్పుడు ఆరేండ్ల వయసు నాది. నేను మా తమ్ముడు జ్ఞాని మా ఇంటి ముందు వాకిట్లో ఆడుకుంటుంటే అతను మొదటిసారి కనిపించాడు. అతని పేరు రామకృష్ణ నాందేడ్‌కర్ అని తర్వాత మాకు తెలిసింది. మాకన్నా ఏడెనిమిదేండ్లు పెద్ద కావొచ్చు. సన్నగా పొడుగ్గా తెల్లగా మెరుస్తున్న కండ్లతో నల్లని వాలు జుట్టుతో అందంగా ఉన్నాడు.

వాళ్లది మా పక్కిల్లు. మరాఠీ చిత్పవన్ బ్రాహ్మణులు. తెలుగురాదు. మమ్మల్ని చూడగానే "అన్నా అన్నా ఆంధ్రావాలే ఆలా" అని అరుచుకుంట వాళ్ల ఇంట్లకు పరిగెత్తిండు. మరాఠీలో అన్నా అంటే నాన్నా అని ఆలా అంటే వచ్చారు అని అర్థం. అతని వ్యవహారం మాకేమీ అర్థం కాలేదు. ఆంధ్రా అంటే ఏమిటో ఇంకా అస్సలు అర్థం కాలేదు. అప్పుడప్పుడూ కనబడి పలకరించేవాడు. అతని మరాఠీ గోల మాకు అర్థం కాలే. దీపావళి పండుగనాడు మాకు బోలెడన్ని పటాకులు ఇచ్చి దోస్తీ చేసుకునేందుకు ప్రయత్నించాడు. అయినా మేము అతనికి దగ్గరకాలే. అతని మరాఠీ బాష మాకు అర్థం కాకపోవడమే గాక మాకంటే పెద్దవాడు కావున దూరం దూరంగానే ఉండేవాళ్లం.



వాళ్లనాన్న పేరు విఠల్‌రావ్ నాందేడ్‌కర్. మహారాష్ట్రులకు తమ పేరు పక్కన వారి వూరి పేరుకూడా పెట్టుకునే సాంప్రదాయం ఉంది. నాందేడ్ నుంచి వచ్చినవారు కావున నాందేడ్‌కర్ అన్నమాట. ఆయన బాగా వయస్సు మళ్లిన వృద్ధుడు. తెల్లని శరీర ఛాయతో ముఖం కాంతివంతంగా, విద్యావంతంగా కనిపించేది. తలపై నల్లని మఖ్మల్ టోపీతో పాటు మెడలో తెల్లని ముత్యాల దండ వేలాడుతూ ఉండి చూపరులకు ఆయన రూపం గౌరవం కలిగించేది. ఆయన పెద్ద భార్య సాక్షాత్తు నిలువెత్తు లక్ష్మీదేవి విగ్రహం. మరాఠీ వేషభాషల ఆహార్యంతో చాలా కళగా ఉండేది. కాని సంతానం కలగనందున చాలా. కాలానికి మళ్లీ రెండవ పెళ్లి చేసుకుంటే ఇద్దరు కొడుకులు ఒక ఆడపిల్ల కలిగారు. ఇక రెండవ భార్య సరేసరి. సాక్షాత్తు సర్వతీదేవి. బాగా ధనవంతులు కావున మరాఠీ సంస్కృతీ సాంప్రదాయాలతో ఇల్లు కళకళ లాడుతూ ఉండేది. వారి భవంతిలోని ప్రతి దర్వాజాకు వేలాడే రంగురంగుల జలతారు పూసల పరదాలు మా చిన్ని కండ్లకు సరదాగా కనిపించేవి. ఆ ఆడవాళ్ల ముదురు రంగు గళ్లగళ్ల చీరెలు, జాకెట్లు వాటిపై చారల జరీ అంచులు, గోచీపోసిన చీరకట్టు, దట్టమైన కేశాలతో కొప్పు, దాని చుట్టూ ముడిచిన మల్లెపూలు మమ్మల్ని ఆకర్షించేవి.

రాజారవి వర్మ చిత్రాలలోని సుందరిమణులందరూ ఈ మరాఠీ అందాల అతివలకు ప్రతీకలే. వారింట్లో గ్రామఫోన్ నుండి హమేషా హీరాబాయి బరోడ్‌కర్ పాడిన హిందుస్థానీ సంగీతం మంద్రంగా జాలువారుతుండేది.

దసరాకు ముందు దేవీ నవరాత్రుల పూజలప్పుడు సాయంకాలాల్లో వారింటికి హారతి సమయంలో మేము వెళ్లినప్పుడు నవధాన్యాలతో మొలిపించిన పచ్చగరికపోచలు, మంచి శ్రేష్టమైన నెయ్యితో దూపదీప నైవేద్యాలు. ఓం జయ జగదీష హరే భజనలు మమ్మల్ని మరో లోకంలోకి, మంత్రనగరిలోకి తీసుకెళ్లి మరిపించి మురిపించేవి. ఆ పవిత్ర పరిమళ భరిత సువాసనలతో మా లేత మనసులు మత్తేక్కేవి. చప్పట్లు కొడుతూ మేము హిందీ భజన గీతాలాలాపించాక స్వచ్ఛమైన పాలకోవాతో చేసిన తియ్యటి 'పేడా'లను మాకు ప్రసాదంగా పంచేవారు. ప్రతిరోజూ ప్రసాదం మారుతూ వుండేది. ఒకసారి రవ్వాకేసరి, మరోరోజు పూరన్‌పోలీ, ఆపైన ఆమ్ కా రస్‌లో ముంచుకుని తినేందుకు పూరీలు. "ఆలూ టమాటా - ఘీ కా పరోటా"లతో వాళ్ల వంటిల్లు గుమగుమ లాడుతుండేది.

విఠల్‌రావ్ గారికి మా బాపుతో దోస్తానా కలిగి వారి గురించి ఇంకా మాకు చాలా సంగతులు తెలిసాయి. మా శాలిబండలో మరాఠీ బ్రాహ్మణుల ఇండ్లు ఎక్కువ. హైదరాబాద్ నగరంలో ఎక్కడకూడా వీరి జనాభా ఇంత కానరాదు. ఖుతుబ్‌షాహీ నవాబులకు శివాజీ మహారాజ్‌కు ఢిల్లీ మొగల్ చక్రవర్తి ఔరంగజేబును ఎదిరించే విషయంలో ఒక సఖ్యత ఉన్నందున వీరు హైదరాబాద్ రాజ్యానికి వచ్చి శాలిబండలో స్థిర నివాసాలు ఏర్పరుచుకున్నారు. అట్లా

వచ్చినవారే విఠల్‌రావ్ గారి పూర్వీకులు. వృత్తి పరంగా వీరు మహాగణికులు.

ఖుతుబ్ షాహీల కాలంలోనే గాక ఆసఫ్ జాహీ నిజాముల కాలంలోని ప్రధానమంత్రులు, పేష్కార్లు, దివాన్‌లు శాలిబండలోనే దేవుడీలు, హవేలీలు, మంజిల్‌లు కట్టుకున్నందున ఆరోజులల్ల శాలిబండ మషూర్ అయ్యి "పట్నంలో శాలిబండ పేరైనా గొల్కొండ" అని మారుమోగి పోయింది. ఇప్పుడు బంజారాహిల్స్, జూబ్లీహిల్స్ మాదిరిగా. అట్ల శాలిబండలో మహారాష్ట్రీయులు ఒక విడదీయలేని భాగం అయినారు.

కాలవాహిని అలల వాలున కాలం గిర్రున తిరిగి మరో పదేండ్లు గడిచినయ్. రామకృష్ణ కాలేజీ చదువులకు వచ్చిండు. అతని తమ్ముడు మోహన్ కాస్తా మందబుద్ధి కావున చదువు ఒంటబట్టలే. విఠల్‌రావ్ గారికి వయస్సు ముదిరి అనారోగ్యం కలగగానే పెద్ద కొడుకు రామకృష్ణకు పెళ్లి చేశాడు. కోడలు చక్కని చుక్క

పెద్దాయన హఠాత్తుగా కాలం చెందాడు. సగం చదువులోనే ఉన్న రామకృష్ణ ఇంటి బాధ్యత నెత్తిమీద వేసుకున్నాడు. అయితే అతి త్వరలోనే పరిస్థితులన్నీ తలక్రిందులుగా మారిపోయినయి. మొత్తం బస్తీలోనే బుద్ధి మంతుడిగా పేరుతెచ్చుకున్న రామకృష్ణ ఒక తాగుబోతు, పేకాట వ్యసన పరుడిగా మారే సరికి వాళ్ల బంధువర్గమే గాక బస్తీ మొత్తం నివ్వెరపోయింది.

> కాలవాహిని అలల వాలున కాలం గిర్రున తిరిగి మరో పదేండ్లు గడిచినయ్. రామకృష్ణ కాలేజీ చదువులకు వచ్చిండు. అతని తమ్ముడు మోహన్ కాస్తా మందబుద్ధి కావున చదువు ఒంటబట్టలే. విఠల్‌రావ్ గారికి వయస్సు ముదిరి అనారోగ్యం కలగగానే పెద్ద కొడుకు రామకృష్ణకు పెళ్లి చేశాడు.

"వినాశకాలే విపరీత బుద్ధి" అన్నట్లు ప్రతిరోజు అర్ధరాత్రి దాకా తాగి ఇంటికి రావటం, రాగానే భార్యతో సహా అందర్నీ కొట్టటం, అరవటం, ఇంట్లోని సామానులు విసిరేసి గొడవ చేయటం ప్రతిరోజూ జరిగేది. డబ్బుల కోసం వారందర్ని పీడించి ఇల్లు గుల్ల చేయటమే గాక త్రిజోడీలో ఉన్న నగదు ఖతం కాగానే బంగారు నగలకు విలువైన వస్తువులకు కాళ్లొచ్చి అవతలికి నడిచి పోయినయ్. కొన్ని రోజులు ఇంటికి రాకపోయినా మళ్లీ ఏదో ఒక రోజు డబ్బులు అయిపోయేసరికి తన ఆవారా సావాసగాండ్లతో గుంపుగా వచ్చి గొడవచేసి కుర్చీలు, టేబుళ్లు, బీరువాలతో సహా సామానులన్నీ మోసుకుపోయి అమ్ముకున్నాడు. బంధువర్గం నచ్చ చెప్పటానికి వస్తే కత్తి తీసుకుని వారి మీదికి హత్యాప్రయత్నం చేసే సరికి వారందరూ బెదిరి పరుగు లంకించుకున్నారు. ఇద్దరు అమ్మలు, భార్య, చెల్లె, తమ్ముడు ప్రాణ భయంతో రాత్రోరాత్రి కట్టుబట్టలతో వారి స్వగ్రామం నాందేడ్‌కు పారిపోయారు. దాంతో ఇంకా రెచ్చిపోయి తలుపులు, దర్వాజాలు ఊడపీకి ఈ తర్వాత గోడలు కూలగొట్టి ఇటుకలు, రాళ్లు కూడా అమ్ముకునే సరికి ఒకప్పుడు వైభవోజ్వలంగా వెలిగిన ఆ భవంతి కూలిపోయి ముందు మొండిగోడలతో నిలబడి, ఆ తర్వాత పెంటదిబ్బలా మారిపోయింది.

మా అమ్మా బాపులతో సహా బస్తీ అంతా ఏడ్చింది. పోరడు మదీనా బిర్యానీ, చార్మినార్ భరండి, మోహందీకి రండీకు బాగా అలవాటయ్యిండని ఓ ముసలాయన వ్యాఖ్యానించిండు. కాదు బతికున్నప్పుడు ఆ ముసలాయన కొడుకుకు ఒక పైసా అయినా ఇవ్వలేదని మహా పిసినారి అని ఆయన పోగానే ఈ పిల్లవాడు హఠాత్తుగా వచ్చిన స్వాతంత్ర్యాన్ని, పెత్తనాన్ని ఎట్లా సంభాళించు కోవాలో తెలియక ఇట్లా చెడిపోయాడని మరికొందరన్నారు.

ఆ ఇంట్లో నుండి లక్ష్మీదేవి వెళ్లిపోయిందని అందుకే ఇనుపగజ్జెల తల్లి నాట్యం చేసిందని మరికొందరు అనుకున్నారు. ఏదేమైతేనేం సర్వనాశనం జరిగిపోయింది.

అప్పుడు మా బస్తీలకు ఒక పరివ్రాజకుడు ప్రవేశించాడు.

"తుల్జాభవానీ" దేవీ నవరాత్రుల ఉత్సవాల సందర్భంగా ఆ సాధువు మరాఠాదేశంలోని పండరిపురం నుండి కాలినడకన బయలుదేరి హైద్రాబాద్ పట్నంల వున్న మరాఠీల గృహాలకు వెళ్లి భిక్ష స్వీకరించేవాడు. ఆ సాధుపుంగవుడు ఏక్‌తారా లాంటి వాయిద్యాన్ని చూపుడు వేలితో సున్నితంగా మీటుతూ, గొంతెత్తి శ్రావ్యంగా సంత్‌జ్ఞానేశ్వర్, భక్త తూకారాం, నామ్‌దేవ్‌ల భజనలు, ముక్తి మార్గానికి సంబంధించిన జ్ఞాన బోధనల గీతాలను అతి మధురంగా ఆలపించేవాడు. ఒకప్పుడు అటుబెంగాల్ ఇటు మరాఠా ప్రాంతాలు భక్తి ఉద్యమాలకు ప్రధాన నిలయాలు అయినందున అక్కడి ప్రజల హృదయాలు, మేధస్సులు సున్నితంగా, సారవంతంగా మారి కాలానుగుణంగా బెంగాలులో విప్లవోద్యమాలు, మహారాష్ట్రలో శివసేన లాంటి ఉపజాతి ఉద్యమాలు ఆవిర్భవించినాయి.

ఆ సాధువు విఠల్‌రావ్ నాందేడ్‌కర్ గృహం బర్బాద్ ఐపోయి చివరికి నేలమట్టమై పెంటదిబ్బగా మారిందని తెలుసుకుని జనాంతికంగా "జైసీ కర్నీ వైసీ భర్నీ" అని విచారవదనంతో వ్యాఖ్యానించిండు. చేసిన కర్మల ప్రకారం వచ్చే ఫలితాలు, పాపాలు అనుభవించక తప్పదు అని దాని అర్థం.

"లోగుట్టు పెరుమాళ్లకెరుక" అన్నట్లు ఎవరికీ తెలియని ఒక చిదంబర రహస్యం ఆ సాధువుకు మాత్రమే తెలుసు.

విఠల్‌రావ్ తండ్రిపేరు శివాజీ. శివాజీ తమ్ముడు తానాజీ. వారి పూర్వీకులు కూడా శాలిబండలోని ఈ ఇంటిలోనే నివసించేవారు. ఔరంగజేబు గోల్కొండకోటపై దాడిచేసి గెలిచిన తర్వాత మొగల్‌పురాలో విడిది చేసిన మొగల్‌సైన్యం పక్కనే శాలీబండాలో వున్న సంపన్న మరాఠీల గృహాలపై దాడులు చేసి హత్యలు, అత్యాచారాలు, దోపిడీలు యధేచ్ఛగా కొనసాగించారు. యుద్ధనియమాల ప్రకారం ఒక దేశాన్ని గెలిచిన తర్వాత సైనికులకు వరుసగా మూడు రోజులు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేవారు. నగరాన్ని, ప్రజలను దోపిడీ చేయటానికి. ఢిల్లీ షహెన్‌షా ఔరంగజేబ్‌కు మరాఠాలు కూడా వ్యతిరేకం కావున మొగల్ సైనికులకు మరాఠీల మీద ద్వేషం.

అట్లా ఆ మూడు రోజులు శాలిబండ వీధులలో మరాఠీల

రక్తం కాలువలుగా పారింది. ప్రజలు నిలువుదోపిడీలకు గురైనారు. ఆ ముష్కర సైనికులకు తమ సంపద దక్కకూడదని శివాజీ-తానాజీ పూర్వీకులు తమ ఇంటివెనకనున్న పెరడులో పెద్ద గుంత తీసి, వజ్రాలు, వైఢూర్యాలు, ఏడు వారాల బంగారు ఆభరణాలను ఒక పురాతన భోషాణంలో భద్రపరచి దానిని ఆ గుంతలో పూడ్చిపెట్టి పైనుండి మట్టి కప్పారు. నిజానికి ఆ సొత్తు వారి స్వంతం కాదు. రైతుల శ్రమను దోచి, వారి పొలాలను, ఇండ్లను ఆక్రమించి, అధిక వడ్డీలు వసూలు చేసి అన్యాయంగా సంపాదించిన సొత్తు అది.

కాలప్రవాహంలో తరాలు మారినాక ఆ గుప్తనిధుల రహస్యం శివాజీ- తానాజీలకు తెలిసిపోయింది. ఎందరో తాంత్రికులను, మాంత్రికులను సంప్రదించి, క్షుద్రపూజలను చేయించి నిధి నిక్షిప్తం చేయబడిన స్థలాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నించారు. చివరికి కౌపీన పాత్రధారి ఐన ఒక గోసాయి ఆ ఇంటికి భిక్షకోసం వచ్చి "నిధి - సన్నిధి"లోనే ఒక పెద్ద అరిష్టం కాలనాగులా కాటు వేయటానికి కాచుకుని ఉందని ఆ ప్రయత్నం మానుకొమ్మని ఆ అన్నదమ్ములకు అడగకుండానే ఒక సలహా ఇచ్చి, వారు తేరుకొని వెదికేలోపున ఆ గోసాయి అదృశ్యమైనాడు.

ఆ అన్నదమ్ముల నెత్తుల మీద శనిదేవత తిష్టవేసుకుని కూచుందేమో? వారు మాత్రం తమ ప్రయత్నాలను మానలేదు. చివరికి ఒకానొక నిండు అమావాస్య కాళరాత్రి అన్నదమ్ములు పట్టు వదలని విక్రమార్కుల్లా ఆ పెరడులోని ఈశాన్య భాగాన్ని తవ్వుతుంటే వారి గునపాలకు ఏదో తగిలి కంగుమని శబ్దం వచ్చింది. వారిద్దరి కండ్లు ఆశతో తళుక్కుమని మెరిసాయి. త్రవ్వగా తవ్వగా వారికి చిలుము పట్టిన ఒక పాత ఇనుప భోషాణం కనబడింది. అతి కష్టంగా దాన్ని ఇవతలికి తీసారు.

ఒక్క గునపం దెబ్బతో తుప్పు పట్టిన ఆ పాత తాళం ఊడి పడింది. అన్న శివాజీకి "సోయి" వచ్చి గోసాయి చెప్పిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది. ఎందుకైనా మంచిదని అసలు సమయంలో ఒకడుగు వెనక్కి వేసాడు. ముందు జాగ్రత్త చర్యగా! తెలివి తక్కువ తమ్ముడు తానాజీ ఉత్సాహంతో భోషాణం మూత తీసాడు. చూపరుల కండ్లను జిగేలుమని మెరిపించే కనక మహాలక్ష్మి అందులో నిక్షిప్తమైవుంది.

వెలుగులు విరజిమ్మే ఆ బంగారు ఆభరణాల కాంతులకు తమ్ముడు తానాజీకి కండ్లు ఖైర్లుకమ్మి మతి చలించింది. "కెవ్వు" మని దిక్కులు పిక్కటిల్లేటట్లు ఒక కేక వేసాడు. అది సంతోషమో! భయమో శివాజీకి అర్థం కాలేదు. తమ్ముడికి నోటిమాట కూడా పడిపోయిందని గమనించాడు. తానాజీ పిచ్చిపిచ్చిగా అరుచుకుంటూ ఒంటిమీద బట్టలన్నీ చింపుకుని, ఆ చీలికలు, పేలికలయిన గుడ్డలతోనే వీధిలోకి పరిగెత్తాడు. ఆ నిశ్శబ్ద నిశిరాత్రిలో అతనేమైనాడో, ఎక్కడికి వెళ్లినాడో ఆ తర్వాత ఎవరూ కనుక్కోలేక పోయారు.

**వెలుగులు విరజిమ్మే ఆ బంగారు ఆభరణాల కాంతులకు తమ్ముడు తానాజీకి కండ్లు ఖైర్లుకమ్మి మతి చలించింది. "కెవ్వు" మని దిక్కులు పిక్కటిల్లేటట్లు ఒక కేక వేసాడు. అది సంతోషమో! భయమో శివాజీకి అర్థం కాలేదు. తమ్ముడికి నోటిమాట కూడా పడిపోయిందని గమనించాడు. తానాజీ పిచ్చిపిచ్చిగా అరుచుకుంటూ ఒంటిమీద బట్టలన్నీ చింపుకుని, ఆ చీలికలు, పేలికలయిన గుడ్డలతోనే వీధిలోకి పరిగెత్తాడు.**

దుష్టశక్తులకు, నవగ్రహాలకు, శని దేవతకు శాంతిపూజలు చేసిన తర్వాత శివాజీ ఆ భోషాణాన్ని మంచి ముహూర్తంలో ఇంటిలోకి తరలించాడు. శివాజీ తరంలోనూ, ఆయన కొడుకు విఠల్‌రావ్ తరంలోనూ ఆ ఇంటిలో "అష్టలక్ష్మి అదృష్టదేవత" అన్ని విధాలా కొలువు తీరింది.

కాని ఏం లాభం?

విఠల్‌రావ్ కొడుకు రామకృష్ణ తరం వచ్చేసరికి "భస్మధారి - కౌపీన పాత్రధారి" ఐన గోసాయి మాట నిజమయ్యింది.

"తరాలు మారినా శనిదేవత రాసిన తలరాత మాత్రం మారలేదు."

కొన్ని సంవత్సరాల తర్వాత పూర్తిగా ఫటీచర్ ఆకారంలో కాళ్లకు చేతులకు ముఖానికి తగిలిన దెబ్బలతో రామకృష్ణ మా ఇంటికి వచ్చి బాపును కలిసి 'మాస్టర్ సాబ్' అని కాళ్లమీద పడి ఏడ్చాడు. ఇంతకాలం ముషీరాబాద్ జైలులో ఉన్నాడట ఏదో కేసులో ఇరికించబడి. ఆకలైతుందంటే అమ్మ అన్నం పెట్టింది. బాపును పైసలడిగితే ఎంతో కొంత ఇచ్చాడు. అవి తీసుకుని సంతోషంతో వెళ్లిపోయాడు. వెళ్తున్న అతన్ని చూసి మా అమ్మ కన్నీళ్లు పెట్టుకుంది.

మళ్లీ నెలకో రెండు నెల్లకో వచ్చాడు భోరున ఏడున్నా నాందేడ్‌లో అమ్మ చచ్చిపోయింది. రైలు చార్జీలకు పైసలు కావాలని అడిగాడు. మనిషి కనబడని ఏవేవో రోగాలతో నవిసి నవిసి దగ్గరపడుతున్నట్లు అనిపించింది. కడుపునిండా అన్నం పెట్టి దారి ఖర్చుల బత్తెం ఇచ్చి మళ్లీ పంపటం జరిగింది.

తర్వాత చాలా కాలానికి శాలిబండ దేవుడీ గడియారం ముందు నడిరోడ్డుమీద నిలబడి పిచ్చోడిలా అరవటం అందరూ చూశారు. కన్నీళ్లు పెట్టని వారు లేరు వానకు, గాలికి, చలికి అట్లనే రోడ్లమీద తిరుగుతూ చనిపోయాడు. అమాయకంగా తెల్లగా, నాజూకుగా మెరిసే కండ్లతో వాలు జట్టుతో ఉండే రామకృష్ణ అనే సదాచార సంపన్న కుటుంబంలోని ఆ పిల్లగాడు చీకటి ఆకాశంలో తెగిన చుక్కలా మారి ఆది అంతం లేని ఆకాశమార్గంలో అదృశ్యమైనాడు.

**"టూటా జిస్ తారే పే**
**నజర్ తీ హమారీ"**

("అనాడీ" సీన్మాపాట)

*(చార్‌మినార్ కథలు-పుస్తకం నుంచి)*

**-పరవస్తు లోకేశ్వర్,**
m: 91606 80847
e : lokeshwar.hyderabadi@gmail.com

ద

# ఎ మౌంటెన్ ఫర్ మిరైడ్ రీజన్స్ : నందా దేవి

నేను కాలేజీ విద్యార్థిగా ఉన్నప్పుడు 'వై మెన్ క్లైంబ్?" అనే శీర్షికతో ఉన్న వ్యాసాన్ని చదివిన రోజులు నాకిప్పటికీ గుర్తున్నాయి. అప్పట్లో యువకులుగా ఉన్న నేపథ్యంలో ఆ శీర్షిక ఆ వ్యాసాన్ని చదివేలా మమ్మల్ని రెచ్చగొట్టింది. రచయిత చెప్పిన కారణాల్లో 'అవి అక్కడ ఉన్నందుకు' అనేది కూడా ఒకటి. సీరియస్ వ్యాసాల్లో అసందర్భంగా ఉద్దేశ పూర్వకంగా కాస్తంత హాస్యాన్ని జోడించే ప్రయత్నాలు కొందరు చేస్తుంటారు. ఆ కారణం కూడా అలాంటిదే. సవాళ్లను ఎదుర్కోవడం, సామర్థ్యాలను పరీక్షించుకోవడం, కఠిన పరిస్థితులను ఎదుర్కోవడాన్ని ఇష్టపడడం, తన లోని పూర్తి శక్తిసామర్థ్యాలను చేరుకోవడం... ఇలా మరెన్నో కారణాల గురించి కూడా ఆ రచయిత ప్రస్తావించారు.




తరాలుగా పర్వతాలు మనుషులను సవాల్ చేస్తూనే ఉన్నాయి. పర్వతాలు ఎంత పాతకాలం నాటివో.. వాటిని అధిరోహించేందుకు జరిగిన ప్రయత్నాలు కూడా అంతే పాతకాలానివి. సాహసికులు కొందరు ఆ సవాళ్లలో నెగ్గి సగర్వంగా తలలెత్తారు.... మరెందరో పర్వతాలకు లొంగిపోయి తలలు వంచారు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న పర్వత శ్రేణులను చూస్తే... అన్నింటిలోకీ హిమాలయాలు సరికొత్తవి, అత్యంత ఎత్తయినవి. ఏళ్లుగా అవి పర్వతారోహకులను తమ శిఖరాగ్రాలకు చేరు కోవాల్సిందిగా ఆహ్వానిస్తూనే ఉన్నాయి. యువతరం మాదిరిగానే హిమాలయాల్లోనూ నిలకడ తక్కువే. హఠాత్ ప్రవృత్తి అధికం. వాతావరణం దానికి ఇష్టం వచ్చినట్లుగా మారుతూ ఉంటుంది. ఎప్పటికప్పుడు మారుతూ ఉండే వాతావరణాన్ని అంచనా వేయడంలో ఎంతో మంది పర్వతా రోహకులు విఫలమవుతుంటారు. దాంతో వారి ప్రణాళికలు గాడి తప్పుతుంటాయి. కొన్ని సందర్భాల్లో పైకి ఎక్కలేక వెనుదిరిగి రావాల్సి వస్తుంది.

మహోన్నత హిమాలయ శిఖరాల్లో ఒకటి నందా దేవి. పురాణగాథ, ఆకర్షణ కలగలసి పుస్తక రచయిత సందీప్ మదాడిని నందాదేవి పర్వతాన్ని మోహించేలా చేశాయి. దాంతో ఆయన తన స్నేహితులు రాజ్, సాయిలతో కలసి నందా దేవి ప్రయాణం చేశారు. ఆయనకు ఉన్నంత ఆసక్తి, ఆ స్నేహితులకు లేనట్లుంది. నందా దేవి పై ఉన్న పురాణగాథలను, మార్మికతలను సందీప్ డమ్మీసైజులోని వందపేజీల పుస్తకంలో కళ్లకు కట్టినట్లుగా వివరించారు. ప్రఖ్యాత ఇతిహాసాల గురించి మాత్రమే కాదు... అక్కడ నివసించే ప్రజల అతి సాధారణ జీవితం గురించీ రాశారు. అస్తిత్వాన్ని చాటుకునే భావోద్వేగాల గురించీ వర్ణించారు. స్థానిక వీరుల సాహసాలనూ అభివర్ణించారు. పర్వతారోహణలో ఎదురయ్యే ప్రమాదాల గురించి ఎలాంటి అస్పష్టత లేకుండా చక్కగా వర్ణించారు. పర్వతాలపైకి ప్రయాణం అంటే... అది కూడా మంచుతో కప్పబడి ఉండే వాటి పైకి అంటే... అదేమీ విహారపర్యటన కాదు. ఒక్కోసారి ఇక ప్రయాణాన్ని రద్దు చేసుకొని వెనక్కు వెళ్ళిపోదాం అన్నంతగా చిరాకు పుట్టుకొస్తుంటుంది. అదే సమయంలో... ప్రకృతి అందాలను చూస్తే మాత్రం బాధలన్నీ మర్చిపోయి ఆ అందాలతో మమేకమవుతాం. ఆ అందాలను చూడడంలో మనల్ని మించిన అదృష్టవంతులు మరెవరూ లేరనుకుంటాం. అప్పటి వరకు పడ్డ కష్టాలన్నీ మర్చిపోతాం. శిఖరం పైభాగాల నుంచి జారిపడడం, కొండచరియలు విరిగిపడి సన్నటి బాటలను మూసేయడం, పర్వతారోహణలోని ప్రతికూలతలు... ఇలా వీటన్నిటినీ ప్రస్తావించారు. అయితే పాఠకులు 76 పేజీలు చదివిన తరువాత మాత్రమే నందా దేవి విశ్వరూపాన్ని సందర్శించ గలుగుతారు. శిఖరాన్ని అధిరోహించిన వారు స్వయంగా తమ అనుభవాలు చెబుతుంటే... అవి ఆకట్టుకునేలా ఉంటే.... పాఠకులు తాము స్వయంగా నందా దేవి వద్ద ఉన్నట్లుగా అనుభూతి చెందుతుంటారు. నందాదేవిని అధిరోహించేందుకు జరిగిన ప్రయత్నాలను ఆసక్తికరంగా వివరించారు రచయిత. 1883 నుంచి 2003 వరకు వివిధ పర్వతారోహణ బృందాల ప్రయత్నాలను చక్కగా వివరించారు. మంచు శిఖరాలు, లోయల బ్లాక్ అండ్ వైట్ ఫోటోలు హిమాలయ ప్రాంత స్థితిగతులపై అవగాహన కల్పించే విధంగా ఉన్నాయి. పుస్తకం చివర్లో సంబంధిత సాంకేతిక పదాల జాబితా ఇచ్చారు. ఆయా వర్ణనలను అర్థం చేసుకునేందుకు అవి తోడ్పడుతాయి.

నందా దేవిని 1982లో నేషనల్ పార్క్‌గా ప్రకటించారు. నాటి నుంచి లోతట్టు ప్రాంతాలు జనానికి దూరంగానే ఉంటున్నాయి. నందా దేవి అంటేనే వదంతులకు నిలయం. నందా దేవి శిఖరంపై విదేశీ గూఢచర్య సంస్థ ఒకటి ప్లుటోనియం ఇంధనం కలిగిన ఒక ఉపకరణాన్ని అమర్చిందనే దానిపై నేటికీ ఎలాంటి సంతృప్తికర వివరణలు లేవు. నందా దేవి ఒక పర్వతం మాత్రమే కాదు... ఆశీస్సులు అందించే దేవత కూడా. ఆమె చుట్టూరా ఎన్నో నిగూఢ రహస్యాలు. ఎలా చూసినా అది ఒక శిఖరం మాత్రమే కాదు... మరెన్నో అన్వేషణలు జరగాల్సి ఉంది. కొండలెక్కేందుకు.... పర్వతాలను అధిరోహించేందుకు మనలో ప్రతీ ఒక్కరం ఒక్కో కారణాన్ని కలిగి ఉంటాం. అలాంటి కారణాలేవీ మీకు గనుక లేకుంటే... పర్వతారోహణ చేసేందుకు మీకు అవసరమైన కారణాన్ని ఈ పుస్తకం అందిస్తుంది అనడంలో సందేహం లేదు.

రచయిత : **సందీప్ మదాడి,** రూపా బుక్స్ ఇండియా,
పేజీలు 132, వెల : రూ. 299

**- తడకమళ్ల వివేక్**
m : 93910 99727
e: tadakamallavivek@yahoo.co.in



# నిత్యం ప్రకృతి ఒడిలో

## జూన్ 5న ప్రపంచ పర్యావరణ దినోత్సవం

థీమ్ : "ప్లాస్టిక్ కాలుష్యానికి పరిష్కారాలు" (Solutions to Plastic Pollution)

ప్రపంచ పర్యావరణ దినోత్సవం అనగానే మన మనసులో ఏదో తెలియని ఆనందం కలుగుతుంది. ఎందుకంటే మనం నిత్యం ప్రకృతితో అటాచ్ అయి ఉంటాం. చిన్నప్పుడు స్కూళ్లలో మొక్కలు నాటుతాం. అలాంటి కార్యక్రమాల్లో పాల్గొని... ఓ మంచి పని చేసిన ఫీల్ పొందుతాం. ఆ ఫీల్ మనలో ఎప్పటికీ ఉంటుంది. ప్రకృతిని ప్రేమించడం కంటే గొప్ప విషయం ఏముంటుంది.. అలా ప్రేమిస్తే... పర్యావరణానికి హాని చెయ్యలేం. సో.. ఈ సందర్భంగా కొన్ని విషయాలు మాట్లాడుకుందాం.

ప్రతి సంవత్సరం జూన్ 5 రాగానే... ప్రపంచం మొత్తం పర్యావరణం గురించి మాట్లాడుకుంటుంది. ఎందుకంటే అది ప్రపంచ పర్యావరణ దినోత్సవం కాబట్టి. భూమికి కలుగుతున్న రకరకాల కాలుష్యాలను ఎలా తగ్గించాలో చర్చిస్తాయి. ఏం చెయ్యాలో ఆలోచిస్తాయి. తీర్మానాలు చేస్తాయి. అవగాహనా కార్యక్రమాలు జరుపుతాయి. స్కూళ్లలో కూడా విద్యార్థులకు ఈ రోజు ప్రాధాన్యాన్ని టీచర్లు వివరిస్తారు. ఇవన్నీ ప్రతి సంవత్సరం జరిగేవే. మరి నిజంగానే భూమిని మనం కాపాడుతున్నామా? అంటే లేదు అన్నదే సమాధానం.



1972లో తొలిసారి ప్రపంచ పర్యావరణ దినాన్ని ఐక్యరాజ్యసమితి ప్రకటించింది. ఆ రోజు.. మానవ పర్యావరణం అనే అంశంపై స్వీడన్ రాజధాని స్టాక్‌హోమ్‌లో పెద్ద కాన్ఫరెన్స్ పెట్టింది. 1973లో తొలి ప్రపంచ పర్యావరణ దినోత్సవం జరిపింది.

చిత్రమేంటంటే... ఇలాంటి రోజు వచ్చినప్పుడు దేశాలన్నీ భూమిపై ఎంతో ప్రేమ చూపిస్తాయి. నెక్స్ట్ డే నుంచి కథ మామూలే. భూమికి అత్యంత హాని చేస్తున్నది మనుషులే. ప్రపంచ దేశాల ప్రభుత్వాలన్నీ రకరకాల కాలుష్యాలను సముద్రాల్లోకి పంపిస్తున్నాయి. ఇక ప్లాస్టిక్ వ్యర్థాల సమస్య ఉండనే ఉంది. ఇవి చాలనట్లు అధిక జనాభా సమస్య మరొకటి. వీటికి తోడు భూతాపం.

ప్రపంచాన్ని ప్లాస్టిక్ ముంచెత్తుతోంది. ప్రతి సంవత్సరం 400 మిలియన్ టన్నుల కంటే ఎక్కువ ప్లాస్టిక్ ఉత్పత్తి చేయబడుతుంది. అందులో నగం ఒక్కసారి మాత్రమే ఉపయోగించబడేలా రూపొందించబడింది.

ఇప్పుడు తెలుగు రాష్ట్రాల్లో ఎండలు భగ్గుమంటున్నాయంటే కారణం భూతాపమే. తెలంగాణలో 9 ఏళ్లుగా హరితహారంలో కోట్ల మొక్కలు పెంచినా... చల్లదనం రావట్లేదంటే కారణం.. వాయు కాలుష్యం అంతకంటే ఎక్కువగా ఉండటం వల్లే.

ఈ భూమిపై ఒకప్పుడు చాలా రకాల ప్రాణులుండేవి. అవన్నీ అంతరించిపోయాయి. ఇప్పటికీ చాలా వాటిని చంపేస్తున్నారు. పక్షులు చూద్దామన్నా కనిపించట్లేదు. తేనెటీగల సంఖ్య తగ్గిపోతోంది. ఫలితంగా ఆహార దిగుబడి తగ్గుతోంది. దిగుబడి పెంచేందుకు పురుగుమందులు, రసాయనాలు వాడుతుంటే.. భూమి నాశనం అవుతోంది. సముద్ర జీవుల్ని కూడా బతకనివ్వట్లేదు. ప్రభుత్వాల మాటలే తప్ప చేతల్లో పర్యావరణ రక్షణ కనిపించట్లేదని ప్రకృతి ప్రేమికులు ఏటా ఆవేదన చెందుతూనే ఉన్నారు.

ఈ సంవత్సరం "ప్లాస్టిక్ కాలుష్యానికి పరిష్కారాలు" (solutions to plastic pollution) అనే థీమ్‌ని ఐక్యరాజ్యసమితి (UNO) ప్రకటించింది. నిజమే మనకు జీవించేందుకు ఉన్నది ఒకటే భూమి. ఇది నాశనం అయితే... మనకు దిక్కుండదు. కానీ దీన్ని కాపాడే విషయంలోనే ప్రభుత్వాలన్నీ ఒకే లైన్‌లోకి వచ్చి ఫెయిలవుతున్నాయి.

ప్రపంచ పర్యావరణ దినోత్సవానికి ప్రతి సంవత్సరం ఒక్కో దేశం ఆతిథ్యం ఇస్తుంది. ఈ దినోత్సవానికి ఇది 50వ పుట్టిన రోజు. ఈ సంవత్సరం నెదర్లాండ్స్‌లో వేడుకలు జరగనున్నాయి. యునైటెడ్ నేషన్స్ ఎన్విరాన్‌మెంట్ ప్రోగ్రామ్ (UNEP), దాని భాగస్వామ్య సంస్థలు... ఈ కార్యక్రమాన్ని జరుపుతున్నాయి. అత్యున్నతస్థాయి అంతర్జాతీయ సమావేశం ఏర్పాటు చేసి.. భూమిని కాపాడేందుకు ఏం చెయ్యాలో చర్చిస్తారు.

ఏం చెయ్యాలి?

- కాలుష్యాన్ని తగ్గించాలంటే... సోలార్ పవర్ ఉత్పత్తి పెంచుకోవాలి. ఇళ్లలో లెడ్ లైట్ల వాడకం పెరగాలి. ప్లాస్టిక్ రీసైక్లింగ్ పక్కాగా అమలవ్వాలి. అడవుల్ని పెంచాలి. చెట్లను నరికేవాళ్లపై కఠిన చర్యలు తీసుకోవాలి. భారీ చెట్లను తొలగించాల్సి వస్తే.. వాటిని మరో చోట నాటాలి. వ్యవసాయంలో సంప్రదాయ (సేంద్రియ - organic) వ్యవసాయ పద్ధతుల్ని జోరుగా అమలుచెయ్యాలి. ఎలక్ట్రిక్ వాహనాల వాడకం పెంచాలి. ఇవన్నీ మనకు తెలిసినవే... వీటి అమలే సరిగా జరగట్లేదు. అదే సమస్యవుతోంది.
- భూమిపై కొద్దిగా ఉండే వజ్రాలకు ఎంతో విలువ. అలాంటిది ఈ విశ్వంలోనే మనం జీవించేందుకు వీలైన ఒకే ఒక్కటి భూమి. దానికి విలువ కట్టలేం. అమూల్యమైనది. దాన్ని కాపాడుకుందాం. చేతనైనంతగా ప్రయత్నిద్దాం.
- భూమి మన ఇల్లు. దీన్ని పరిశుభ్రంగా, పచ్చగా ఉంచుదాం. ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా ఈ ప్రకృతిని కాపాడతామని ప్రతిజ్ఞ చేద్దాం.
- పంచ భూతాల్ని కాలుష్యమయం చేస్తే... ఆ మసి అంటుకునేది మనకే. నాశనం అయ్యేది మన జీవితాలే. ప్రళయ బాధితులం అయ్యేది మనమే. నిల్చున్న కొమ్మనే నరుక్కుంటున్నాం. ఇకనైనా ప్రకృతిని కాపాడే దిశగా అడుగులు వేద్దాం.
- పర్యావరణం లేనిదే మనం లేము. ప్రకృతి లేనిదే మన అభివృద్ధి లేదు. వాటిని కాపాడుకుందాం.
- మన చుట్టుపక్కల వాతావరణాన్ని కాపాడుకోవాలని గుర్తుచేస్తోంది ప్రపంచ పర్యావరణ దినోత్సవం. మన భూమిని పచ్చగా, ఆరోగ్యంగా ఉంచుతామని ప్రమాణం చేద్దాం.
- ఆ దైవం ఈ భూమిని మనకు బహుమతిగా ఇచ్చింది. దీన్ని కాపాడాల్సిన బాధ్యత మనపై ఉంది. ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా మన బాధ్యతల్ని నెరవేర్చుదాం.

ప్రకృతిపై మహనీయుల అభిప్రాయాలు

- "మనం ప్రపంచ అడవులకు ఏం చేస్తున్నామో.. అది అద్దంలో ప్రతిబింబం లాగా... తిరిగి మనకే చెందుతుంది"
  – మహాత్మాగాంధీ
- "ఈ భూమి అందంగా, ఆనందంగా ఉండేందుకు... మనం అవకాశం ఇవ్వకపోతే... ఇది చివరికి ఆహారాన్ని కూడా ఉత్పత్తి చేయదు"
  – జోసెఫ్ విడ్ క్రట్చ్
- "మనం పర్యావరణాన్ని నాశనం చేసుకుంటే... మనం బతికేందుకు ఏదీ ఉండదు"
  – మార్గరెట్ మీడ్
- "ఇప్పుడు గాలిలో చాలా కాలుష్యం ఉంది. అది మన ఊపిరితిత్తులలో కాకపోతే... మరెక్కడా ఉంచడానికి స్థలం లేదు"
  – రాబర్ట్ ఓర్బెన్
- "పరిరక్షణ అనేది మనుషులు, భూమి మధ్య సామరస్య స్థితి"
  – ఆల్డో లియోపోల్డ్
- "చక్కటి పర్యావరణానికి పక్షులు నిదర్శనం. ఇవాళ వాటికి సమస్య వస్తే... ఆ తర్వాత రేపు మనకు ఆ సమస్య వస్తుంది"
  – రోజర్ టోరీ పీటర్సన్

– సత్యప్రసన్న
m : 9030 6262 88
e: desk.deccan@gmail.com




# ఉమ్మడి కరీంనగర్ జిల్లా శిలా మరియు ఖనిజ సంపద

ఉమ్మడి కరీంనగర్ జిల్లాలోని శిలలు ఆర్కియన్ మీసో-నియో ప్రోటిరోజోయిక్ మరియు పేలియోజోయిక్ పిరియడ్స్‌కు చెందినవి. ఆర్కియన్‌కు చెందిన పెనిన్సులర్ నైసిక్ కాంప్లెక్స్‌లో ఎన్‌క్లేవస్ రూపంలో గ్రానులైట్స్‌ను చూడవచ్చును. ఈ గ్రానులైట్స్ ఒక పొడగాటి బెల్ట్‌గా గుర్తించబడినది. ఈ బెల్ట్ నార్త్‌వెస్ట్-సౌత్‌ఈస్ట్ దిశలో ఉన్నది. దీనికి కరీంనగర్ గ్రానులైట్ బెల్ట్‌గా నామకరణం చేయబడినది. ఈ పి.జి.సి కి ఈశాన్యంలో ప్రోటిరోజోయిక్ పీరియడ్‌కు చెందిన పాకాల్, సుల్లవాయి మరియు పేలియోజోయిక్ మరియు మీసోజోయిక్ పీరియడ్‌కు చెందిన గోండ్‌వానా శిలలు కలవు.

దాదాపుగా మొత్తం పశ్చిమ భాగంలో పి.జి.సి విస్తరించి యున్నది. దీనిలో చాలావరకు, టోనలైట్ గ్రానోడైయరైట్, గ్రానైట్, పింక్ మరియు గ్రేమిగ్మ టైట్‌శిలలుతో కూడినది. వీటిలో నార్త్-సౌత్, నార్త్ వెస్ట్-సౌత్‌ఈస్ట్, నార్త్ ఈస్ట్-సౌత్ వెస్ట్ దిశలో ఉన్న డోలరైట్ మరియు గ్యాబ్రోలను చూడవచ్చును. వీటికి మినహా క్వార్ట్జ్ వీన్స్ నార్త్-సౌత్ ట్రెండ్‌తో కూడియున్నవి.

ప్రాణహిత-గోదావరి వేలీలో ప్రోటిరోజోయిక్ పీరియడ్‌కు చెందిన పాకాల్, పెన్‌గంగా, సుల్లవాయ్ శిలలు స్లువాయ్ శిలల పైన చాలా మొత్తంలో గోండ్‌వానా శిలలు ఈ ప్రాంతంలో ఒదిగి ఉన్నవి. జిల్లా పశ్చిమ ప్రాంతంలో సిరిసిల్లా-జగిత్యాల మరియు మెట్‌పల్లి మధ్యలో మీసోజోయిక్-ఎర్లీటెర్షరీ పీరియడ్‌కు చెందిన డక్కన్ బసాల్ట్‌ను పి.జి.సి పైన చూడవచ్చును. పి.జి.సి కి ప్రోటిరోజోయిక్ శిలల మధ్య కాంటాక్ట్ ఒక పెద్ద ఫాల్ట్‌తో కూడినది. ఇది నార్త్‌వెస్ట్-సౌత్ ఈస్ట్ దిశలో ఉన్నది, మంథని ప్రాంతంలో చాలా చిన్న చిన్న ఫాల్ట్‌లు గుర్తించబడినవి.

ఈ జిల్లా యొక్క ఖనిజ సంపద ప్రధమంగా బొగ్గు నిక్షేపాలు, లైమ్‌స్టోన్, ఐరన్‌ఓర్, మాలిబ్‌డినైట్, స్టియటైట్ మరియు డైమెన్‌శన్ స్టోన్స్.

**బొగ్గు నిక్షేపాలు:**

బొగ్గునిక్షేపాలు గోదావరి ఖని ప్రాంతంలో రామగుండం పరిసరాలలో, రెండు బ్లాక్స్ జి.ఎస్.ఐ తీసుకోవడం జరిగినది. ఆ బ్లాక్స్ రామగుండం మరియు ఖమనపల్లి ప్రాంతాలలో ఉన్నవి. ఈ ప్రాంతాన్ని రామగుండం బొగ్గుబెల్ట్‌గా గుర్తించబడినది. ఈప్రాంతంలోని బొగ్గు నాన్‌కోకింగ్ వెరైటి, చాలా మొత్తంలో బూడిద మరియు తేమ కలిగియుండడం విశేషం.

రామగుండం బ్లాక్‌లో 1665 మిలియన్‌టన్నులు మరియు ఖమనపల్లి బ్లాక్‌లో 3639 మిలియన్‌టన్నులు రిసర్వ్ ఎస్టిమేట్



గ్రానైట్ బ్లాక్స్



రింకొసారస్-
అస్తిపంజరం-కాటారం



పింక్ గ్రానైట్-మక్తా



మాపిల్ రెడ్
గ్రానైట్



గ్రానైట్ మైన్



గ్రానైట్ కొండ రామడుగు

చేయబడినది. గోదావరిఖని ప్రాంతంలో ఫర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారు బొగ్గు ఆధారిత ఫర్టిలైజర్ ప్లాంట్‌ను నెలకొల్పారు.

**ఐరన్‌ఓర్:**

ఈ ప్రాంతంలో ఇనుము ముఖ్యంగా మాగ్నటైట్ రూపంలో ఉన్నది. దీనిలో 60% ఇనుముతో కూడినది. ఈ ఖనిజము ఎర్రబెల్లి పరిసరాలలో దొరుకును. ఇదికాకుండా అంబర్‌పేట (జగిత్యాల)దగ్గర 35%-40% ఇనుము కలిగియున్నది. మాగ్నటైట్ క్వార్ట్‌జైట్ ఛ్యండ్స్ అర్నకొండ, మల్లాపూర్, చొప్పదండి మరియు కరీంనగర్, అంక్‌శెట్టిపేట రోడ్‌లో అక్కడక్కడా దొరుకుతుంది.

**లైమ్‌స్టోన్:**

వీటి నిక్షేపాలు తకాలపల్లి, నేరెళ్లప్రాంతంలో ఉన్నవి. వీటిని కెసోరం సిమెంట్స్ లిమిటెడ్ వారు మైనింగ్‌చేస్తున్నారు. ఈ జిల్లా యొక్క ఈశాన్య ప్రాంతంలో ఇంచంపల్లి పరిసరాలలో పెద్ద మొత్తంగా లైమ్‌స్టోన్ నిక్షేపాలు ఉన్నట్టు సర్వేక్షణ ద్వారా నిర్ధారించబడినది.

**మాలిబ్డినమ్:**

మాలిబ్‌డినైట అనే మాలిబ్‌డినమ్ ఖనిజము పోలంపల్లి, సునిమ్‌గ్రామ్, బసవాపూర్ మరియు గౌర్‌వెల్లి ప్రాంతాలలో గ్రానైట్ మరియు పెగ్‌మటైట్ శిలలో గుర్తించబడినది. ఈ మాలిబ్‌డినమ్ బెల్ట్ అనగాపేట నుండి మాచాపురం వరకు 39 కి.మీ. పొడవు, 13 కి.మీ. వెడల్పుగా ఉన్నది. మాలిబ్ డినమ్ కొన్ని ప్రత్యేకమైన స్టీల్స్ తయారిలో ఉపయోగిస్తారు. దీని ఉపయోగం ఎలక్ట్రికల్ పరిశ్రమలో మరియు కొన్ని విశేషమైన ఇంక్‌లు, గ్లేజ్‌లు తయారు చేయడానికి వాడుతారు.

**వోల్లాస్టనైట్:**

ఈ ఖనిజం ఆమకొండ ప్రాంతంలో కాల్క్‌సిలికేట్ శిలలలో చిన్న బాండ్స్ లెన్సెస్ రూపంలో ఉన్నట్టు సర్వేక్షణ ద్వారా నిర్ధారించారు.

**సర్పెంటినైట్:**

ఈ శిలలు చొప్పదండిప్రాంతంలో ఉన్నవి. ఈ శిలలు వివిధ రంగులలో దొరుకును. ఉదాహరణకు: ఆకుపచ్చ మారూన్. వీటి ఆకర్షణ గల రంగులవల్ల శిల్పాలు చెక్కడానికి మరియు డెకరేటివ్ శిలగా వాడుతున్నారు.

**రేడియో ఎక్టివ్ ఖనిజాలు:**

ఇలాంటి ఖనిజాలు చొప్పదండికి తూర్పులో భూపాలపట్నం మరియు ఎర్రబల్లి దగ్గర ఆలిగోమిక్టివ్ కంగ్లామరేట శిలలో గుర్తించబడినవి.

**డైమెన్షన్ స్టోన్:**

ఈ జిల్లాలో పార్ఫిరిటిక్ గ్రానైట్‌ను కమర్షియల్‌గా టాన్‌బ్రౌన్ గ్రానైట్, మాపిల్ రెడ్ గ్రానైట్‌గా ప్రసిద్ధి చెందినది. వీటిని ఎక్‌ఫ్టోర్స్ చేస్తున్నారు. లోకల్ మార్కెట్‌లో కూడా చాలా డిమాండ్ ఉన్నది. వీటి క్వారీలు తడికల్-కేసి పట్నం మధ్యలో, మరియు కరీంనగర్-హుజూరాబాద్ మధ్యలో, కొత్తగట్టు, నెమలికొండ, రామడుగు ప్రాంతాలలో ఉన్నవి. మక్తా ప్రాంతంలో పింక్ గ్రానైట్ కలదు. సుల్లవాయి సాండ్‌స్టోన్ కూడా డెకోరేటివ్ శిలగా వాడుతున్నారు.

ఈ జిల్లాలోని కాటారం గ్రామ పరిసరాలలో రింకొసారస్ అనే డైనొసార్ యొక్క అస్తిపంజరాన్ని మలెరి ఫార్మెశన్ త్రొవ్వి తీసారు. జిఎస్ఐ పెలెంటలాజిస్టులు.

**- కమతం మహేందర్ రెడ్డి,**
m : +91 90320 12955
e: mahikam.reddy0@gmail.com



# కర్ణాటక అప్పర్ భద్రాకు ఒక న్యాయం - తెలంగాణ పాలమూరుకు మరొక న్యాయమా ?

**పాలమూరు ప్రాజెక్టు విషాద చరిత్ర :**

పాలమూరు జిల్లాది ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక విషాద గాథ. పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకానిది ఒక పోరాట చరిత్ర. 1956 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడడం వలన అధికంగా నష్టపోయిన జిల్లా పాలమూరు జిల్లా. ఫజల్ అలీ కమిషన్ సిఫారసుల మేరకు హైదరాబాద్ రాష్ట్రంగా కొనసాగి ఉండి ఉంటె అప్పర్ కృష్ణా, భీమా, తుంగభద్రా ఎడమ కాలువ ద్వారా దాదాపు 7 లక్షల ఎకరాలకు సాగునీరు అంది ఉండేది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు వలన ఈ అవకాశం పూర్తిగా పోగొట్టుకున్నజిల్లా. పాలమూరు జిల్లా మొత్తం విస్తీర్ణం 43.73 లక్షల ఎకరాలు ఉంటె అందులో వ్యవసాయ యోగ్యమైన భూమి దాదాపు 35 లక్షల ఎకరాలు. ఉమ్మడి రాష్ట్రంలో సాగునీటి సౌకర్యం ఉన్న భూమి 4.5 లక్షల ఎకరాలు మాత్రమే. ఇందులో ఒక లక్ష ఎకరాలకు సాగునీరు అందించే జూరాల, 87 వేల ఎకరాలకు బదులు 30 వేల ఎకరాలే పారే రాజోలిబండ మళ్లింపు పథకం, 2.5 లక్షల ఎకరాలకు బదులు 75 వేల ఎకరాలకు సాగునీరు అందించే చెరువులు ఉన్నాయి. జిల్లాలో మొత్తం మీద నికరంగా దాదాపు 2 లక్షల ఎకరాలకే సాగునీరు అందుతున్నది. ఉమ్మడి రాష్ట్ర పాలనలో సాగునీరు అందించే ఆలోచనే లేని కారణంగా పాలమూరు ప్రజలకు బతుకు దెరువు కోసం వలసలే గతి అయినాయి.ప్రతిపాదిత భీమా, కల్వకుర్తి, నెట్టెంపాడు పథకాలు నిరంతరం ఫైళ్ళల్లో మగ్గుతూ వచ్చాయి.




నల్లగొండ జిల్లాలో ఎలిమినేటి మాధవరెడ్డి ఎత్తిపోతల (AMRP) లిఫ్ట్ స్కీమ్ విజయవంతంఅయిన తరువాత పాలమూరు ప్రజలలో కొంచెం చైతన్యం వచ్చిన కారణంగా, అప్పటికే ప్రత్యేక రాష్ట్ర సాధనకై టీఆర్ఎస్ పార్టీ తెలంగాణ రాజకీయ రంగంపైకి వచ్చిన కారణంగా 2003లో కల్వకుర్తి, 2004లో భీమా, నెట్టెంపాడు, కోయిల్ సాగర్ ఎత్తిపోతల పథకాలకు మోక్షం వచ్చింది. వైఎస్సార్ ప్రభుత్వం వీటిని జల యజ్ఞంలో భాగం చేసి పరిపాలనా అనుమతులు మంజూరు చేసి టెండర్లు పిలిచింది. కానీ పది సంవత్సరాలు గడచినా కూడా ప్రాజెక్టులు పూర్తి కాని స్థితి. ఈ ప్రాజెక్టులన్నీ పూర్తి అయితే 8 లక్షల ఎకరాలు సాగులోనికి వచ్చి ఉండేవి. ఇంకా చాలా ప్రాంతాలు సాగుకు నోచుకోని పరిస్థితి ఉన్నది. జిల్లా గుండా కృష్ణా నది 300 కిలో మీటర్లు పారుతుంది. తుంగభద్రా నది కూడా ఈ జిల్లా సరిహద్దుగా పారుతుంది. అయినా జిల్లాలో ఈ దీన పరిస్థితి ఉన్నది.

తెలంగాణ ఉద్యమం వువ్వెత్తున లేచిన సందర్భంలో తెలంగాణ రిటైర్డు ఇంజనీర్లు 2005లో పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం రూపకల్పన చేసి అప్పటి ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వానికి నివేదిక ఇస్తే రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వం బుట్ట దాఖలుచేసింది. జిల్లా నాయకుల్లో దాన్ని పట్టించుకునే నాధుడే లేడు. 2009 ఎన్నికల ముందు సర్వేల గురించి జీ.ఓ ఇస్తామని చెప్పిన ప్రభుత్వం మొఖం చాటేసి అనేక సాకులు చెప్పింది. ఇప్పటికే చాలా ఎత్తిపోతల పథకాలు వచ్చాయి. కనుక వాటి పనితీరు చూసిన తరువాతనే ఈ ఎత్తిపోతల పథకాన్ని చేవట్టటం జరుగుతుందని ఆదేశాలు ఇచ్చారు. ఈ విధంగా మొత్తం పాలమూరు, రంగారెడ్డి జిల్లా ప్రజా ప్రతినిధుల నోరు మూయించడం జరిగింది.

దీని తరువాత, తెలంగాణ సమాజంలో చాలా ప్రజా సంఘాలు ధర్నాలు, రౌండ్ టేబుల్ సమావేశాలు, అవగాహన సదస్సులు, కళారూపాల ద్వారా గ్రామ గ్రామాన భావ వ్యాప్తి జేశారు. ఈ ప్రజా సంఘాలతో మమేకమై తెలంగాణ రిటైర్డ్ ఇంజనీర్లు పనిచేశారు. అంతిమంగా ప్రత్యేక రాష్ట్రం వస్తే తప్ప ఈ ప్రాజెక్టు సాకారం కాదని ప్రజలందరికి అర్థమైంది. పోతూపోతూ ఎన్నికల్లో లబ్ధి పొందడానికి కిరణ్ కుమార్‌రెడ్డి ప్రభుత్వం తుంగభద్రపై గంద్రేవుల జలాశయంతో పాటు పాలమూరు- రంగారెడ్డి ఎత్తిపోతల పథకానికి సర్వే నిమిత్తమై 2013 ఆగష్టులో జీ.ఓ. ఇచ్చింది. అయితే టెండర్ల ప్రక్రియ పూర్తి కాకుండా అడ్డుకున్నారు. రాష్ట్ర విభజన చట్టంలో అపెక్స్ కౌన్సిల్ అనుమతి కొత్త ప్రాజెక్టులకు తప్పనిసరి అయినందువల్ల అపెక్స్ కౌన్సిల్







లో అడ్డుకోవచ్చన్న ముందు చూపుతో ప్రాజెక్టు పనులు ప్రారంభం కాకుండా ఆటంకాలు కల్పించారు ఉమ్మడి రాష్ట్ర పాలకులు. ఎన్నికల్లో లబ్ది పొందడం కోసం, తెలంగాణ ఉద్యమాన్ని అణిచివేసే ఉద్దేశ్యంతో ఆ జీఓ జారీ అయ్యిందే తప్ప అమలు చేద్దామన్న చిత్తశుద్ధి ఉమ్మడి ప్రభుత్వానికి లేకుండింది.

**తెలంగాణ ప్రభుత్వ కృషి :**

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత కెసిఆర్ ముఖ్యమంత్రిగా ప్రభుత్వం అధికారం చేపట్టిన వెంటనే చేసిన మొదటి పని.. అటక మీద దుమ్ముపట్టిపోయిన పాలమూరు రంగారెడ్డి దస్త్రాన్ని బయటకు తీసి ఇంజనీరింగ్ స్టాఫ్ కాలేజ్ ఆఫ్ ఇండియా (ESCI) వారిచే సమగ్ర ప్రాజెక్టు నివేదికను తయారు చేయించడానికి 5.71 కోట్ల రూపాయలను మంజూరు చేస్తూ జిఓ నంబరు 69ని తేదీ 1.8.2014న జారీ చేసింది. 6 నెలల తర్వాత ఎస్కీ వారు తయారు చేసిన ముసాయిదా నివేదికలోని ప్రతిపాదనలపై ముఖ్యమంత్రి స్థాయిలో ప్రభుత్వ సలహాదారు దివంగత శ్రీ ఆర్ విద్యాసాగర్ రావు, సీనియర్ ఇంజనీర్లు, రిటైర్డ్ ఇంజనీర్లు, ఎస్కీ ఇంజనీర్లతో కూలంకషంగా సమీక్ష జరిగింది. ప్రాజెక్టు తొలి ప్రతిపాదనలు ఈ విధంగా ఉన్నాయి.

**ప్రాజెక్టు తొలి ప్రతిపాదనలు :**

1. జూరాల జలాశయం నుంచి 35 రోజుల్లో రోజుకు 2 TMC ఎత్తిపోసి మహబూబ్ నగర్ జిల్లాలో 7 లక్షలు, రంగారెడ్డి జిల్లాలో 2.7 లక్షలు, నల్లగొండ జిల్లాలో 30,000 ఎకరాలు.. మొత్తం 10 లక్షల ఎకరాలకు సాగునీరు, జంటనగరాలకు మరియు దారి పొడుగునా గ్రామాలకు తాగు నీరు, పరిశ్రమల అవసరాలకు నీరు అందించడం.
2. కోయిల్ కొండ వద్ద 76 టిఎంసిలు, గండీడ్ వద్ద 35 టిఎంసిలు, లక్ష్మిదేవిపల్లి వద్ద 10 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాల నిర్మాణం
3. మూడు జలాశయాల్లో మొత్తం 47 గ్రామాలు, 84,400 మంది జనాభా, 16,342 ఆవాసాలు ముంపు బారిన పడుతున్నాయని తేలింది.

ఎస్కీ వారి పై ప్రతిపాదనలపై సమగ్ర చర్చ అనంతరం ఇంత భారీ ముంపుని తగ్గించడం ప్రభుత్వం ముందు ఒక సవాలుగ ముందుకు వచ్చింది. దాంతో పాటు జూరాల జలాశయం నికర నిల్వ సామర్థ్యం 7 టిఎంసిలు మాత్రమే. పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో రోజుకు 2 టిఎంసిల నీటిని ఎత్తిపోయాలని ప్రతిపాదించినందున జూరాల జలాశయం నుండి ఇంత భారీగా నీటిని ఎత్తిపోయడానికి సాంకేతికంగా సాధ్యమా? జూరాల జలాశయం ఇప్పటికే జూరాల ఆయకట్టు(1.04 లక్షల ఎకరాలు), భీమా ఆయకట్టు (2 లక్షల ఎకరాలు), నెట్టెంపాడు ఆయకట్టు (2 లక్షల ఎకరాలు), కోయిల్ సాగర్ ఆయకట్టు (50 వేల ఎకరాలు), మహబూబ్ నగర్ పట్టణ తాగునీటి అవసరాలు, జూరాల జల విద్యుత్ యూనిట్ల కోసం నీటి విడుదల (40 వేల క్యూసెక్కులు) తదితర భారాలను అతి కష్టం మీద మోస్తున్నది. అంటే పాలమూరు పంపులను తిప్పాలంటే జూరాల వద్ద 50 వేల క్యూసెక్కులకు పైగా వరద వచ్చినప్పుడే సాధ్యం. అందుకే ఈ చిన్నప్రాణంపై మరొక భారీ ప్రాజెక్టుని మోపడం దానిపై ఆధారపడిన ప్రాజెక్టులకు అన్యాయం చేసినట్లవుతుందన్న ప్రశ్నలు ముందుకు వచ్చినాయి. సర్వే ఆఫ్ ఇండియా వారి టోపో మ్యాపులు, గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్, జూరాల, శ్రీశైలం వరద ప్రవాహాల గణాంకాల సాయంతో కూలంకషంగా అధ్యయనం జరిగింది. పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో ముంపుని గణనీయంగా తగ్గించగలిగే అవకాశం ఉందని, జూరాల నుండి కాక 215 TMC నిల్వ సామర్థ్యం కలిగిన శ్రీశైలం జలాశయం నుండి రోజుకు 2 టిఎంసిల నీటిని 90 రోజుల పాటు (వరద లేని రోజుల్లో కూడా) ఎత్తిపోసుకోవడానికి అవకాశం ఉందని తేలింది. కృష్ణా నదికి అతిపెద్ద ఉపనది తుంగభద్ర నీరు కూడా శ్రీశైలం జలాశయానికే చేరతాయి. ఇన్ని వేల కోట్ల రూపాయలను ఖర్చు చేస్తున్నప్పుడు ప్రాజెక్టు సాఫల్యతపై దృష్టి పెట్టవలసిన అవసరం ఉన్నది. ఈ అన్ని అంశాలను పరిగణనలోనికి తీసుకొని పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని రీ డిజైన్ చెయ్యాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రాజెక్టు సమగ్ర నివేదిక తయారు చేస్తున్న ఎస్కీ వారిని పై చర్చల ఆధారంగా శ్రీశైలం నుండి ప్రాజెక్టుని రీ డిజైన్ చెయ్యమని ప్రభుత్వం ఆదేశించింది. ఇదే సమయంలో ఆర్ విద్యాసాగర్ రావు డిండీ (నక్కలగండి) ఎత్తిపోతల పథకంపై కూడా

చర్చ జరిగింది. నక్కలగండి ప్రతిపాదనలో కూడా ముంపు భారీగా ఉండడంతో ప్రత్యామ్నాయాలను పరిశీలించినారు. రెండు ప్రాజెక్టుల నీటి సోర్స్ శ్రీశైలం జలాశయమే అయినందున ఈ రెండు ప్రాజెక్టులకు ఒకే ఇన్టేక్ ద్వారా నీటిని సరఫరా చెయ్యడం సాంకేతికంగా సాధ్యమేనని నిర్ధారణకు వచ్చినారు. ఈ అంశాన్ని కూడా దృష్టిలో ఉంచుకొని రీ డిజైన్ చెయ్యాలని ముఖ్యమంత్రి ఆదేశించినారు.




**రీ డిజైన్ తర్వాత ప్రాజెక్టు వివరాలు:**

రీ డిజైన్ తర్వాత ప్రాజెక్టు ప్రతిపాదనల్లో కీలక మార్పులు చోటుచేసుకున్నాయి. ప్రధానమైన మార్పులు... నీటి సోర్స్ జూరాల నుంచి శ్రీశైలం జలాశయానికి మార్చడం, 6 కొత్త జలాశయాలను ప్రతిపాదించచడం, ఆయకట్టు 10 లక్షల ఎకరాల నుంచి 12.30 లక్షల ఎకరాలకు పెంచడం, గతంలో కంటే ముంపు గణనీయంగా తగ్గించడం జరిగింది. ఉమ్మడి మహబూబ్ నగర్ జిల్లాలో 7 లక్షల ఎకరాలు, రంగారెడ్డి జిల్లాలో 5 లక్షల ఎకరాలు, నల్లగొండ జిల్లాలో 30 వేల ఎకరాలు.. మొత్తం 12.30 లక్షల ఎకరాలు. మొత్తం 70 మండలాల్లో 1226 గ్రామాలకు ప్రయోజనం చేకూరుతుంది. నార్లాపూర్ వద్ద 8.51 టిఎంసిలు, ఏదుల వద్ద 6.55 టిఎంసిలు, వట్టెం వద్ద 16.74 టిఎంసిలు, కరివెన వద్ద 17.34 టిఎంసిలు, ఉద్దండాపూర్ వద్ద 15.91 టిఎంసిలు, లక్ష్మీదేవిపల్లి వద్ద 2.80 టిఎంసిలు నిలువ సామర్థ్యంతో 6 జలాశయాలను ప్రతిపాదించినారు. వీటి మొత్తం నిల్వ సామర్థ్యం 67.97 టిఎంసిలు. ముంపు మొత్తం 49 వేల ఎకరాలు, ప్రభావితం అయ్యే గ్రామాలు 3, తండాలు 20, ఆవాసాలు 2,781 మాత్రమే. పై గణాంకాలను పరిశీలిస్తే రీ డిజైన్ తర్వాత పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో ముంపు గణనీయంగా తగ్గిపోయిందని అర్థమవుతున్నది. ఈ ప్రతిపాదనల్ని ఆమోదిస్తూ ప్రభుత్వం జీఓ నంబరు 105 తేదీ 10.06.2016 ద్వారా ప్రాజెక్టుకు రూ.35,200 కోట్లకు పరిపాలనా అనుమతులు మంజూరు చేసింది. ముఖ్యమంత్రి ప్రాజెక్టుకు 11.06.2015 తేదీన కరివెన గ్రామం వద్ద శంకు స్థాపన చేసిన తర్వాత ప్రాజెక్టు పనులని 18 ప్యాకేజీలుగా విభజించి టెండర్లు ఖరారు చెయ్యడం జరిగింది. పనులు ప్రారంభమయినాయి.

**ప్రాజెక్టుకు నిరంతర ఆటంకాలు :**

పనులు ప్రారంభం అయినప్పటి నుంచి ప్రాజెక్టు వ్యతిరేకులు కోర్టుల్లో కేసులు వేసి అనేక ఆటంకాలు కల్పించడం మొదలు పెట్టారు. ఆ క్రమలోనే జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్‌లో పర్యావరణ అనుమతులు లేకుండా ప్రాజెక్టు పనులు చేస్తున్నారని, పర్యావరణ అనుమతులు వచ్చే వరకు పనులను నిలుపుదల చేస్తూ ఆదేశాలు ఇవ్వమని వారు జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్‌ను కోరినారు. ఈ కేసులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఇంప్లీడ్ అయి ప్రాజెక్టుకు వ్యతిరేకంగా వాదనలు చేసింది. ఇది కొత్త ప్రాజెక్టు కాబట్టి విభజన చట్టం ప్రకారం అపెక్స్ కౌన్సిల్ అనుమతి పొందిన తర్వాతనే ప్రాజెక్టును చేపట్టాలని వాదించింది. ఈ ప్రాజెక్టుకు ఉమ్మడి రాష్ట్రంలోనే 90 టిఎంసిల నీటి కేటాయింపులు చేస్తూ జీవో జారీ అయ్యిందని, కాబట్టి దీన్ని కొత్త ప్రాజెక్టుగా పరిగణించడానికి వీలు లేదని తెలంగాణ ప్రభుత్వం వాదించింది. తొలుత 1226 గ్రామాలకు, హైదరాబాద్ నగరానికి తాగునీటి సరఫరా కోసం ప్రాజెక్టును నిర్మిస్తున్నామని, తాగునీటి ప్రాజెక్టులకు పర్యావరణ అనుమతుల నుంచి మినహాయింపు ఉందని, సాగునీటి పనులు మాత్రం పర్యావరణ అనుమతులు పొందిన తర్వాతనే చేపడతామని తెలంగాణ ప్రభుత్వం జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్ కు తెలిపింది. ట్రిబ్యునల్ అందుకు అంగీకరించి ప్రాజెక్టులో తాగునీటి పనులు చేసుకోవడానికి అనుమతించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తిరిగి గ్రీన్ ట్రిబ్యునల్‌లో మరో కేసు ఆంధ్రప్రదేశ్ రైతులతో వేయించి ట్రిబ్యునల్ ద్వారా ప్రాజెక్టు పనులకు స్టే ఆర్డర్ పొందింది. దాంతో పాటు పర్యావరణానికి హాని కలిగించినందుకు భారీ మొత్తంలో జరిమానా కూడా వేసింది. తెలంగాణ ప్రభుత్వం గ్రీన్ ట్రిబ్యునల్ స్టే ఆర్డర్ పై, సుప్రీం కోర్టుకు అప్పీల్ చేసింది. అందరి వాదనలు విన్న సుప్రీంకోర్టు తాగునీటి సరఫరా పనులను కొనసాగించడానికి అనుమతిస్తూ తీర్పు ఇచ్చింది. సాగునీటి పనులు మాత్రం పర్యావరణ అనుమతులు పొందిన తర్వాతనే చేపట్టాలని సూచించింది. గ్రీన్ ట్రిబ్యునల్ వేసిన జరిమానాపై సుప్రీం కోర్టులో విచారణ కొనసాగుతున్నది.

**కేంద్ర ప్రభుత్వ గజిట్ నోటిఫికేషన్ :**

పరిస్థితులు ఈ రకంగా ఉన్న తరుణంలో కేంద్ర ప్రభుత్వం 15 జూలై 2020న కృష్ణా, గోదావరి నదీ యాజమాన్య బోర్డుల పరిధులను నిర్దేశిస్తూ గజిట్ నోటిఫికేషన్ ను జారీ చేసింది. ఇందులో రెండు నదీ బేసిన్‌లలో కేంద్ర జల సంఘం నుంచి అనుమతులు లేని ప్రాజెక్టుల జాబితాను పొందు పరచింది. అందులో కృష్ణ బేసిన్‌లో పాలమూరు రంగారెడ్డి

ప్రాజెక్టును కూడా చేర్చింది. ఈ ప్రాజెక్టులకు 6 నెలల్లో కేంద్ర సంస్థల నుంచి అనుమతులు పొందాలని ఆదేశించింది. నోటిఫికేషన్‌లో పేర్కొన్న ప్రాజెక్టులకు కేంద్ర జల సంఘం నుంచి, కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ నుంచి అనుమతులు పొందడానికి డిపిఆర్‌లు సిద్ధం చేయమని ముఖ్యమంత్రి సాగునీటి శాఖను ఆదేశించారు. గోదావరి బేసిన్‌లో ఇప్పటి వరకు 9 ప్రాజెక్టుల డిపిఆర్‌లు సమర్పించి అనుమతుల కోసం తీవ్రంగా కృషి చేస్తున్నది. అందు కోసం దిల్లీలో ఎగ్జిగ్యూటివ్ ఇంజనీర్ ఆధ్వర్యంలో పనిచేసే ఒక కార్యాలయాన్ని నెలకొల్పింది. కృష్ణా బేసిన్ లో ఉన్న ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు లేవు. పాలమూరు సహా అన్ని ప్రాజెక్టులు.. కల్వకుర్తి, నెట్టెంపాడు, ఎలిమినేటి మాధవరెడ్డి, ఆర్ విద్యాసాగర్ రావు డిండి.. కూడా వరద జలాల కేటాయింపులు ఉన్న ప్రాజెక్టులే. పాలమూరు, డిండి మినహా మిగతా మూడు ప్రాజెక్టులు ఉమ్మడి రాష్ట్రం ప్రారంభించినవే. వరద జలాలపై ఆధారపడిన ప్రాజెక్టులకు కేంద్ర జల సంఘం కానీ, కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ కానీ అనుమతులు ఇవ్వడానికి నిబంధనలు లేవు.

**నికర జలాల కేటాయింపులు :**

పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టు దక్షిణ తెలంగాణకు జీవధార లాంటిది. కరువు పీడిత, ఫ్లోరైడ్ పీడిత ప్రాంతాలకు తాగునీరు, సాగునీరు అందించాలన్న లక్ష్యంతో తెలంగాణ ప్రభుత్వం ఈ ప్రాజెక్టును చేపట్టింది. కాళేశ్వరం కార్పొరేషన్‌లో భాగం చేసి బ్యాంకు లోన్‌ల ద్వారా నిధులు కూడా సమకూర్చింది. అయితే కోర్టు కేసుల ఫలితంగా అనుమతులు పొందాలంటే ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు తప్పనిసరి. ప్రభుత్వం ఈ విషయంపై మేధోమధనం చేసిన అనంతరం 90 టిఎంసిల నికర జలాలను తెలంగాణ వాటా నుంచే కేటాయించుకునే అవకాశం ఉందని తేలింది. చిన్న నీటి పారుదల కోసం బచావత్ ట్రిబ్యునల్ తెలంగాణకు కేటాయించిన 90 టిఎంసిల నీటిలో 45 టిఎంసిలకు మించి కృష్ణా బేసిన్‌లో వినియోగం జరగడం లేదని తేలింది. ఈ నీటిని పాలమూరు ప్రాజెక్టుకు కేటాయించ వచ్చునని భావించడం జరిగింది. కర్ణాటక ప్రభుత్వం కూడా ఈ రకమైన సేవింగ్స్‌ను అప్పర్ భద్రా ప్రాజెక్టుకు కేటాయించుకున్నది. ఇక గోదావరి ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం పోలవరం ప్రాజెక్టు ద్వారా 80 టిఎంసీల గోదావరి జలాలను కుడి కాలువ ద్వారా కృష్ణా డెల్టా అవసరాలకు తరలించుకోవచ్చు. ఆ మేరకు కృష్ణా నీటిని నాగార్జునసాగర్ ఎగువన పోలవరం ప్రాజెక్టును కేంద్ర జల సంఘం అనుమతించిన రోజు నుంచే మహారాష్ట్ర 14 టిఎంసిలు, కర్ణాటక 21 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ 45 టిఎంసిలను బేసిన్‌లో ఉండే ఆయకట్టు అవసరాలకు, తాగునీటి అవసరాలకు వినియోగించు కోవచ్చు. కర్ణాటక అప్పర్ భద్రా ప్రాజెక్టుకు ఈ వాటాలో కూడా కొంత నీటిని కేటాయించింది. అయితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కర్ణాటక చేసుకున్న ఈ పునర్ కేటాయింపులను 2013 లోనే సుప్రీం కోర్టులో సవాలు చేసింది. అప్పటి నుంచి ఈ వివాదం సుప్రీం కోర్టులో నలుగుతూ ఉన్న సమయంలోనే కేంద్ర జల సంఘం అప్పర్ భద్రా ప్రాజెక్టుకు అనుమతులు మంజూరు చేసింది. కేంద్ర ప్రభుత్వం ఈ ప్రాజెక్టుకు జాతీయ హోదా కల్పించి ఈ 2023-24 ఆర్థిక సంవత్సరంలో నిధులు కూడా కేటాయించింది. కర్ణాటక అవలంభించిన పద్ధతిలోనే తెలంగాణ ప్రభుత్వం కూడా, ఇంతకు ముందు పేర్కొన్నట్టు, మైనర్ ఇరిగేషన్‌లో 45 టిఎంసిల సేవింగ్స్, పోలవరం నుంచి తరలించే నీటిలో ఆంధ్రప్రదేశ్ వాటా 45 టిఎంసిలు పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టుకు పునర్ కేటాయింపులు (బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ అంతిమ తీర్పుకు లోబడి) చేస్తూ జీఓ నంబరు 246 జారీ చేసింది. ఆంధ్రప్రదేశ్ ఈ 45 టిఎంసిల నీటిని గోదావరి ట్రిబ్యునల్ తీర్పు ప్రకారం నాగార్జున సాగర్ ఎగువన బేసిన్‌లో ఉండే ఆయకట్టు అవసరాలకు మాత్రమే వినియోగించాలి. రాష్ట్ర విభజన తర్వాత నాగార్జున సాగర్ ఎగువన ఉన్నది తెలంగాణ మాత్రమే. కృష్ణా బేసిన్‌లో ప్రాజెక్టులు కలిగి ఉన్న రాష్ట్రం తెలంగాణనే. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉన్న ప్రాజెక్టులు అన్నీ కూడా బేసిన్ అవలకు నీటిని తరలించేవి. కాబట్టి ఈ 45 టిఎంసిల నీటిపై పూర్తి హక్కు తెలంగాణ రాష్ట్రానికే ఉన్నది. ఈ రకమైన విశ్లేషణతో పాలమూరు-రంగారెడ్డి ప్రాజెక్టుకు మొత్తం 90 టిఎంసిల నికర జలాలను కేటాయించి డిపిఆర్ తయారు చేసి కేంద్ర జల సంఘానికి, పర్యావరణ మంత్రిత్వ శాఖకు సెప్టెంబర్ 2022 లోనే సమర్పించడం జరిగింది. ఇదే విషయాన్ని బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్‌కు కూడా తెలియజేయడం జరిగింది.




**పాలమూరు డిపిఆర్ పరిశీలనలో వివక్ష :**

ఆంధ్ర ప్రదేశ్ బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ ముందు పాలమూరు-రంగారెడ్డి ప్రాజెక్టుపై ప్రత్యేకమైన కేసు వేసింది. అందులో వారు తెలంగాణ ప్రభుత్వం జారీ చేసిన నీటి కేటాయింపుల జీఓ పై ఆక్షేపణలు చేసినారు. అయితే ఆ నీటిలో తమకు కూడా హక్కు




ఉందని కానీ, తమకు కూడా వాటా కావాలని కానీ కోరలేదు. ఎందుకంటే ఈ నీటిని నాగార్జునసాగర్ ఎగువన వాడటానికి కృష్ణా బేసిన్‌లో తమకు ప్రాజెక్టులు లేవని వారికి తెలుసు. కేంద్ర జల సంఘం వారు ఆంధ్రప్రదేశ్ చేస్తున్న "న్యాయ విచారణ పరిధిలో ఉంది (Subjudice)" అన్న కారణాన్ని చూపి, తెలంగాణ వాదనలు గాని, సాక్ష్యాలు కానీ పరిగణనలోకి తీసుకోకుండా పాలమూరు ప్రాజెక్టును పరిశీలించలేమని వెనక్కి పంపుతూ లేఖ రాసింది. ఈ లేఖపై తెలంగాణ రాష్ట్రం తీవ్రంగా స్పందించింది. కేంద్ర జల సంఘం కర్ణాటక అప్పర్ భద్రా ప్రాజెక్టు పట్ల ఒక రకంగా, తెలంగాణ పాలమూరు ప్రాజెక్టు పట్ల మరో రకంగా వివక్షాపూరితంగా వ్యవహరిస్తున్నదని ఆక్షేపించింది. కేంద్ర జల్ శక్తి మంత్రిత్వ శాఖ కార్యదర్శికి రాసిన లేఖలో.. కర్ణాటక రాష్ట్రం అప్పర్ భద్రా ప్రాజెక్టుకు ఏ పద్ధతులు అనుసరించి తమ వాటా నుంచే నీటి కేటాయింపులు జరుపుకున్నదో అవే పద్ధతులను అనుసరించి తెలంగాణ కూడా తన వాటా నుంచే పాలమూరు ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు చేసుకున్నదని తెలిపింది. అప్పర్ భద్రా వివాదం కూడా సుప్రీం కోర్టు ముందు ఉన్నది. మరి ఇది న్యాయ విచారణ పరిధిలోని విషయం ఎట్లా కాకుండా పోయింది? తెలంగాణకుఒకన్యాయం, ఇతర రాష్ట్రాలకు మరో న్యాయమా? అని ప్రశ్నించింది. 2021 జూలై 15 తేదీన కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన గెజిట్ ప్రకారం.. అనుమతిలేని ప్రాజెక్టుల జాబితాలో పాలమూరు-రంగారెడ్డిని చేర్చారని, ఆరు నెలల్లోగా అనుమతులు పొందాలని చెప్పారన్నారు. ఈ ఆదేశాలమేరకే అనుమతుల కోసం డీపీఆర్‌ను సెప్టెంబర్ 2022 లో సమర్పించినట్టు తెలిపారు. అప్పటి నుంచి ఆరు నెలల్లోగా డీపీఆర్‌ను పరిశీలించి, అనుమతులు ఇచ్చే బాధ్యత కేంద్రానిదే నని గుర్తు చేశారు. ఇప్పటికే 6 నెలలు కాలాయాపన చేసి "న్యాయ పరిధిలోని అంశం" అన్న సాకు చూపించి వెనక్కి పంపడం సమంజసం కాదు కాబట్టి డీపీఆర్ నుపరిశీలించి, బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ తుది తీర్పునకు లోబడి అనుమతులు మంజూరు చేయాలని విజ్ఞప్తి చేశారు. డిపిఆర్ పరిశీలన కొనసాగించాలని, త్వరగా అనుమతులు మంజూరు చేసే విధంగా కేంద్ర జల సంఘాన్ని ఆదేశించాలని కేంద్ర జల్ శక్తి మంత్రిత్వ శాఖ కార్యదర్శి శ్రీ పంకజ్ కుమార్‌ను రాష్ట్ర సాగునీటి శాఖ స్పెషల్ చీఫ్ సెక్రెటరీ రజత్ కుమార్ విజ్ఞప్తి చేశారు. కేంద్ర జల సంఘం లేవనెత్తిన అంశాలు అన్నిటికీ సవివరమైన సమాధానాలు సమర్పించామని రజత్ కుమార్ పేర్కొన్నారు.

ఇప్పుడు బంతి కేంద్ర ప్రభుత్వ కోర్టులో ఉన్నది. వారు దక్షిణ తెలంగాణకు జీవధార అయిన పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టులకు అనుమతులు మంజూరు చేసి ప్రాజెక్టు పనుల పురోగతికి సహకారిస్తారా లేదా వివక్షాపూరితంగా వ్యవహరించి ప్రాజెక్టును బుట్ట దాఖలు చేస్తారా? కాలం వెల్లడి చేస్తుంది. 2014లో మహబూబ్ నగర్‌లో జరిగిన ఎన్నికల ప్రచార సభలో బిజెపి తరపున ప్రధాన మంత్రి అభ్యర్థిగా నరేంద్ర మోది పాలమూరు-రంగారెడ్డి ప్రాజెక్టుపై చేసిన వాగ్దానాన్ని మహబూబ్ నగర్ ప్రజలు మరచిపోలేదు. ప్రధాన మంత్రిగా 9 ఏళ్లు పూర్తి చేసుకున్న ఆయన ఈ ప్రాజెక్టుకు డబ్బులు ఇవ్వకపోయినా కనీసం అనుమతులు మంజూరు చేయాలని ఆయకట్టు రైతాంగం కోరుకుంటున్నారు.

– శ్రీధర్‌రావ్ దేశ్‌పాండే,
m : 94910 60585
e : irrigationosd@gmail.com





# మగ్గుతున్నాయి రేయింబవళ్లు తరతరాలుగా ఆ చీకటి గుళ్లు

అదొక త్రికూటాలయం. మూడుగర్భాలయాలు, అర్థమండపాలు, వాటిని కలుపుతూ కట్టిన రంగమండపం. చిక్కిశల్యమైన మూడుగుళ్లు. అవే చీకటి గుళ్లు. కరీంనగర్ జిల్లా కేంద్రానికి కూతవేటు దూరంలో జగిత్యాల రోడ్డులో ఉన్న కొత్తపల్లిలో ఉన్నాయి. ఆ అపురూప ఆలయాలు. అద్భుత శిల్పకళా శోభితాలు. క్రీ.శ.13వ శతాబ్దినాటి కాకతీయ వాస్తు విన్యాసాలు.

7 అడుగుల ఎత్తైన అరుగుపై అందంగా నిర్మించిన కాకతీయులు వారున్నంత కాలం నిత్యకళ్యాణం, పచ్చతోరణంలా ఆ ఆలయాల ఆలనా, పాలనా చూశారు. తమతరువాత కూడా అలానే పూజలందు కొంటా యనుకొన్నారు పాపం కాకతీయులు.

దక్షిణ ప్రవేశద్వారమండంతో ఉన్న ఈ చీకటి గుడి, ఉపపీఠం, అధిష్ఠానం, పాదవర్గం, ద్వారబంధాలు, స్థంభాలు, దూలాలు, కప్పులు, కాకతీయ శిల్పుల పనితనానికి అద్దంపడుతున్నాయి. ఒకప్పుడు బంగారు కాంతుల కలశాలతో వెలుగొందిన శిఖరాలు నేలకొరిగి పోయాయి. పునాదులు కదలి గోడలు నెర్రెలు బారాయి.

రామప్ప దేవాలయంలా రంగమండపం అరుగుపై గల చిన్న ఆలయాలు విగ్రహాలు లేక బోసి బోయాయి. చిమ్మచీకటి గుళ్లలోకి వెలుగులు విరజిమ్మిన ద్వారశాఖల జాలీలు జాలిగా గోస వెళ్లబోసుకొంటున్నాయి. ద్వారాలపై తారా తోరణంలా భాసిల్లిన పైగడపపైనున్న నటరాజు కాళ్లు తడబడుతున్నాయి. ఎప్పుడో 800 ఏళ్ల క్రితం కట్టిన ఈ ఆలయాన్ని పై నుంచి చూస్తున్న కాకతీయ శిల్పుల కళ్లలో నీళ్లు కట్టలు తెంచుకొంటున్నాయి.

తరాలు మారాయి. ఈ గుళ్ల తలరాతలూ మారాయి. పదిలంగా అలరారిన అపురూప ఆలయాలు ఆదమరచి నిద్రిస్తున్నాయి. గతవైభవ, ప్రాభవాల్ని తలచుకొంటూ కాలం వెళ్లబుచ్చుతున్నాయి. చీకట్లు తొలగి వెలుగులు విరజిమ్మే రోజుల కోసం పరితపిస్తూ రోజురోజుకూ నీరసిస్తు న్నాయి. త్వరలోనే మంచి రోజులు రాకపోతాయా అని మూగనోములు నోస్తూనే ఉన్నాయి. సాయం చేసే చేతులకోసం జీర్ణోద్ధరణకు ముందుకొచ్చే దాతల కోసం ఆశగా ఎదురు చూస్తున్నాయి.

-ఈమని శివనాగిరెడ్డి-స్థపతి
m : 9848598446
e : nagireddy@malaxmi.in





# బోధ్ గయలో మహాబోధి టెంపుల్ కాంప్లెక్స్

ఉనికి: బిహార్

శాసనం: 2000

విభాగం: సాంస్కృతికం

సార్వత్రిక అద్భుత కట్టడం

బుద్ధుడి జీవితానికి మరీ ముఖ్యంగా జ్ఞానోదయానికి సంబంధించిన నాలుగు పవిత్ర స్థలాల్లో మహాబోధి ఒకటి. మొదటి ఆలయం అశోక చక్రవర్తి కాలంలో వర్తమాన శక పూర్వం మూడో శతాబ్ది లో నిర్మించబడింది. ప్రస్తుత ఆలయం వర్తమాన శకం ఐదు లేదా ఆరో శతాబ్దికి చెందింది.

ప్రాధాన్యం:

- నాటి కాలంలో పూర్తిగా అభివృద్ధి చేయబడిన ఇటుకల ఆలయాలను కట్టడంలో భారతీయుల ఆర్కిటెక్చరల్ కళా నైపుణ్యానికి మహాబోధి ఆలయం ప్రాతినిధ్యం వహిస్తుంది.
- శతాబ్దాలుగా భారతీయ ఉపఖండంలో ఆర్కిటెక్చర్ అభివృద్ధిపై ఇది గణనీయ ప్రభావాన్ని కలిగి ఉంది.
- బుద్ధుడితో ముడిపడిన సంఘటనలు, తదనంతర ఆరాధనకు సంబంధించిన ఉత్కృష్ట రికార్డులను ఈ సైట్ అందిస్తుంది.



- ప్రస్తుత ఆలయం గుప్తుల తదనంతర కాలానికి సంబంధించి అత్యంత ప్రాచీన ఆలయాల్లో ఇది ఒకటి, పూర్తిగా ఇటుకలతో కట్టబడిన అత్యంత భారీ కట్టడం.
- ఇది నేరుగా బుద్ధుడి జ్ఞానోదయంతో ముడిపడిన ప్రాంతం కావడంతో బుద్ధుడి జీవితంతో నేరుగా అనుబంధాన్ని కలిగి ఉంది.
- గౌతమ బుద్ధుడు జ్ఞానోదయం పొందిన స్థలంలో మహాబోధి ఆలయం నిర్మించబడింది. బుద్ధుడి జీవితం తో ముడిపడిన నాలుగు పవిత్ర స్థలాల్లో ఇది ఒకటి.

గౌతమ బుద్ధ అడుగుజాడలు అన్ని రకాల యాత్రికులకు, సంస్కృతుల అన్వేషకులకు, నిపుణులకు, అందరికీ ఎంతో పవిత్రమైనవి. బోధ్ గయ లోని మహాబోధి ఆలయం బుద్ధుడి జ్ఞానోదయంతో ముడి పడిన ప్రాంతంగా వివిధ రకాల సందర్శకులకు తిరుగులేని సందర్శనీయ స్థలంగా ఉంటోంది. అశోకుడు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించడం, ఆ తరువాత ఆయన బౌద్ధానికి బాగా ప్రాచుర్యం కల్పించడం అనేవి కళింగ యుద్ధంలో సాధించిన విజయంతో, పట్టాభిషిక్తుడైన పదేళ్ల తరువాత బోధ్ గయను సందర్శించడంతో ముడిపడి ఉన్నాయి. వర్తమాన శకం ఐదో శతాబ్దం నుంచి



ఎనిమిదో శతాబ్దం దాకా వచ్చిన చైనా యాత్రికులు మహా బోధి ఆలయం గురించి ముఖ్యమైన వివరాలు అందించారు. సాంచి, భర్హుత్ స్థూపాల వద్ద ఉండే ఫలకాలు ఈ ఆలయం గురించి, అక్కడ అశోకుడు కట్టించిన సింహాసనం గురించి మరి కొంత సమాచారాన్ని అందిస్తాయి.

అశోకుడు మొదటగా కట్టించిన ఆలయం తొలిదఫా పునర్ నిర్మాణం వర్తమాన శకం రెండో శతాబ్దంలో చోటు చేసుకుంది. పాట్నా మ్యూజియంలో ఉన్న ఒరిజినల్ ఫలకంలో దీని గురించిన ప్రస్తావన ఉంది. వర్తమాన శకం 637లో చైనా పర్యాటకుడు జువాన్ జంగ్ బోధ్ గయ నగరానికి వచ్చాడు. అక్కడ ఆయన అద్భుతమైన మహాబోధి ఆలయాన్ని చూశాడు. 160 అడుగుల (50 మీటర్లు) ఎత్తు, బాగా పెద్దదైన పవిత్ర స్థలంగా ఆయన దాన్ని అభివర్ణించాడు. నీలి రంగు ఇటుకలు, ప్లాస్టర్, బంగారు వన్నె బుద్ధ విగ్రహాలతో కూడిన దిమ్మెలు ఉన్నాయని తెలిపాడు. మరింకెన్నో వివరాలు అందించాడు.



మహాబోధి కాంప్లెక్స్ ఒక ప్రధాన ఆలయాన్ని, వజ్రాసన సింహాసనాన్ని, బోధి వృక్షంతో సహా ఏడు పవిత్రస్థలాలతో ఉంటుంది. ఇవన్నీ కూడా బుద్ధునికి జ్ఞానోదయం కలిగిన ఏడు వారాల లోపు జరిగిన సంఘటనలతో ముడిపడినవే. అశోకుడు వాటికి ఓ రూపం ఇచ్చాడు. జ్ఞానోదయం పొందినప్పుడు, ఆ తరువాత బుద్ధ మొదటి వారం రోజులను ఆ బోధి వృక్షం కిందనే గడిపాడు. నాటి వృక్షం నుంచి పుట్టుకొచ్చిన చెట్టే నేటికీ అక్కడ అదే స్థలంలో ఉంది. పాలిష్ చేసిన శాండ్ స్టోన్ వజ్రాసనం బోధి చెట్టు కింద ఉంది. ఎత్తయిన స్థలంలోని ప్రార్థనా మందిరం (అనిమేష్ లోచన్ చైత్యం) అనేది బుద్ధుడు రెండో వారం గడిపిన ప్రాంతంగా చెబుతారు. మూడో వారం గడిపిన ప్రాంతాన్ని రత్నచక్రమ లేదా జ్యువెల్డ్ అంబ్యులేటరీగా వ్యవహరిస్తారు. ఇవి ప్రధాన ఆలయానికి ఉత్తరాన కాస్తంత ఎత్తులో ఉండే రాతి కమలం పుష్పాలు. బుద్ధుడు అటూ ఇటూ తిరిగిన 18 మెట్లకు గుర్తుగా ఉంటాయి. నాలుగో వారం రత్నగఢ్ చైత్యం వద్ద గడిపాడు. ఇది ఈశాన్యమూలన ఉంటుంది. ఐదో వారం బుద్ధుడు ధ్యానం చేసిన, బ్రాహ్మణులతో చర్చించిన చెట్టు (అజపాల నిగ్రోధ) కు ప్రతీకగా ఉండే స్తంభం. అది రెండు భిన్నసంస్కృతులకు సూచిక. ఆరో వారం బుద్ధుడు దక్షిణాన ఉన్న లోటస్ పాండ్ వద్ద గడిపాడు. ఏడో వారం ప్రధాన ఆలయానికి ఆగ్నేయంగా ఉన్న రాజ్యతన చెట్టు కింద గడిపాడు. ఈ చెట్టు కాకుండా అక్కడ నిల్చున్న భంగిమలో తదుపరి కాలానికి చెందిన ఒక బుద్ధ విగ్రహం ఉంది. అక్కడే ఉన్న 'పాదాలు' మాత్రం అశోకుడి కాలం నాటివిగా భావిస్తున్నారు.

ఎన్నో వోటివ్ స్థూపాలు, శాసనాలు, సాహిత్య వర్ణనలు ఎన్నో ఉన్నాయి. ఈ ఆలయం పదకొండో శతాబ్దిలో బర్మీస్ చే పునరుద్ధరించ బడింది. ఆ తరువాత పంతొమ్మిదో శతాబ్దిలో మరోసారి దీన్ని పునరుద్ధరించారు. వెలకట్టలేని బౌద్ధ వారసత్వ సంపదగా దాన్ని కాపాడేందుకు ఎన్నో దేశాల సంయుక్త ప్రయత్నాలకు ఈ స్థలం ఒక ఉదాహరణగా నిలిచింది. చారిత్రక రికార్డుల్లో పేర్కొన్న విధంగా ఆలయ మరమ్మతులు మయన్మార్, శ్రీలంక, థాయ్ లాండ్, భారతదేశంలచే నిర్వహించ బడ్డాయి. నేడు ఈ స్థలం బోధ్ గయ మేనేజ్మెంట్ ట్రస్ట్ కమిటీ ఆధ్వర్యంలో కొనసాగుతోంది. ఇది ఏఎస్ఐ పరిరక్షణలో ఉంది. దీని పరిణామ క్రమం, చారిత్రక విలువల పరిరక్షణకు సంబంధితుల కృషి ప్రపంచ వారసత్వ శాసనాల పరిరక్షణలో కీలకంగా ఉన్నాయి.

- అమరేశ్వర్ గల్లా

అనువాదం : ఎస్.వివిఎమ్
e: desk.deccan@gmail.com






# తెలంగాణ దశాబ్ది ఉత్సవాల లోగోను ఆవిష్కరించిన సీఎం కేసీఆర్

తెలంగాణ అవతరణ దశాబ్ది ఉత్సవాలకు సంబంధించిన లోగోను సీఎం కేసీఆర్ ఆవిష్కరించారు. తెలంగాణ తల్లి విగ్రహం చుట్టూ ప్రభుత్వ ప్రాధాన్య పథకాలు వచ్చేలా లోగోను రూపొందించారు.

తెలంగాణ అవతరణ దశాబ్ది ఉత్సవాల లోగోను రాష్ట్ర ప్రభుత్వం సిద్ధం చేసింది. ఈ మేరకు లోగోను ముఖ్యమంత్రి కేసీఆర్, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శాంతికుమారి, మంత్రులు తలసాని శ్రీనివాస్ యాదవ్, హరీశ్‌రావు తదితరులు ఆవిష్కరించారు. తెలంగాణ తల్లి విగ్రహం చుట్టూ ప్రభుత్వ ప్రాధాన్య పథకాలతో లోగోను రూపొందించారు. నీటిపారుదల ప్రాజెక్టులు, మిషన్ భగీరథ, ఉచిత విద్యుత్, రైతుబంధు, సచివాలయం, అంబేడ్కర్ విగ్రహం, అమరుల స్మారక జ్యోతి, యాదాద్రి ఆలయం, పోలీస్ కమాండ్ కంట్రోల్ సెంటర్, టీహబ్, పాలపిట్ట, బోనాలు, బతుకమ్మ తదితరాలకు లోగోలో ప్రాధాన్యత కల్పించారు.

తెలంగాణ రాష్ట్ర అవతరణ
దశాబ్ది ఉత్సవాలు
2014 - 2023

తెలంగాణ దశాబ్ది ఉత్సవాలను జూన్ 2 నుంచి 21 రోజుల పాటు ఘనంగా నిర్వహించాలని సీఎం కేసీఆర్ నిర్ణయించిన సంగతి తెలిసిందే. ఈ మేరకు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి (సీఎస్) శాంతికుమారి ఆధ్వర్యంలో ఉత్సవాల కమిటీని ఏర్పాటు చేశారు. ప్రతి హృదయం ఉప్పొంగేలా, తెలంగాణ ఘనకీర్తి దశదిశలా చాటే విధంగా వేడుకలు నిర్వహించాలని సీఎం కేసీఆర్ అధికారులకు దిశానిర్దేశం చేశారు. ముఖ్యమంత్రి కేసీఆర్ ఆధ్వర్యంలో సచివాలయంలో మొదటి రోజు ఉత్సవాలు ప్రారంభమవుతాయి. అదే రోజు మంత్రులు వారి వారి జిల్లా కేంద్రాల్లో ఉత్సవాలను ప్రారంభిస్తారు. అమరవీరులను స్మరించుకునేందుకు ఒకరోజును ప్రత్యేకంగా మార్టియర్స్ డేగా జరుపుకోవాలని సీఎం తెలిపారు. రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న అమరుల స్తూపాలను పుష్పాలతో, విద్యుత్ దీపాలతో అలంకరించి, గ్రామ గ్రామాన తెలంగాణ అమరవీరులను స్మరిస్తూ నివాళులర్పించాలని చెప్పారు. పిండి వంటలు, ఆటపాటలు, కవి సమ్మేళనాలు, అష్టావధానాలు, జానపదాలు, సంగీత విభావరి, సినిమా-జానపద కళాకారులతో ప్రదర్శనలు, సంగీతం, నృత్యం, తదితర సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలని తెలిపారు.

- ఖైజర్, m : 9030 6262 88
e: desk.deccan@gmail.com



సందేశం

# అస్తిత్వ భావవ్యాప్తికి అద్దం పట్టిన పత్రిక

**మ**నం ఇలా ఎందుకున్నాం? మనదాన్ని మనం ఎందుకు కాపాడుకోలేక పోతున్నాం? మన వైభవాన్ని మనమైనా ఎందుకు చెప్పుకోలేక పోతున్నాం? ప్రతిదాంట్లోనూ ఆధిపత్యమే ప్రతిదీ వివక్ష పూరితమే దేన్ని కదిలించినా అసమానతల జీవితమే మనదైంది? నీళ్ళూ, నిధులు,నియామకాలంటూ మనవి మనకు కావాలని మన చరిత్ర, సంస్కృతి, భాష, జీవన సుఖ దుఃఖాలు మనవంటూ రక్షించుకునే అస్తిత్వంలోంచే 'దక్కన్‌ల్యాండ్' పత్రిక ఆవిర్భవించింది. మణికొండ వేదకుమార్ వస్తేరానీ కష్టాల్ నష్టాల్ అంటూ అడుగువేస్తున్నందుకు రోజూ హృదయాలింగనం చేసుకోవాలనిపిస్తుంది.




దక్కన్‌ల్యాండ్ తెలంగాణ ఉద్యమకాలంలో తల్లి పాత్రను పోషించింది. నేటికీ మన అస్తిత్వాన్ని కాపాడడానికే శ్రమిస్తుంది. ఈ పత్రిక ఉద్యమకారులకూ కార్యకర్తలకు ఒక ఆయుధంగా నిలిచింది. వివిధ విధాలైన మేధావుల ద్వారా విస్తృతమైన ఆలోచనల్ని పంచింది. సంఘటిత స్వరం కోసం శ్రమించింది.

తెలంగాణ తెచ్చుకున్న తర్వాత దక్కన్‌ల్యాండ్ మరింత శ్రమతో ముందుకు నడుస్తుంది. మన చేలో మన విత్తనాల్నే చల్లుదాం. మన భూముల్లో అవసరమైన పంటల్నేపండించుకుందాం. మన ఆకల్ని తీర్చుకున్నాకే ఇరుగుపొరుగును పట్టించుకుందాం. వడ్డించుకున్న పళ్ళాన్ని ఎవరు లాక్కున్నా చేతులు కట్టుకుని కూర్చో వద్దన్న నినాదం దక్కన్‌ల్యాండ్ కుంది. మన అస్తిత్వాన్ని కాపాడుకునే మాధ్యమాలే మనకు లేవు. మనం మాధ్యమ వ్యవస్థలో ప్రేక్షక పాత్రను విడనాడాలన్నదే వేదకుమార్ లక్ష్యం. మనకు వనరులు లేక కాదు సోయి లేక కాదు. మన అస్తిత్వాన్ని మనమే కాపాడుకోవాలన్న స్వభావం మన ధనాధిపతులకు లేదు. వేదకుమార్ దేన్నీ లెక్క చేయకుండా దక్కన్‌ల్యాండ్ నడుపుతున్న సాహసం మరువలేనిది. ఆ సాహసం మనందరిలో విస్తరించాలి. భండారు అచ్చమాంబ మొదలుకొని కాళోజీ నారాయణరావుదాక దాగున్న బడబాలనాన్ని బహిర్గతం చేయడంలో దక్కన్‌ల్యాండ్ ఎంచుకున్న మార్గాన్ని హర్షించాలి. కంటి తుడుపు తుడిచే పత్రికలు మన అస్తిత్వాన్ని గూర్చి మాట్లాడినా, మాట్లాడకున్నా వాటి స్వలాభాపేక్షతోనే అవి జీవిస్తున్న దశలో దక్కన్‌ల్యాండ్‌ను చూస్తే మన అమ్మను మనం చూసుకుంటున్నట్లుంటది. మనదైన శిల్పం, కట్టడాలు, ఆలయాల నిర్మాణం వంటి ఎన్నింటినో దక్కన్‌ల్యాండ్ సగర్వంగా ఎత్తిచూపుతుంది. మన హైదరాబాదు సోయగాల్ని దక్కన్‌ల్యాండ్ ఎన్నెన్ని కథలు కథలుగా నానమ్మ అమ్మమ్మ చెప్పినట్టు మన జాతికి చెబుతుందో ఒక్కసారి ఊహించుకుంటే ప్రతి తెలంగాణ పాఠకుడు పరవశానికి గురవుతాడు. పార్కుల్ని చెరువుల్ని, బౌద్ధారామాల్ని, మన శాసనాల్ని పిల్లలకు అక్షరాల్ని నేర్పుతున్నట్లు నేర్పుతుంది. నిజాం కాలం నాటి విద్యావ్యవస్థనే కాదు సకల విద్యావ్యవస్థల్ని పూలదండగా గుచ్చి పాటకున్ని అలంకరింప చేస్తుంది. తెలంగాణకున్న ఖనిజ సంపదపైన ఎన్నెన్ని విశ్లేషణలు చేసిందో. ఒగ్గు కథల్ని, చిందు భాగోతాల్నీ, పిల్లల కథల్ని ఒకటారెండా తెలంగాణలోని సమస్తాన్ని అద్దం ముందు నిలిపింది. నేనైతే జాతరల వైశిష్ట్యాన్నీ, సంస్కృతిని దక్కన్‌ల్యాండ్ ద్వారానే నేర్చుకోగలిగాను. జంతర్‌మంతర్‌ను, గోండు భాషను, పటం కథల్ని దక్కన్‌ల్యాండ్ కూర్చోబెట్టి చదివించింది.

వేదకుమార్ తెలంగాణ సోయి ఉన్న సంపాదకుడు. మన అస్తిత్వ పరిరక్షకుడు. ఈ పత్రిక పదేళ్ళ నుంచి నిరంతర సజీవ నదిలా ప్రవహిస్తుంది. మణికొండ 'మనీ' కొండ కాదు మణుల కొండ. తెలంగాణ మణులకున్న పురావైభవాన్నీ ఎత్తి చూపడంలో ఆయనకు ఆయనే సాటి. దక్కన్‌ల్యాండ్ అంటే దక్కన్ పీఠభూమి. ఈ పీఠభూమిలోని పిడికెడు మట్టిని మన హృదయ పంట సీమల్లో చల్లుకుంటే చాలు మన హృదయమే కాదు మానవ జాతి హృదయం కూడా పరవశించి పాడగలదు.

దక్కన్‌ల్యాండ్‌లో వచ్చిన కార్మిక, కర్షక, మేధావి వర్గాల వ్యాసాలు మనల్ని ఉత్తేజితుల్ని చేసాయి. గులాం అలీ ఖాన్ నుంచి ఎందరెందరో కార్పెట్లు పరిచిన వేదికల మీద సన్నాయి సంగతాన్ని దక్కన్‌ల్యాండ్ భద్రపరిచింది. బిస్మిల్లాఖాన్ సన్నాయితో దక్కన్‌ల్యాండ్ మారుమోగింది. మన కవిత్వాన్నీ, కథ పాటనీ, విమర్శనీ, పరిశోధననీ కాపాడుతున్న పత్రిక దక్కన్‌ల్యాండ్. వేదకుమార్‌లో సృజనాత్మక వినమ్రత ఎక్కువ తెలంగాణ నిర్మాణంలో వేదకుమార్ పెట్టినన్ని చర్చలు మరొకరు పెట్టలేదేమో? కులవృత్తులకు కులవృత్తి కళాకారులకు ఆయన పెద్దపీట వేశాడు. తెలంగాణ అస్తిత్వాన్ని నిలబెట్టిన, నిలబెడుతున్న పత్రికలు లేవు. ఏవైనా ఉంటే అందులో ఇదే అగ్రగ్రామి. దక్కన్ టీవీ కూడ మాధ్యమాల్లో అగ్రగామనే చెప్పాలి. వేదకుమార్ తపన అంతా ఇంతా కాదు. మన తెలంగాణ వెలుగులో తన వెలుగుల్ని మూటగట్టి ప్రతిమాసం మనకందిస్తున్నాడు. అస్తిత్వ భావవ్యాప్తిలో అగ్రగామి పత్రికగా దక్కన్‌ల్యాండ్‌ను తీర్చి దిద్దుతున్నందుకు వేదకుమార్‌ను అభినందిస్తూనే మన జాతి రహదారి మరింత విస్తృత పరచాలని ఆకాంక్షిస్తున్నాను.

-డా॥ నాళేశ్వరం శంకరం
m : 9440451960





## తెలంగాణ పునర్నిర్మాణ పతాకదృశ్యం

# నూతన సచివాలయం

- చెరువుల పునరుద్ధరణ, కాళేశ్వరం, పాలమూరు, ఇతర ప్రాజెక్టులన్నీ తెలంగాణ పునర్నిర్మాణ ప్రతీకలే.. వేసవిలోనూ మత్తడి దూకే చెరువులే సాక్ష్యం
- బీళ్లు పడ్డ భూములన్నీ ఇప్పుడు హరిత కాంతులు వెదజల్లుతున్నాయి
- శాంతిభద్రతలను కట్టుదిట్టం చేశాం.. మతకల్లోలాల ఊసే లేకుండా చేశాం
- తలసరి ఆదాయం, విద్యుత్ వినియోగంలో దేశంలోనే టాప్‌లో నిలిచాం
- పారిశ్రామిక విధానంతో రూ. లక్షల కోట్ల పెట్టుబడులు ఆకర్షిస్తున్నాం
- ఇదే కోవలో భవితకు బాటలు వేసుకుంటామని హామీ ఇస్తున్నానన్న సీఎం

రాజధాని నగరం నడిబొడ్డున తలెత్తుకుని నిలిచిన కొత్త సచివాలయం తెలంగాణ పునర్మిర్మాణానికి ప్రతీక అని ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖర్‌రావు పేర్కొన్నారు. అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించి, అతి తక్కువ కాలంలోనే దేశానికే ఆదర్శంగా నిలవడమే.. తెలంగాణ సాధించిన ప్రగతి అన్నారు. హైదరాబాద్‌లో హుస్సేన్ సాగర్ తీరాన నూతనంగా నిర్మించిన డాక్టర్ బీఆర్ అంబేడ్కర్ తెలంగాణ సచివాలయాన్ని సీఎం కేసీఆర్ ఆదివారం (ఏప్రిల్ 30) లాంఛనంగా ప్రారంభించారు. తర్వాత



ఆయనతోపాటు మంత్రులు, ఉన్నతాధికారులు తమకు కేటాయించిన చాంబర్లలో ఆసీనులై.. కొత్త సచివాలయం నుంచి తొలి సంతకాలు చేశారు. అనంతరం ఏర్పాటు చేసిన కార్యక్రమంలో సీఎం కేసీఆర్ మాట్లాడారు.

తెలంగాణ అవతరణకు ముందు అనేక వాదోపవాదాలు, అనేక చర్చలు చూశాం. తెలంగాణ అవతరించిన తర్వాత కూడా పునర్నిర్మాణం కోసం అంకితభావంతో అడుగులు వేస్తున్న సందర్భంలో.. తెలంగాణ భావాన్ని, అర్థాన్ని,



పునర్నిర్మాణ కాంక్షను జీర్ణించుకోని కొందరు ఉన్న నిర్మాణాలను కూలగొట్టి కడతారా? అన్న వారికి, ఆ మాటలు పట్టించుకోకుండా ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలతో ముందుకు వెళ్లుతూ ఈ రోజు ఆకాశమంత ఎత్తుకు ఎదిగింది తెలంగాణ రాష్ట్రం.

**మహనీయుడి స్ఫూర్తితో..**

అంబేద్కర్, గాంధీజీ చూపిన బాటలో పోరాడి తెలంగాణ సాధించుకున్నాం. ఆకాశమంత ఎత్తున అంబేద్కర్ విగ్రహాన్ని ఆవిష్కరించుకున్నాం. సెక్ర టేరియట్‌కు వచ్చే సీఎం, మంత్రులు, అధికారులందరికీ నిత్యం బాబాసాహెబ్ ఆదర్శాలు స్ఫురణకు రావాలని, అంకితభావంతో పనిచేయాలనే ఉద్దేశంతో సచివాలయానికి ఆయన పేరు పెట్టుకున్నాం. ఇదే కోవలో భవిష్యత్తుకు బాటలు వేసుకుంటామని అందరికీ హామీనిస్తున్నాం. తెలంగాణ సాధన పోరాటంలో అసువులు బాసిన వారికి అంజలి ఘటిస్తున్నాం" అని సీఎం కేసీఆర్ పేర్కొన్నారు.

**అభివృద్ధి కొలమానాల్లో మనమే టాప్**

ప్రపంచంలో అభివృద్ధిని, పునర్నిర్మాణాన్ని కొలమానంగా తీసుకునే సూచికలు రెండే రెండు. ఒకటి తలసరి ఆదాయం (పర్‌క్యాపిటా ఇన్‌కమ్), రెండోది తలసరి విద్యుత్ వినియోగం (పర్ క్యాపిటా పవర్ యుటిలైజేషన్). ఇప్పుడు తెలంగాణ రూ. 3,00,017 తలసరి ఆదాయంతో దేశంలోనే నంబర్ వన్‌గా ఉంది.



ఒకనాడు సగటు తలసరి విద్యుత్ వినియోగం 1,100 యూనిట్లుగా ఉంటే.. నేడు 2,140 యూనిట్లతో దేశంలోనే అగ్రభాగానికి చేరింది. ఇదే తెలంగాణ పునర్నిర్మాణం. నిరాదరణకు గురైన వృద్ధులు, ఒంటరి మహిళలు, ఎందరో బాధితులు రూ. 2,016 ఆసరా పింఛన్లు అందుకుంటూ చిరునవ్వుతో బతుకుతున్నారు. తెలంగాణ పునర్నిర్మాణంలో భాగంగా చేపట్టిన సచివాలయం అద్భుతంగా రూపుదిద్దుకుంది. ఈ నిర్మాణంలో పాలుపంచుకున్న వివిధ రాష్ట్రాల కార్మికులకు తెలంగాణ ప్రజల తరపున ధన్యవాదాలు.

**కొత్త సెక్రటేరియట్‌లో శాఖలు**

సచివాలయంలో ఒక్కో ఫ్లోర్‌ను మూడు శాఖలకు కేటాయించారు. గ్రౌండ్ ఫ్లోర్‌లో రెవెన్యూశాఖ, మొదటి ఫ్లోర్‌లో హోంశాఖ, రెండో అంతస్తులో ఆర్థికశాఖ, మూడో ఫ్లోర్‌లో వ్యవసాయం, ఎస్సీ డెవలప్‌మెంట్ శాఖలకు కేటాయించారు. నాలుగో అంతస్తులో నీటిపారుదలశాఖ, న్యాయశాఖలకు, ఐదో అంతస్తులో సాధారణ పరిపాలన శాఖ, ఆరో ఫ్లోర్‌లో సీఎం, సీఎస్‌లకు కేటాయించారు. లోవర్ గ్రౌండ్ ఫ్లోర్‌లో స్టోర్స్, రికార్డ్ రూమ్‌లు, వివిధ సేవలకు సంబంధించిన ఆఫీసులను ఏర్పాటు చేశారు.

కొత్త సెక్రటేరియట్ భద్రతను ప్రభుత్వం టీఎస్ఎస్పీకి అప్పగించింది. సచివాలయం సీఎస్ఓగా పి. వెంకట్రాములు వ్యవహరించనున్నారు. ప్రస్తుతం ఆయన టీఎస్ఎస్పీ అదనపు కమాండెంట్‌గా సేవలందిస్తున్నారు. మూడో బెటాలియన్ అదనపు కమాండెంట్‌గా కొనసాగుతున్నారు.

**నూతన సచివాలయం గురించి**

ముఖ్యమంత్రి కేసీఆర్ దార్శనికతకు, పట్టుదలకు నిలువెత్తు నిదర్శనం నూతన సచివాలయం కట్టడాలు చరిత్ర చెక్కిలిపై కాలం చేసే అందమైన సంతకాలు. నాగరికతలు తమ కాలపు ఆలోచనల్ని అవసరాలతో మేళవించి భవనాలకు రూపం ఇచ్చారు.

సింధు లోయ, రోము, ఈజిప్టు, మెసొపొటేమియా మొదలు మన దేశంలో వివిధ కాలాల్లో నిర్మించిన కట్టడాలు మనకు వారసత్వంగా నిలుస్తున్నాయి. కట్టడాల సంచయమే నగరం అయినప్పుడు, నగరం ఆ కాలానికి చెందిన నాగరికతకు సాక్షిగా నిలుస్తుంది. మన హైదరాబాద్ నగరం కూడా చరిత్రను వర్తమానంలోకి ప్రవహించేలా చేస్తూనే ఉంటుంది. భిన్న సాంస్కృతిక లక్షణాల మేలు కలయిక ఈ నగరానికి ఉన్న లక్షణం. దక్కన్ సంస్కృతికి, తెలంగాణ తత్త్వం ఇచ్చిన నిర్వచనమే మిశ్రమ సంస్కృతి.

ఎక్కువ ఆధారాల్లేని 12వ శతాబ్దపు గొల్లకొండ మట్టికోట, కుతుబ్ షాహీల కాలానికి అభేద్య దుర్గమైన గోల్కొండగా మారి, ఆ తర్వాత హైదరాబాద్ నగరంగా పరచుకుంది. అందుకే పాత నగరం నుండి నగరానికి నాలుగు దిక్కులా కుతుబ్ షాహీ కాలపు భవనాలు ఉన్నాయి.



ఇక వర్తమానంలోకి వద్దాం. హైదరాబాద్ స్కైలైన్‌లో కొత్తగా చేరిన సచివాలయం, పక్కనే 125 అడుగుల అంబేద్కర్ విగ్రహం, ముందు వైపు దీపపు ప్రమిద ఆకారంలో నిర్మాణమవుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమ అమరుల స్మృతి చిహ్నం - ఇవన్నీ నగరపు వాస్తుకళా రూపురేఖల్ని మార్చేస్తున్నవి. తెలంగాణ వచ్చిన తర్వాత ఏం సాధించినరు అనే పాత ప్రశ్న అప్పుడప్పుడూ తెలంగాణ వ్యతిరేకుల నుండి వస్తూనే ఉంది. వారికి కొత్త జవాబుగా ఈ కొత్త సంస్కృతీ ప్రతీకలు నిలుస్తాయి.

**తెలంగాణ రాజ్య ప్రతీక.. సాంస్కృతిక పతాక**

ప్రతీ నిర్మాణానికీ ఒక సందర్భం, సాంస్కృతిక పునాది ఉంటుంది. తెలంగాణ నేల శాతవాహనుల కాలం నుంచి నేటి వరకు ప్రతి చారిత్రక సందర్భంలో తన సంతకాన్ని కళాత్మకంగా చేస్తూనే ఉంది. ఇప్పుడు ఈ నేల మీద గర్వంగా నిలిచిన సచివాలయం ముఖ్యమంత్రి చంద్రశేఖర్‌రావు దార్శనికతకు, పట్టుదలకు నిలువెత్తు నిదర్శనం.



భవనం అంటే కేవలం మట్టీ, రాళ్లు, ఇసుక, సిమెంటులతో ఉన్న నిర్మాణం కాదు. కాలం సమకాలీన సమాజంతో చేసే కరచాలనం. వారసత్వపు కళా శైలుల్ని, ఆధునికతతో మేళవించే సన్నివేశం. దక్కన్, తెలంగాణ అస్తిత్వాల్ని భౌగోళిక విశేషంగా చాటుతున్న సందర్భం. అందుకే తెలంగాణ సచివాలయం ఒక అందమైన అస్తిత్వ కేతనం.

**సోయగాన్ని పెంచే గుమ్మటాలు**

ఇక సచివాలయంపై ఉన్న గుమ్మటాల గురించి చెప్పుకోవాలి. వాస్తుకళలో ఒక విశిష్టమైన అంశం గుమ్మటం (ఇంగ్లీషులో డోమ్ అంటారు). బౌద్ధ స్తూపాల పైనుండే అండం, ప్రాచీన రోమన్ కట్టడాల్లో ఉండే డోమ్‌లు, మధ్య యుగాల్లో భారత ఉపఖండంలో ఎదిగిన ఇండో-పర్షియన్ నిర్మాణాల్లో ఉండే గుంబద్‌లు, తెలుగులో చెప్పుకునే గుమ్మటాలు - పేరు ఏదైనా స్వల్ప మార్పులతో ఇవన్నీ ఒక్కటే. నిర్మాణాన్ని ఎలివేట్ చేయడమే వీటి ముఖ్య లక్షణం. వరాహమిహిరుడి బృహత్సంహితలో షోడశాండయుక్త అనే ప్రస్తావన ఉంది. దీని అర్థం 16 అండాలు లేక గుమ్మటాలు. అంతేకాదు దాదాపు 84 గుమ్మటాల వరకూ ఏర్పాటు చేసేందుకు వీలుగా వాటి నిర్మాణశైలిని బృహత్సంహితలో వివరించారు.

ఆర్కిటెక్ట్స్ అయిన ఆస్కార్ కన్సెస్సో, పొన్ని కన్సెస్సో మాటల్లో చెప్పాలంటే, ఈ భవనం మీది గుమ్మటాలకు ప్రేరణ గుజరాత్‌లోని సాలంగపూర్ హనుమాన్ దేవాలయం, నిజామాబాదు నీలకంఠేశ్వర ఆలయ గుమ్మటాలు. ఇవి కేవలం ఆలయ గుమ్మటాల లక్షణాన్ని మాత్రమే కాకుండా, ఇండో-సార్సెనిక్ వాస్తు లక్షణాల్ని కూడా ప్రతిబింబిస్తాయి. ఇండో-సార్సెనిక్ వాస్తు కళను ఇండో-గోతిక్ లేదా మొఘల్-గోతిక్, లేదా 19వ శతాబ్దపు మిశ్రమ హిందూ శైలి అనవచ్చు. అందుకే బ్రిటిష్ పాలిత ప్రాంతాల్లోని కట్టడాల్ని, సంస్థానాల్లోని రాజ ప్రాసాదాల్ని ఈ శైలిలో నిర్మించినారు. అందుకు ఉదాహరణే వనపర్తి రాజ ప్రాసాదం. సెక్రటేరియేట్ భవనం డిజైన్‌కు ఈ వనపర్తి రాజభవనం ఒక రిఫరెన్స్ పాయింట్ కూడా.

సచివాలయం మీదున్న 34 గుమ్మటాల్లో 2 పెద్దవి. వీటి మీద 15 మీటర్ల పొడవైన జాతీయ చిహ్నం గంభీరంగా నిలిచి ఉంటుంది. కంచుతో పోత పోసిన నాలుగు సింహాలతో జాతీయ చిహ్నం, పక్కనే అంబేద్కర్ విగ్రహం, హుస్సేన్ సాగర్ మధ్యలో బుద్ధుడు ఒక సాంస్కృతిక, సామాజిక, రాజకీయ సందేశానికి ప్రతీకలు.

రాతిలో, కలపలో పరిచిన సౌందర్యంపాల రాయి, ఎర్ర ఇసుక రాయి, గ్రానైట్ - పేరు ఏదైనా ఒక అందమైన డిజైన్‌లో ఒద్దికగా ఒదిగిపోతేనే భవనంలో ఒక సింక్రోనీ ఉంటుంది. ఆరవ అంతస్తు మొత్తం ముఖ్యమంత్రి కార్యాలయం, సమావేశ మందిరాలు, జనహిత (ప్రజల్ని కలుసుకునే మందిరం), చీఫ్ సెక్రటరీ కార్యాలయం వంటి ముఖ్యమైన ఆఫీసులు ఉంటాయి. పాల రాయి పరిచిన వరండాలు, గదులు ఆరవ అంతస్తు ప్రత్యేకతను చాటుతాయి. మిగిలిన అన్ని అంతస్తుల్లో తెలంగాణలో దొరికే గ్రానైటును ఫ్లోరింగ్‌కు వాడినారు.

ఆరో అంతస్తులోని గదుల గురించి చెప్పక పోతే భవన సౌందర్యంలో ఒక ముఖ్యమైన అంశాన్ని విస్మరించినట్టు అవుతుంది. ముఖ్యమంత్రి ఛాంబర్, విశిష్ట అతిథులతో సమావేశమయ్యే మందిరం, డైనింగ్ హాల్స్ వంటి నిర్మాణాల్లో ఉన్న తెలుపు, క్రీమ్ మధ్యలో సన్నటి



బంగారు రంగు పట్టీలతో ఉన్న కలర్ స్కీం, ఫ్రాన్స్‌లోని వెర్సెయిల్స్ రాజ భవనంలోని గదుల్ని తలపిస్తున్నాయి.

రాజస్థాన్ నుంచి తెప్పించిన ధోల్‌పూర్ రెడ్ సాండ్ స్టోన్ (ఎర్ర ఇసుక రాయి) భవనానికి వైవిధ్యాన్ని అందించింది. భవనంలోని లోయర్ గ్రౌండ్ ఫ్లోర్, గ్రౌండ్ ఫ్లోర్లను కవర్ చేస్తూ మందమైన ఈ రెడ్ సాండ్ స్టోన్ వాడకంతో ఉత్తర భారత నిర్మాణ శైలిలో ఉన్న అంశాన్ని కూడా చేర్చినట్లు అయింది. కేవలం కిందే కాదు, భవనం పైభాగంలోనూ ధోల్‌పూర్ రెడ్ సాండ్ స్టోన్‌ను ఒక పట్టీలాగా పరచడంతో అందం మరింత పెరిగింది. ముఖ్యమంత్రి సూచన మేరకు డిజైన్‌లో పైభాగంలో కూడా ఎర్ర ఇసుక రాయి పట్టీని చేర్చినారు. పేపర్ మీద భవనం డిజైనింగ్ మొదలు, నిర్మాణ సమయంలో అతి సూక్ష్మ అంశాల వరకు కేసీఆర్ గారి దార్శనికత, మార్గదర్శకత్వం అంతర్లీనంగా తమని నడిపించిందని అంటున్నారు ఆర్కిటెక్టులు.



భవనానికి ముందు లాన్‌లో రెండు వైపులా రెడ్ సాండ్ స్టోన్‌తో కట్టిన ఫౌంటైన్లు, డిజైన్‌లో ఒక అందమైన చేర్పు. పార్లమెంటు భవనంలో ఉన్న సైజులో, అదే ఆకృతిలో ఉన్నాయి ఈ ఫౌంటైన్లు. ఆకుపచ్చని పచ్చిక బయలు, ఎరుపు రాతి ఫౌంటైన్, దాని నుండి ఎగజిమ్ముతున్న నీరు - ప్రకృతిలోని రంగుల్ని పేర్చి చూపినట్టు ఉంది. ఆదిలాబాద్ కలప తలుపులపై లోహపు డిజైన్లను పొదిగిన తర్కషి కళ తెలంగాణలో పుట్టి పెరిగిన బిద్రీకళను తలపిస్తుంది. భవనం దర్వాజాను బాహుబలి ద్వారం అంటున్నారు. కోటలోని దర్వాజాలను తలపిస్తూ, తర్కషితో చెక్కిన అందమైన కళాకృతి ఈ ద్వారం.

**వాస్తుకళ- లక్షణాలు**

క్రీస్తుపూర్వం ఒకటో శతాబ్దంలోనే రోమన్ ఆర్కిటెక్ట్ విట్రూవియస్ వాస్తుకళ గురించి తన గ్రంథం 'డీ ఆర్కిటెక్చురా' లో, ప్రతీ నిర్మాణానికి దృఢత్వం, ఉపయోగం, అందం అనే మూడు లక్షణాలు ఉండాలని రాశాడు. ఈ మూడు లక్షణాల్ని మిళితం చేసుకుంది సెక్రటేరియట్ భవనం. ఈ భవన నిర్మాణంలో అనుభవజ్ఞులైన షాపూర్జీ పల్లోంజీ కంపెనీ ఆధునిక సాంకేతికత వాడటం, అంతర్జాతీయ ప్రమాణాల్ని పాటించడం దృఢత్వాన్ని గ్యారంటీ చేస్తున్నది. కనీసం 150 ఏళ్ళు చెక్కు చెదరకుండా ఉండేలా ప్లాన్ చేసినారు. లక్షల చదరపు అడుగుల గాల్వనైజ్డ్ రీఇన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్ సహాయంతో డోమ్‌లు, పిల్లర్లను అదీ అతి తక్కువ సమయంలో నిర్మించడం సివిల్ ఇంజనీరింగ్ అద్భుతమే. అంతెందుకు సచివాలయ ముఖద్వారాన్ని ఎలివేట్ చేయడం కోసం ఎన్నో ప్రయోగాల్ని చేయాల్సి వచ్చింది.

ఇక ఉపయోగం విషయానికి వస్తే 10.52 లక్షల చదరపు అడుగుల విస్తీర్ణంతో కూడిన విశాల భవనం తెలంగాణ రాష్ట్ర పాలనా కేంద్రంగా ఉండబోతున్నది. హుస్సేన్ సాగర్ తీరంలో, కిక్కిరిసిన భవనాల మధ్య కాకుండా ముందు పరచుకున్న విశాలమైన పచ్చిక భవనం అందాన్ని మరింత ఇనుమడింప చేస్తున్నది. రాబోయే కాలంలో నగరంలోని ఒక అందమైన ల్యాండ్ మార్క్‌గా ఇది నిలవబోతున్నది. అందుకేనేమో నిజ జీవితంలో అందం నశించినా, కళల్లో మాత్రం బతికే ఉంటుంది (Beauty perishes in life, but is immortal in art) అని ఇటాలియన్ బహుముఖ ప్రజ్ఞాశాలి లియోనార్డో డా విన్సీ అన్నాడు.

**గ్రీన్ బిల్డింగ్**

ఆధునిక భవనం ప్రకృతిలో భాగమైయినప్పుడే దానికి సార్థకత, ఉపయోగిత్వం ఉంటుంది. అందుకే ఈ భవనాన్ని ఒక 'గ్రీన్ బిల్డింగ్'గా రూపొందించారు. అన్ని అంతస్తుల్లో తలుపులు, కిటికీలు ఒకే వరుసలో ఉండే లా డిజైన్ చేసినందున గాలి ప్రవాహం నిరాటంకంగా సాగుతుంది. సెక్రటేరియట్ పైకప్పు మీద పడ్డ ప్రతీ వాన చుక్కా భూగర్భంలో ఉన్న నీటి సంపులోకి చేరి మొత్తం పరిసరాల్లో ల్యాండ్ స్కేపింగ్‌కు, పచ్చదనం పెంచేందుకు ఉపయోగ పడేలా ఏర్పాట్లు చేశారు. అందుకే ఇండియన్ గ్రీన్ బిల్డింగ్ కౌన్సిల్ (IGBC) ఈ భవనానికి గోల్డెన్ సర్టిఫికెట్ ఇచ్చింది.

ప్రధాన భవనానికి అనుబంధంగా ముఖ్య ప్రాంగణం వెలుపల నిర్మించిన మందిరం, మసీదు, చర్చి సచివాలయ ప్రాంగణానికి సర్వమత స్వరూపానిస్తున్నాయి. పోలీస్ కంట్రోల్ కమాండ్, బ్యాంకు, కాంటీన్ వంటి ఇతర భవనాలు సైతం సచివాలయ డిజైన్‌లో అందంగా ఒదిగిపోయినాయి.



**విస్మయం గొలిపే నిర్మాణ స్థాయి**

కొన్ని రాళ్లు, నాలుగు ఇటుకలు, కొంచెం సున్నం, సిమెంటు కలిపితే అద్భుత కట్టడం కాదు. ఏ నిర్మాణానికైనా ఒక ఆత్మ ఉండాలి. ఆ తత్వాన్ని ప్రతిబింబించే పథకం ఉండాలి. దానికి సరైన కొలతలు తోడవ్వాలి. అప్పుడే ఒక అద్భుత సౌధం నిలబడుతుంది. ఇదే విషయాన్ని 5 లేక 7 వ శతాబ్దంలో క్రోడీకరించిన ప్రాచీన భారత నిర్మాణ శాస్త్ర గ్రంథం 'మానసార' వివరిస్తుంది. నిర్మాణంలో పాటించాల్సిన కొలతలు, నిష్పత్తులు, డిజైన్ల గురించి చెపుతుంది. ఈ వ్యాసం రాస్తున్న క్రమంలో మాట్లాడిన కొందరు ఆర్కిటెక్టులు మెచ్చుకున్న అంశం ఈ నిర్మాణం స్కేల్ (స్థాయి) గురించి. 265 అడుగుల ఎత్తైన నిర్మాణం సుమారు పదిన్నర లక్షల అడుగుల్లో పరుచుకుని ఉన్నప్పుడు, భవనం ఈస్థటిక్ సెన్స్ చెడకుండా వివిధ అంతస్తులుగా, గదులుగా నిర్మించడం ఒక కష్టసాధ్యమైన పని. షాపుర్జీ పల్లోంజి నిర్మాణ సంస్థ తరపున నిర్మాణాన్ని పర్యవేక్షిస్తున్న ఒక అధికారి 'ఈ సెక్రటేరియట్ నిర్మాణంలో పడ్డ కష్టాలు, మాకు ఆర్కిటెక్చర్‌లో కొత్త పాఠాల్ని నేర్పాయి' అన్నారు.

**ఎత్తైన సౌధం- కొత్త రికార్డులు**

ప్రపంచంలోనే పేరున్నఎన్నో కట్టడాలకు సరితూగే విధంగా ఉంది కొత్త సచివాలయం. 17వ శతాబ్దం నాటి ఫ్రాన్సులోని వెర్సెలెస్ ప్యాలస్, 18వ శతాబ్దంలో కట్టిన లండన్ బకింగ్ హామ్ ప్యాలెస్, వాషింగ్టన్ లోని కాపిటల్ బిల్డింగ్, 20వ శతాబ్దంలో కట్టిన జపాన్, సింగపూర్, సౌత్ కొరియా పార్లమెంట్ భవనాలకు దీటుగా నేటి సచివాలయం నిలుస్తుంది. దేశంలోని ఎన్నో చారిత్రక కట్టడాలు తెలంగాణ సచివాలయం కంటే తక్కువ ఎత్తైనవి. ఢిల్లీలోని కుతుబ్ మినార్, ఆగ్రా లోని తాజ్‌మహల్ కంటే 26 అడుగులు (8 మీటర్లు) ఎత్తు ఉంది ఈ కొత్త భవనం. ఇక హైదరాబాద్ లోని ఎత్తైన కట్టడం చార్మినార్ ఎత్తు 183 అడుగులు (56 మీటర్లు) ఉంటే సచివాలయం దాని కంటే 82 అడుగులు (25 మీటర్లు) ఎత్తు ఉంది. ప్రస్తుతం దేశంలో ఉన్న చట్ట సభలు లేక సచివాలయ భవనాలన్నిటి కంటే ఎత్తైన కట్టడం ఇది. 1950లలోనే కట్టిన కర్ణాటక విధాన సౌధ 175 అడుగుల ఎత్తుంటే, తెలంగాణ సచివాలయం 265 అడుగుల ఎత్తు ఉంది. ఛత్తీస్‌గఢ్ రాజధాని నయా రాయపూర్ సెక్రటేరియట్, గుజరాత్ సెక్రటేరియట్ కంటే ఎత్తైనది తెలంగాణ సచివాలయం. అంతెందుకు, కొత్తగా కడుతున్న పార్లమెంట్ భవనం ఎత్తు 130 అడుగులు మాత్రమే.

**వాస్తవానికి ఈ అద్భుత కట్టడానికి పునాది**

భూమి మీద కాదు ఆలోచనల్లోనే పడింది. డిజైన్ చేస్తున్నప్పుడు ఆర్కిటెక్ట్స్ ఊహిస్తున్న స్థాయిని మించిన ఒక కట్టడం కావాలని కోరుకుని, ఆ దిశలో డిజైన్ రూపొందించేలా చేసింది ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్ రావు ఆలోచన. కట్టబోతున్న సచివాలయం, జాతీయ, అంతర్జాతీయ ప్రమాణాలను అందుకోవాలని దిశానిర్దేశం చేసినారు. దాని ఫలితమే భిన్న వాస్తు రీతుల సమాహారంగా నిలిచిన కొత్త సచివాలయం.

ఈ అద్భుతమైన కట్టంలో రోడ్లు & భవనాల శాఖ మంత్రి వేముల ప్రశాంత్ రెడ్డి రాత్రింబవళ్లు అహర్నిశం కృషి వల్ల ముఖ్యమంత్రి నిర్దేశించిన సమయానికి పూర్తి అయ్యింది. ఈ నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వ వాస్తు సలహాదారు సుద్దాల సుధాకర్ తేజ సూచనల మేరకు వాస్తు పాటించింది. అలాగే రోడ్లు & భవనాల ఇంజనీర్ల శ్రమ చాలా ఉంది. ఇంజనీర్ ఇన్ చీఫ్ ఐ. గణపతిరెడ్డి, ఎస్.ఇ. ఎం సత్యనారాయణ, ఇఇ పి. శశిధర్, డి.ఇ.ఇ.లు దుర్గాప్రసాద్, మోహన్‌బాబు మరియు ఎ.ఇ.ఇ. శ్రీకాంత్ వారి యొక్క నిరంతర శ్రమ , ఇంజనీరింగ్ నైపుణ్యాలు ఎంతో ఉపయోగపడ్డాయి. అలాగే ఇతర వివిధ డిపార్ట్‌మెంట్‌ల సిబ్బంది కృషి తోడ్పాటుతో ఈ







అందాల సౌధం ఏర్పాటైంది.

**మిశ్రమ సంస్కృతి తెలంగాణ తత్త్వం**

హైదరాబాద్ నగరమే ప్రేమ తత్వం, మిశ్రమ సంస్కృతి పునాదిగా ఏర్పడ్డది. అందుకే ఈ నగరంలో ఏ సాంస్కృతిక విశేషమైనా భిన్నత్వంలో ఉన్న వైవిధ్యాన్ని పట్టి నిలిపింది. అది సాహిత్యం కావచ్చు,



చిత్రలేఖనం కావచ్చు, వాస్తు, శిల్ప రీతులు కావచ్చు, చివరికి తినే తిండి కూడా భౌగోళిక సాంస్కృతిక వైవిధ్యాన్ని ప్రతిబింబిస్తుంది. అందుకే ఇప్పుడు రూపు దిద్దుకున్న సెక్రటేరియట్ భవనం, హైదరాబాద్ ఆత్మను ప్రతిబింబిస్తూ దక్కన్–ఇండో పర్షియన్, ఇండో–సార్సెనిక్ వాస్తు రీతుల మేలు కలయికగా రూపొందింది. కాకతీయ వాస్తు రీతి స్పష్టంగా లేకపోయినప్పటికీ, మొత్తం కట్టడంలో అన్ని చోట్లా నిలిపిన డబుల్ పిల్లర్స్‌కు ప్రేరణ కాకతీయ తోరణంలోని రెండు స్తంభాలు అంటున్నారు ఆర్కిటెక్ట్స్ అయిన ఆస్కార్ అండ్ పొన్ని.

**అంకెలు చెప్పే అంశాలు**

- ఉక్కు: 7,000 టన్నులు
- సిమెంటు: 35,000 టన్నులు
- ఇసుక : 26,000 టన్నులు
- కాంక్రీట్: 60,000 క్యూబిక్ మీటర్లు
- ఇటుకలు: 11 లక్షలు
- గ్రానైట్: 3 లక్షల చదరపు అడుగులు
- పాల రాయి: లక్ష చదరపు అడుగులు
- ధోల్‌పూర్ రెడ్ సాండ్ స్టోన్: 3,500 ఘనపు మీటర్లు
- కలప: 7,500 ఘనపు అడుగులు
- కార్మికులు: 3 షిఫ్టుల్లో 12,000 మంది
- పచ్చదనం: 8 ఎకరాలు
  (2 ఎకరాలు ప్రధాన భవనం ముందు, 6 ఎకరాలు మొత్తం కాంప్లెక్స్‌లో)
- భూగర్భ (సంపు) నీటి నిల్వ సామర్థ్యం: 585 కిలో లీటర్లు
- నీటి వినియోగం: రోజుకు 125 కిలో లీటర్లు
- సచివాలయ ప్రాంగణ విస్తీర్ణం 28 ఎకరాలు
- భవనం ఎత్తు 265 అడుగులు
- భవనం విస్తీర్ణం 10.52 లక్షల చదరపు అడుగులు
- 8 అంతస్తులు (లోయర్ గ్రౌండ్, గ్రౌండ్ + 6 అంతస్తులు)

– కట్టా ప్రభాకర్
m : 8106721111
e: akumarkatta@gmail.com







# తెలంగాణ అమరవీరుల స్మారక స్థూపం

హుస్సేన్‌సాగర్‌లోని తెలంగాణ అమరవీరుల స్మారక స్థూపాన్ని జూన్ 2న ముఖ్యమంత్రి కేసీఆర్ ప్రారంభించనున్నారు.

రూ.179 కోట్లతో నాలుగు అంతస్తుల స్టెయిన్‌లెస్ స్టీల్ నిర్మాణం పూర్తి కావడానికి దాదాపు నాలుగు సంవత్సరాలు పట్టింది. ఇది 3.29 ఎకరాల స్థలంలో 2.88 లక్షల చదరపు అడుగుల నిర్మాణ విస్తీర్ణంలో ఉంది.

ఈ భవనం రాష్ట్ర సాధన కోసం తమ ప్రాణాలను త్యాగం చేసిన అమరవీరులకు అంకితం చేయబడింది. జ్వాల వారి సహకారానికి ప్రతీక మరియు వారి ఆశయానికి నివాళి. ఈ నిర్మాణం పోరాట చరిత్రను తిరిగి పొందుతుంది. తెలంగాణ రాష్ట్రానికి, అగ్ర పర్యాటక ప్రదేశంగా అవతరించడంతో పాటు. దుబాయ్‌లో రూపొందించబడిన ప్రపంచంలోనే అతి పెద్ద అతుకులు లేని స్టెయిన్‌లెస్ స్టీల్ నిర్మాణంగా క్లెయిమ్ చేయబడిన, ఔటర్ బీన్ ఆకారం ప్రత్యేకమైన 316 L రకం స్టెయిన్‌లెస్ స్టీల్, ఒక రకమైన యాంటీ-రస్ట్, అధిక తుప్పు మరియు ఉష్ణోగ్రత-నిరోధక స్టీల్‌తో తయారు చేయబడింది. మొత్తం మీద 100 టన్నుల 316 L స్టీల్ మరియు 12,00 టన్నుల స్టెయిన్‌లెస్ స్టీల్ ఉపయోగించబడ్డాయి.

దీని రూపకర్త మరియు ప్రాజెక్ట్ సూపర్‌వైజర్, MV రమణా రెడ్డి మాట్లాడుతూ, ఈ డిజైన్ ప్రకాశవంతమైన మట్టి దీపం నుండి ప్రేరణ పొందింది మరియు చికాగోలోని క్లౌడ్ గేట్‌ను పోలి ఉంటుంది.

"ఈ నిర్మాణాన్ని కర్వేచర్ ప్రాజెక్ట్ అని పిలుస్తారు. ఖచ్చితమైన ఆకారాన్ని పొందడానికి అతి తక్కువ మైక్రో మిల్లీమీటర్ వరకు కొలతలు ఖచ్చితంగా ఉండాలి కాబట్టి ఇది చాలా ఖచ్చితత్వంతో కూడిన పని. ఇది లోపలి భాగంలో పఫ్ మెటీరియల్ లేయర్‌తో మరియు మిర్రర్ ఫినిషింగ్‌తో ఆధునిక నిర్మాణ రూపకల్పనను కలిగి ఉంది. హుస్సేన్‌సాగర్ సరస్సుకు ఆనుకుని నిర్మించబడినందున ఇది శాస్త్రీయంగా సవాలుతో కూడిన ప్రాజెక్ట్ మరియు ఇతర సాంకేతికతలతో పాటు నీరు నేలమాళిగలోకి ప్రవేశించకుండా చూసుకోవాలి, "అని రమణ తెలిపారు.

దీపం యొక్క జ్వాల ఐదు రంగుల పాలియురేథేన్ మెటాలిక్ పెయింట్‌ను కలిగి ఉంటుంది, దుబాయ్ నుండి దిగుమతి చేయబడింది - పైభాగంలో ఎరుపు రంగుతో పాటు లేత బంగారం, పసుపు, ఐవరీ మరియు బ్రౌన్, మరియు లక్క యొక్క పై పూత ఉంటుంది.

భవనం యొక్క మొదటి అంతస్తులో అమరవీరుల కోసం అంకితం చేయబడిన మ్యూజియం వారి ఫోటోలతో గోడలను ఆరాధిస్తుంది. ఇందులో దాదాపు 100 మంది కూర్చునే ప్రత్యేక ఆడిటోరియం ఉంటుంది, ఇందులో తెలంగాణ ఉద్యమాన్ని ప్రతిబింబించే వీడియోలను ప్రదర్శిస్తారు.

రెండవ అంతస్తులో దాదాపు 700 మంది కూర్చునే సామర్థ్యంతో కన్వెన్షన్ హాల్ ఉంటుంది, మూడవ మరియు నాల్గవ అంతస్తులలో రెస్టారెంట్లు మరియు సీటింగ్ ప్రాంతాలు గాజు పైకప్పులతో ఉంటాయి. భవనం లోపల గ్యాస్ వంట అనుమతించబడదు మరియు విద్యుత్ పరికరాలను మాత్రమే ఉపయోగిస్తారు.

పై అంతస్తులో వీక్షకులు సచివాలయ భవనం, బిర్లా మందిర్, హుస్సేన్‌సాగర్ సరస్సు మరియు అంబేద్కర్ విగ్రహం యొక్క అద్భుతాలను ఆస్వాదించవచ్చు.

తూర్పున బోట్ క్లబ్ రోడ్ నుండి ఒక ప్రవేశ ద్వారం మరియు పశ్చిమాన లుంబినీ పార్క్ దగ్గర ఒక నిష్క్రమణ ద్వారం మాత్రమే ఉంటుంది. ప్రధాన నిర్మాణం యొక్క చుట్టుపక్కల ప్రాంతంలో కుడి వైపున తోట పచ్చిక బయళ్ళు మరియు ఎడమ వైపున నీటి-ఫౌంటైన్లు ఉంటాయి. భవనం ప్రవేశ ద్వారం ముందు తెలుగు తల్లి విగ్రహాన్ని



ఏర్పాటు చేశారు.

సెల్లార్‌లో 350 నాలుగు చక్రాల వాహనాలు మరియు 650 ద్విచక్ర వాహనాలను పార్క్ చేయడానికి స్థలం ఉంది. భవనం కుడివైపున వీవీఐపీల కోసం ప్రత్యేక ర్యాంపును సిద్ధం చేశారు.

ఈ భవనం ప్రారంభోత్సవం తర్వాత త్వరలో ప్రజల కోసం తెరవబడుతుంది.

స్థూప నిర్మాణంలో ఆర్ & బి శాఖ మంత్రి వేముల ప్రశాంత్ రెడ్డి రాత్రింబవళ్లు కృషి వల్ల సీఎం తెలిపిన సమయానికి పూర్తి అయ్యింది. రాష్ట్ర ప్రభుత్వ వాస్తు సలహాదారు సుద్దాల సుధాకర్ తేజ సూచనల మేరకు వాస్తు పాటించింది. అలాగే ఆర్ & బి ఇంజనీర్ల శ్రమ చాలా ఉంది. ఇంజనీర్ ఇన్ చీఫ్ ఐ. గణపతిరెడ్డి, ఎస్.ఇ. హఫీజుద్దీన్ ఫరూఖ్, ఇ.ఇ. ఐ. నరసింగరావు, డి.ఇ.ఇ. మాధవి మరియు ఇతర సిబ్బంది యొక్క నిరంతర కృషి మరియు ఇతర వివిధ డిపార్ట్‌మెంట్‌ల సిబ్బంది కృషి ఎంతో ఉంది.

**స్థూపం విశేషాలు**

- తెలంగాణ ఉద్యమ అమరవీరులకు అంకితం చేసిన నిర్మాణం
- ప్రపంచంలోనే అతి పెద్ద అతుకులు లేని స్టెయిన్‌లెస్ స్టీల్ నిర్మాణంగా క్లెయిమ్ చేయబడింది
- భవనం యొక్క ఎత్తు 48 మీ, వెడల్పు-50 మీ, లోతు-28మీ
- మొత్తం వైశాల్యం - 3.26 ఎకరాలు
- మొత్తం నిర్మాణ ప్రాంతం - 2.85 లక్షల చ.అ
- ఔటర్ క్లాడింగ్ మెటీరియల్ ఉపయోగించబడింది 316L స్టెయిన్లెస్ స్టీల్, ఇది దుబాయ్ నుండి సేకరించబడింది
- బోట్ క్లబ్ రోడ్డులో ప్రవేశం, లుంబినీ పార్క్ వద్ద నిష్క్రమణం.
- మూడు అత్యవసర నిష్క్రమణలు, ఒక ఎస్కలేటర్ మరియు ప్రజల ఉపయోగం కోసం రెండు లిఫ్టులు
- భవనం జనరేటర్ బ్యాకప్‌తో 24/7 విద్యుత్ సరఫరాను కలిగి ఉంటుంది

- కొత్వాల్ సచిన్, m : 8686664949
e: desk.deccan@gmail.com





# తెలంగాణలో నీలి విప్లవం..

పెద్దగా జల వనరులే లేని తెలంగాణ ప్రాంతంలో చేపలెక్కడ ఉత్పత్తి అవుతాయని.. ఒకప్పటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చులకనచేసి మాట్లాడిన నాయకులు, నాటి పాలకుల కళ్ళు బైర్లుగమ్మే విధంగా కేసీఆర్ సర్కారు మత్స్య రంగాన్ని అభివృద్ధి చేయడమే లక్ష్యంగా ముందుకు సాగుతోంది. జలయజ్ఞం ద్వారా అందుబాటులోకి వచ్చిన అనేక భారీ నీటిపారుదల, ఎత్తిపోతల ప్రాజెక్టులు, మిషన్ కాకతీయ చెరువులు, కుంటల అభివృద్ధి ద్వారా గ్రామాల్లో పెరిగిన నీటి నిల్వ సామర్థ్యం తదితర వనరులను మత్స్య రంగం అభివృద్ధికి వినియోగించుకునే దిశగా ప్రభుత్వం ప్రణాళికాబద్ధంగా ముందుకు వెళుతోంది. ఈ క్రమంలోనే దేశానికే తలమానికంగా తెలంగాణాలో ఆక్వా యూనివర్సిటీని నెలకొల్పాలని ముఖ్యమంత్రి నిర్ణయించారు. నీలి విప్లవానికి నాంది పలుకుతూ, మత్స్య రంగంలో నవశకానికి పునాదులు వేయబోతున్నారు. ఈ క్రమంలో ప్రతి జిల్లాలోనూ మత్స్య పరిశ్రమ అభివృద్ధికి ఒక పరిశోధన, అధ్యయన కేంద్రాన్ని (ఆర్ అండ్ డీ) సెంటర్‌ను నెలకొల్పాలని నిర్ణయంచారు. ప్రతి జిల్లాలో ఆక్వా హబ్ ఏర్పాటు చేయడం ద్వారా చేపల ఉత్పత్తి, వ్యాపారాలకు అనువుగా ఉంటుంది. ఇప్పటికే చెరువుల్లో ఉచిత చేపపిల్లల విడుదల కార్యక్రమం ద్వారా ఈ రంగంలపై ఆధారపడిన 58,458 కుటుంబాలకు ప్రభుత్వం నిరవతర ఉపాధి కల్పించింది. కొత్తగా తలపెట్టిన అక్వా హబ్ కార్యక్రమంలో భాగంగా పైలట్ ప్రాజెక్టుగా సిరిసిల్ల జిల్లాను ఎంపిక చేశారు. పెట్టుబడులకు ప్రైవేటు సంస్థల భాగస్వామ్యంతో ముందుకు పోవాలని నిర్ణయించిన సర్కారు అందుకు తగిన ప్రోత్సాహకాలు కల్పిస్తోంది. ఈ రంగంలో ఇప్పటివరకు రూ.7,218 కోట్ల పెట్టుబులు వచ్చినట్లు ప్రభుత్వం చెబుతోంది. ఫిష్ ఫుడ్ ప్రాసెసింగ్ కోసం 27 కంపెనీలు ముందుకు వచ్చాయి. ఈ ఏడాది ఆఖరులోగా 'తెలంగాణ ఆక్వా యూనివర్సిటీ'ని నెలకొల్పాలని ప్రభుత్వం యోచిస్తోంది. అనన్ని జిల్లాల్లో ఆక్వా హబ్‌లను నెలకొల్పడం ద్వారా ప్రతి జిల్లాకు 10వేల చొప్పున 3.30 లక్షల మందికి ప్రత్యక్ష ఉపాధి అభించనుంది. సీఎం కేసీఆర్ ఆదేశాలతో అధికారులు కార్యాచరణ ప్రణాళిక సిద్ధం చేస్తున్నారు.

**పైలట్ ప్రాజెక్టు ఫలితం ఇదీ..**

పైలట్ ప్రాజెక్టుగా ఎంపికైన తర్వాత సిరిసిల్ల జిల్లా మత్స్య సంపదకు నిలయంగా మారుతున్నది. జిల్లాలోని శ్రీరాజరాజేశ్వర జలాశయం కేంద్రంగా నీలి విప్లవానికి నాంది పలుకనున్నది. ఇప్పటికే ఉచిత చేప పిల్లల పంపిణీతో మత్స్యకారులకు చేతినిండా పనికల్పించిన సర్కారు ఈ దిశగా మరో విప్లవాత్మక నిర్ణయం తీసుకున్నది. మిడ్‌మానేరులో రూ. 2 వేల కోట్లతో మెగా ఆక్వాహబ్‌ను ఏర్పాటు చేయాలని సంకల్పించింది. ఐటీ, పరిశ్రమల శాఖల మంత్రి కేటీఆర్ చొరవతో అమెరికాకు చెందిన ఫిషిన్ ఇండియా, ఫ్రెష్ టూ హెూం, ఆనందా గ్రూప్, సీపీ ఆక్వా సంస్థలు ప్రభుత్వంతో ఒప్పందం చేసుకున్నాయి. అందులో ఫిషిన్ ఇండియా కేజ్ కల్చర్ ట్రయల్ రన్‌ను పూర్తిచేసింది.

**ఉపాధి అవకాశాలు మెరుగు**

ఈ ఆక్వా హబ్‌తో 10వేల మందికి ఉపాధి లభించనుండగా సర్వత్రా హర్షం వ్యక్తమవుతున్నది. జిల్లాలో ఉచిత చేపపిల్లల పెంపకం విజయవంతంగా సాగుతున్నది. వందలాది చెరువులు, కుంటలు, వాగుల్లో విరవిగా మీనాలను పెంచారు. శ్రీ రాజరాజేశ్వర, అన్నపూర్ణ, ఎగువ మానేరు ప్రాజెక్టులతో పాటు 440 చెరువుల్లో చేపల పెంపకాన్ని





ప్రభుత్వం చేపట్టింది. వీటి ద్వారా 106 మత్స్య పారిశ్రామిక సంఘాల్లో 7636 మంది సభ్యులకు ఉపాధి లభించింది. త్వరలోనే మల్కపేట రిజర్వాయర్‌లోనూ చేపల పెంపకం చేపట్టేందుకు అధికారులు సిద్ధమవుతున్నారు.

**365 ఎకరాల భూసేకరణ పూర్తి**

జిల్లాలోని తంగళ్లపల్లి మండలం చీర్లవంచ సమీపంలో ఆక్వాహబ్ ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. ఇందుకు శ్రీరాజరాజేశ్వర జలాశయంలో 365 ఎకరాల భూసేకరణ పూర్తయ్యింది. ఇక్కడే మత్స్య యూనివర్సిటీ ఏర్పాటు చేసేందుకు ప్రభు త్వం చర్యలు చేపట్టింది. మంత్రి కేటీఆర్ ప్రత్యేక చొరవ తీసుకుని జిల్లాలో ఆక్వాహబ్‌లో పెట్టుబడులు పెట్టేందుకు వివిధ కంపెనీలను ఆహ్వానించారు. ఆయన అమెరికాలో పర్యటించి ప్రభుత్వం పలు కంపెనీలతో ఒప్పందం కుదిర్చారు.

**10 వేల మందికి ప్రత్యక్ష ఉపాధి**

మత్స్య సంపదను పెంచి మత్స్య కారులకు పెద్ద ఎత్తున ఉపాధి కల్పించాలన్న ఉద్దేశ్యంతో ప్రభుత్వం చర్యలు చేపట్టింది. అందులో భాగంగా మూ డు రిజర్వాయర్లు, 440 చెరువుల్లో 137.92 లక్షల చేప పిల్లలు, 40.32 లక్షల రొయ్య పిల్లలను మత్స్య శాఖ వదిలిపెట్టింది. ఇందులో మిరిగాల, రవ్వులు, బొమ్మెలు, బంగారు తీగలాంటి విత్తన చేపలను వదిలారు. ఒకప్పుడు రెండు రకాల చేపలు మాత్రమే లభించేవి. ప్రభుత్వం వేసిన విత్తన చేపలతో తీరొక్క చేపలు ప్రజలకు అందుబాటు-లోకి వస్తున్నాయి. ప్రభుత్వం ఉచిత విత్తన చేప పిల్లలతో 10వేల మంది మత్స్య కారుల కుటుంబాలకు ఉపాధి దొరికింది. సిరిసిల్ల జిల్లాలో ఆక్వాహబ్ ఏర్పాటు-తో మరో 10వేల మందికి క్రయ, విక్రయాల్లో ప్రత్యక్ష ఉపాధి అవకాశాలు లభించనున్నాయి.

**ఏటా కోటి టన్నులే చేపల ఉత్పత్తి లక్ష్యం**

ఆక్వాహబ్‌లో పెట్టు-బడులు పెట్టేందుకు మంత్రి కేటీఆర్ అమెరికాలోని పలు కంపెనీలతో చర్చలు జరిపారు. ఫిషిన్ ఇండియా, ఫ్రెష్‌టూహెూం, ఆ నందా గ్రూప్, సీపీ ఆక్వా గ్రూప్ సంస్థలు ముందుకొచ్చాయి. ఫిషిన్ ఇండియా కంపెనీ 125 ఎకరాల స్థలంలో పరిశ్రమ ఏర్పాటు చేస్తున్నది. ఇందులో భాగంగా మధ్యమానేరు జలాశయంలో సర్క్యులర్ కేజీస్‌ను ఏర్పాటు చేసి, కేజ్ కల్చర్ ట్ర యల్ రన్‌ను చేపట్టింది. కొన్ని విత్తన చేపలను కేజ్‌కల్చర్‌లో వేసి ఉత్పత్తికి శ్రీకారం చుట్టింది. రూ. 2వేల కోట్లతో ఏర్పాటు చేస్తున్న ఆక్వాహబ్ ద్వారా ఏటా కోటి టన్నుల చేపలను ఎగుమతి చేయాలన్నది లక్ష్యంతో ప్రభుత్వం అడుగులు వేస్తున్నది. సర్కారు మత్స్యకారుల్లో వెలుగులు నింపేందుకు తీసుకుంటున్న చర్యలతో ఆయా కుటుంబాల్లో హర్షాతిరేకాలు వ్యక్త మవుతున్నాయి. ఈ తరహాలో వృత్తిపై ఆధారపడిన కుటుంబాలను ప్రోత్సహిస్తూ.. ఆర్థికంగా, సామాజికంగా వారికి భద్రిత కల్పించాలన్న లక్ష్యంతో కేసీఆర్ సర్కారు కృషి చేస్తోంది. ఈ రంగంలో పొరుగు రాష్ట్రాలు, జాతీయ, అంతర్జాతీయ సంస్థల పెట్టుబడులను కూడా ఆహ్వానిస్తోంది.

- ఎసికె. శ్రీహరి
m : 9849930145
e : ackvs08@gmail.com





**మత్స్య సమాఖ్య చైర్మన్‌గా పిట్టల రవీందర్**

తెలంగాణ ఉద్యమకారుడు, మత్స్యరంగ నిపుణుడు, జర్నలిస్ట్ పిట్టల రవీందర్‌ను తెలంగాణ రాష్ట్ర మత్స్య, సహకార సంఘాల సమాఖ్య చైర్మన్‌గా ముఖ్యమంత్రి కేసీఆర్ నియమించిన సంగతి తెలిసిందే. రవీందర్‌ది కరీంనగర్ జిల్లా వీణవంక. తెలంగాణ ఉద్యమంలో కో-కన్వీనర్‌గా వ్యవహరించారు. తెలంగాణ రాష్ట్ర మత్స్య, సహకార సంఘాల సమాఖ్య చైర్మన్‌గా పిట్టల రవీందర్ మాసబ్‌ట్యాంక్‌లోని మత్స్య శాఖ కార్యాలయంలో మే 22న బాధ్యతలు స్వీకరించారు. ఈ సందర్భంగా ఆయనను మంత్రి తలసాని శ్రీనివాస్ యాదవ్, శాసనమండలి డిప్యూటీ చైర్మన్ బండా ప్రకాశ్ ముదిరాజ్, ఆయా కార్పొరేషన్ల చైర్మన్లు శాలువాతో సత్కరించారు.

# న్యాయవాదుల ప్రదర్శన

న్యాయవాద వృత్తిలో వున్నప్పుడు, ఆ తరువాత న్యాయమూర్తిగా మారిన తరువాత కూడా గమ్మత్తైన ప్రశ్నలు నాకు తరుచూ వచ్చేవి. కోర్టులకి, రచనలకి ఏమైనా సంబంధం వుందానన్నది ఆ ప్రశ్న. అదేవిధంగా సినిమాలకి కోర్టులకి ఏమైనా సారుప్యాలు వున్నాయా నన్నది రెండవ ప్రశ్న.

ఈ మూడింటికి ఏదో అవినాభావ సంబంధం వుందని తరుచూ అన్పించేది. ఇక్కడ కోర్టులు అంటే కోర్టుతో సంబంధం వున్న వ్యక్తులు. వాళ్ళు పోలీసులు కావొచ్చు, ప్రాసిక్యూటర్లు కావొచ్చు, న్యాయవాదులూ, న్యాయమూర్తులూ కావొచ్చు. సాక్షులు కావొచ్చు. ఈ విధంగా ఎంతో మందిని పేర్కొనవచ్చు.

రచయితలు పాత్రలని సృష్టిస్తారు. మాటలను మాట్లాడిస్తారు. ఎన్నో కల్పనలు చేస్తారు. ఓ సత్యాన్ని ఆవిష్కరింప చేయడం కోసం ఎన్నో అసత్యాలను తమ పాత్రల ద్వారా చెప్పిస్తారు. ఇక న్యాయవాదుల విషయానికి వస్తే - తమ పార్టీ గెలుపు కోసం వాళ్ళూ పాత్రలను సృష్టిస్తారు. వాళ్లతో అబద్దాలను మాట్లాడిస్తారు. కొత్త సాక్షులను సృష్టిస్తారు. తాము చూసిందీ, చూడనిదీ కోర్టులో చెబుతారు. ఒక్క కాల్పనిక రచనలను చేసే వాళ్ళను మాత్రమే మనం రచయితలుగా గుర్తిస్తాం. కానీ ఇలాంటి రచయితలు మన చుట్టూ ఎంతో మంది. అందులో ఉదాహరణగా సాక్షులను, న్యాయవాదులను, పోలీసులను, ప్రాసిక్యూటర్లీని పేర్కొనవచ్చు.



న్యాయవాద వృత్తి అదేవిధంగా చిత్రపరిశ్రమ అనేవి వాస్తవానికి రెండు ముఖ్యమైన రంగాలు. కానీ మనం రెండింటిని అంటే కోర్టులో జరిగే కార్యకలాపాలని, సినిమాల్లో జరిగే విషయాలను జాగ్రత్తగా గమనిస్తే రెండింటికి సామీప్యం వున్నట్టు అన్పిస్తుంది. రెండింటిలో డ్రామా వుంటుంది. వినోదం వుంటుంది. విషాదం వుంటుంది.

ఈ రెండింటిలో పాజిటివ్ అంశాలు వున్నాయి. ప్రతి కూలతలూ వున్నాయి. సినిమాలనేవి చాలా మందికి ఇష్టం కలిగిస్తాయి. వాటి గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా వుంటుంది. సినిమాలోని విషయాలే కాదు, సినిమా వెలుపలి విషయాల పట్ల చాలా మందికి ఆసక్తి వుంటుంది. సినిమా వెలిపలి విషయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి మరీ ఎక్కువగా వుంటుంది. న్యాయవాద వృత్తి గురించి కోర్టు కార్యకలాపాల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి అంతగా వుండదు. ఎవరికైనా పెద్దవాళ్ళు కేసుల్లో ఇరుక్కున్నప్పుడు మాత్రమే కోర్టు కలాపాల మీద ఆసక్తి ప్రజల్లో పెరుగుతుంది. కోర్టులతోని ప్రజలకి తక్కువ అవసరాలు పడవచ్చు. కానీ చట్టంతో అవసరం లేని వ్యక్తి ఎవరూ వుండరంటే ఆశ్చర్య పోనవసరం లేదు. సినిమా అనేది సర్వాంతర్యామి కాకపోవచ్చు. కానీ చట్టం అనేది సర్వాంతర్యామి.

హైవే రోడ్డు మీద కాస్త వేగంగా పోతే చట్టం మన కాళ్ళను చుట్టుతుంది. ఇది ఒక చిన్న ఉదాహరణ. లెక్కపెట్టలేని విధంగా చట్టం మనని పెనవేసుకొని వుంటుంది. వ్యాజ్యం, సినిమా అనేవి రెండూ ప్రాథమికంగా కథలు చెప్పే మాధ్యమాలు. కథ చెప్పే మాధ్యమానికి కొంత మంది ప్రాథమికమైన వ్యక్తులు వుంటారు. స్టేక్ హెూల్డర్స్ వుంటారు. సినిమాల్లో నటుడు కన్పిస్తాడు. న్యాయవ్యవస్థలో నల్లకోటు వేసుకొని తెల్లటి బ్యాండ్స్ కట్టుకున్న న్యాయవాది కన్పిస్తాడు. మనం ఈ ఇద్దరినీ జాగ్రత్తగా గమనిస్తే ఈ ఇద్దరూ ఒకే పాత్రని పోషిస్తున్నట్టు అన్పిస్తుంది. మరో విధంగా చెప్పాలంటే నటుడు అనే వ్యక్తి ఓ ప్రదర్శన కారుడు. అతను ఆ ప్రదర్శన చూసే వ్యక్తుల కోసం నటిస్తాడు. అతను వెనక ఓ స్క్రిప్టు వుంటుంది. ఆ స్క్రిప్టు ప్రకారం అతను తన ప్రదర్శనని తన నటన ద్వారా ప్రదర్శిస్తాడు. న్యాయవ్యవస్థలో కూడా న్యాయవాది ఓ ప్రదర్శకుడు. అయితే ఇతని వెనక కూడా స్క్రిప్టు వుంటుంది. అయితే అది పరిస్థితిని బట్టి కొంత మారుతూ వుంటుంది. ప్రతి రోజూ అతని ప్రదర్శన మారుతూ వుంటుంది. కేసు కేసుకీ అతని నటనా ధోరిణి మారాల్సి వుంటుంది. ప్రతి రోజూ అతనిది ఓ కొత్త ప్రదర్శన అతని మీద ఒత్తిడి వుంటుంది. క్లయింట్ జీవితం వుంటుంది. కేసుని బట్టి, న్యాయమూర్తిని బట్టి, సందర్భాన్ని బట్టి అతను తన స్క్రిప్టుని మార్చుకోవాల్సి వుంటుంది.

న్యాయమూర్తులనే వ్యక్తులు సినిమాల్లో ప్రేక్షకుడి లాంటి వారు. ప్రేక్షకుడు తీరు సినిమా గురించి తీర్పుని చెబుతాడు. న్యాయమూర్తి కేసుని బట్టి న్యాయవాది ప్రదర్శనని బట్టి తీర్పుని చెబుతాడు. న్యాయవాది ప్రదర్శనని ఎడిట్ చేసుకునే అవకాశం లేదు. మాటలు

వాడిన తరువాత వెనక్కి తీసుకోవడం కష్టమైన పని. సినిమా అలా కాదు. దానికి స్క్రిప్టు వుంటుంది. దర్శకుడు వుంటాడు. ఎడిటర్ కూడా వుంటాడు. న్యాయవాది పైన వున్నంత ఒత్తిడి నటుడి మీద వుండదు. నటుడు ఆ సినిమా చూస్తున్న ప్రేక్షకులని ఆకర్షించాలి. న్యాయవాది తన ప్రదర్శన ద్వారా న్యాయమూర్తిని ఆకర్షించాలి. తన వాదనతో ఆకట్టుకోవాలి. అనుకున్న ఫలితాన్ని పొందడానికి ప్రయత్నం చేయాల్సి వుంటుంది. తన కథనాన్ని న్యాయమూర్తి నమ్మే విధంగా అతను కోర్టులో తన ప్రదర్శనని చూపాల్సి వుంటుంది.

సినిమాల్లో కథను బట్టి నటులు తమ ప్రదర్శనని చూపి జనాన్ని ఆకట్టుకోవాలి. కోర్టులో న్యాయవాది తన క్లయింట్ కేసుని సమర్థవంతంగా కోర్టుకి అంటే న్యాయమూర్తికి చెప్పాల్సి వుంటుంది. న్యాయమూర్తి చేసే ప్రతి చర్య తన క్లయింట్ కోసమే. సినిమాల్లో అగ్రశ్రేణి నటులు, మంచి కథ వున్నప్పుడు కొత్తదనం వున్నప్పుడు అది విజయవంతం అవుతుంది. కోర్టుల్లో సీనియర్ న్యాయవాది వాదనలు విన్పించినప్పుడు ఒక విధంగా, జూనియర్లు వాదనలు విన్పించినప్పుడు మరో విధంగా ఫలితాలు వుంటాయి. అగ్రశ్రేణి నటుల మాదిరిగా సీనియర్ న్యాయవాదులు. వాళ్ళు సూపర్ స్టార్ లాంటి వారు. కేసులో ఏ మాత్రం బలం లేకపోయినా సీనియర్లు తమ ప్రదర్శనని కొనసాగించినప్పుడు న్యాయమూర్తులు ఓపిగ్గా వింటారు. సూపర్ స్టార్ సినిమా మాదిరిగా.

ప్రదర్శన కారుడికి, చూస్తున్న వ్యక్తులకి మధ్యవున్న సంబంధం లాంటిదే న్యాయవాదీ, నటునికి మధ్య వున్న సంబంధం. ప్రధాన నటునికి చుట్టూ వున్న నటుల మాదరిగా న్యాయవాదికీ జూనియర్లు వుంటారు. వాళ్ళు న్యాయవాదికి సహాయం చేస్తూ వుంటారు.

కోర్టులకి, రచనలకి సంబంధం వుంది. న్యాయవాద వృత్తికీ, సినిమాలకి సంబంధం వుంది. కోర్టుల్లో పోలీసు స్టేషన్లలో మనకు తెలియని కార్యానికి సాహిత్య సృజన జరుగుతూ వుంటుంది.

సినిమాల మాదిరిగా కోర్టుల్లో ప్రదర్శనలు వుంటాయి. కొన్నిసార్లు న్యాయమూర్తుల కోసం వుంటాయి. మరికొన్ని సార్లు గ్యాలరీల కోసం వుంటాయి.

అయితే ఒక్క విషయం ఇక్కడ మర్చిపోకూడదు. సినిమాల్లో కన్పించే కోర్టు వాతావరణం మనకి కోర్టుల్లో కన్పించదు. సినిమాల్లో డ్రామా ఎక్కువగా వుంటుంది. సినిమాల్లో కన్పించీ కన్పించనట్టు వుంటుంది. ఇంకా చాలా విషయాలు మాట్లాడాల్సి వుంది. అవి అన్నీ మరోసారి మాట్లాడుకుందాం.

-మంగారి రాజేందర్ (జింబో)
m : 9440483001
e : rajenderzimbo@gmail.com

# కొత్త తెలంగాణ చరిత్ర బృందం చరిత్ర సదస్సు

## జూన్ 4న, రవీంద్రభారతి - హైదరాబాద్

*తెలంగాణ చరిత్రకు వందనం!*

ఒక దశాబ్దానికి పైగా తెలంగాణా చరిత్రను అన్వేషిస్తున్న కొత్త తెలంగాణ చరిత్ర బృందం ఎన్నో కొత్త చారిత్రక ఆధారాలను గుర్తించింది. పదిహేను వందలకు పైగా దేవాలయాలను సందర్శించి, ఫోటో డాక్యుమెంటేషన్లు చేసింది మా బృందం. దేవతా ప్రతిమల లక్షణాలను వివరించింది. తెలంగాణాలో బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ మతాల పరిణామాలను అధ్యయనం చేసింది. వంద దాకా కొత్త శాసనాలను విమర్శించింది. వందలాది జంతు, వృక్ష శిలాజాలను, వివిధ రాతియుగాల రాతి పనిముట్లను గుర్తించి, సేకరించింది. వివిధ రాజవంశాల నాణేలను పరిశీలించింది. జాతీయస్థాయి సెమినార్లలో పరిశోధనా పత్రాలను సమర్పించింది. తెలంగాణా చరిత్రలో మరుగుపడిన విషయాలను, ఖాళీలను గుర్తించి పూరించే ప్రయత్నాలు చేసింది కొత్త తెలంగాణ చరిత్ర బృందం. 25 నెలలుగా వైవిధ్యమైన చారిత్రక అంశాలపై, ప్రతిభావంతులైన చరిత్రకారులతో జూమ్ సమావేశాలను నిర్వహిస్తూ వస్తున్నది.




మా బృందంలో వివిధ చారిత్రక అంశాలలో అనుభవజ్ఞులైన చరిత్రకారులున్నారు. అంకిత భావం కలిగిన చరిత్ర అన్వేషకులున్నారు. తెలంగాణ అంతటా విస్తరించిన సభ్యులు ఎప్పటికప్పుడు కొత్త చారిత్రక విశేషాలను వెలుగులోకి తెస్తున్నారు. చరిత్ర రచనను అభ్యసిస్తున్నారు. క్షేత్రపరిశీలనలో అవగాహన కలిగివున్నారు. ఈ సదస్సు మా సభ్యుల సమిష్టి శ్రమ, సమీకృత నిర్వహణ. ఆదరించే తెలంగాణా చరిత్ర ప్రేమికులకు తెరిచిన ద్వారం మా కొత్త తెలంగాణ చరిత్ర బృందం. ఎందరో మాకు దారి చూపారు. చూపుతున్నారు.

అందరికీ వందనాలు!

- శ్రీరామోజు హరగోపాల్- కన్వీనర్
కొత్త తెలంగాణ చరిత్ర బృందం

# ఉమ్మడి ఆదిలాబాద్‌లోని ప్రకృతి పర్యాటకం

**ప్రకృతి సహజ చిన్నయ్య గుహ -పెద్దయ్య మంచుకొండలు తెలంగాణా పర్యాటకానికి సహజ వనరు**



చుట్టూ దట్టమైన అడవి... దారి పొడవున ఎత్తైన గుట్టలు... అన్ని సమయాల్లో నీళ్లురే బుగ్గ... చప్పట్లు కొడితే చాలు చల్లని నీరందించే మంచు కొండలు... భీముని పాదముద్రలు... ఎండాకాలంలో ఆహ్లాదంతో పాటు భక్తిని పంచుతున్న చిన్నయ్య, పెద్దయ్య దేవుని గుట్టలు... చిన్నయ్య దేవుని గుట్ట దగ్గర ప్రకృతి సహజంగా ఏర్పడ్డ సహజ సిద్ధ గుహ... పెద్దయ్య దేవుని మంచు కొండలు చూపరులు ఇట్టే కనులను కట్టి పడేస్తాయి. మంచు కొండలు స్తంభంలాగా నిటారుగా ఉంటాయి. ఎత్తయిన కొండల వరసలు ప్రకృతితో పేర్చబడి లయబద్ధంగా నిటారుగా ఉంటాయి. ఈ అందమైన రూపాన్ని ప్రకృతి ప్రసాధించింది. ఎత్తు సుమారు వేయి అడుగుల వరకు ఉంటుంది. గుహల లోపలికి వెళ్ళడానికి చిన్న మార్గం రాతి సందు గుండా వెళ్ళాలి. భీముడు హిడింబి వివాహం ఈ గుహలోపల జరిగింది అని స్థానిక గిరిజనులు చెప్తారు. హిడింబి భీముడు ఈ గుహలో నివాసం ఉన్నారని అంటారు. గుహలో ఒక గద్దే ఉంటుంది.



ఈ గద్దే పై విశ్రాంతి తీసుకోవచ్చు. గుహలు చీకటిగా ఉన్నాయి. గుహలు లోపల చాలా వెడల్పుగా ఉన్నాయి. ప్రస్తుతం గుహలలోపల అడవి జంతువులు నివాసం ఉంటున్నాయి. గుహ పై భాగం కాల్మార్ బాసాల్ట్ శిలలతో, గుహ క్రింద పొర మెత్తటి సుద్ద మట్టితో కూడి ఉంటుంది. గుహ లోపల నీరు ప్రవహించడంతో మెత్తటి మట్టి క్రమక్షయానికి గురిఅయి గుహ ఏర్పడింది. ఇక్కడ పురావాస్తు, భూ భౌతిక పరిశోధకులు పరిశోధనలు చేసినట్లయితే అనేక విషయాలు ప్రపంచానికి తెలుస్థాయి. గుహలో నీరు ఎల్లప్పుడు ఉంటుంది. నీరు చల్లగా తియ్యగా ఉంటుంది. గుహ దగ్గర ఎల్లప్పుడు నీటి బుగ్గ ఉబికి వస్తుంది. ఈ నీరు మండు వేసవిలో కూడా ఉంటాయి. ఈ నీటిని స్థానికులు తమ పంట పొలాలలో చల్లుతారు. ఈ నీటిని చల్లితే పంటలు ఏపుగా పెరిగి అధిక దిగుబడి వస్తుంది అని స్థానికుల విశ్వాసం. పెద్దయ్య మంచు కొండలు ఇక్కడి ప్రత్యేకత. చిన్నయ్య దేవుని గుట్ట దగ్గర నుంచి రెండు కిలోమీటర్ల దూరంలో పెద్దయ్య మంచు కొండలు ఉన్నాయి. దట్టమైన అడవిలో కొండ. ఆ కొండల మధ్య లోయలో యాత్రికులు చప్పట్లు కొడితే పైనుండి నీళ్లు పడతాయి. ఇవి చల్లగా ఎంతో తియ్యగా ఉంటాయి. ఎంత ఎక్కువ చప్పట్లు కొడితే అంత దొడ్డు ధారతో నీళ్లు పడతాయి. అదేవిధంగా చిన్నయ్య గుహలకు అత్యంత సమీపంలో మండు వేసవిలో కూడా భూమిలో నుంచి నిరంతరం సహజ నీటి బుగ్గ ఉబికి వస్తుంది. భయంకరమైన కరువు కాలంలో సైతం ఈ నీటి బుగ్గ ఎండిపోలేదని స్థానిక గిరిజనులు చెప్పుంటారు. ఎంతో ప్రకృతి రమణీయతకు నిలువైన చిన్నయ్య, పెద్దయ్య దేవుడి గుట్టలను గుహలను గత ప్రభుత్వాలు ఏమాత్రం పట్టించుకోకపోవడంతో పర్యాటక అభివృద్ధిలో అడ్రస్ లేని ప్రాంతంగా ఉండిపోయింది. ప్రకృతి రమణీయ ప్రదేశాన్ని తిలకించిడానికి ప్రజలు ఇక్కడికి ఎంతో ప్రయాసపడి వస్తుంటారు. దాదాపు రెండు కిలోమీటర్ల దూరం నడక సాగించాల్సిందే. కనీస సౌకర్యాలు లేకపోవడంతో ఇక్కడికి వచ్చే వారు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. ఈ గుహలను తెలంగాణ టూరిజం అభివృద్ధి చేయాలని స్థానికులు డిమాండ్ చేస్తున్నారు. కనీస సౌకర్యాలు అయినటువంటి విద్యుత్తు, రోడ్డు, వసతి గృహము లాంటి సౌకర్యాలు తెలంగాణ ప్రభుత్వం కల్పిస్తే మంచి పర్యాటక ప్రదేశాలలో ఒకటిగా ఉంటుంది.

- చంద్రకాంత్ మునేశ్వర్
m : 9989538243
e: muneshwarchandrakanth@gmail.com

# విభిన్న పత్రికల సమూహారం 'దక్కన్ ల్యాండ్'

## పాఠక మహాశయులకు నమస్సులతో...

**2020** జులై నుంచి **ప్రకృతివరణం** శీర్షికతో రాస్తున్న కథనాలకు 130వ సంచికతో మూడు సంవత్సరాలు నిండాయి. ప్రకృతే నియంత్రిస్తుంది, ప్రకృతే శాసిస్తుంది. అనే నినాదంతో 17కు పైగా ప్రధాన అంశాల్ని 36 కథనాలుగా (సంచికలు) పాఠకులకు అందించడం జరిగింది. బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతం నుంచి మొదలు పెట్టి సౌర కుటుంబం, భూమి ఏర్పడిన విధానం, జీవం పుట్టుక, డార్విన్ పరిణామ సిద్ధాంతం, భారత ఉపఖండాన్ని కొలచిన (మహాచాపం) విధానం, త్యాగధనులైన శాస్త్రజ్ఞులు, అంటార్కిటికా కరిగిపోతున్న విధానం, ప్రస్తుత భూగోళం ఎదుర్కొంటున్న భూతాపం, విపత్తులు, ఐక్యరాజ్య సమితి చేపట్టిన వివిధ భూ, వాతావరణ పరిరక్షణ చర్యలు, అది పొందుపరిచిన వివిధ నివేదికలు, భూమి ఆవాసంగా ఏర్పడి జీవం అభివృద్ధి చెందిన తర్వాత విపత్తులతో జీవరాశి కనుమరుగైతున్న దశల్ని నా శక్తి మేరకు పాఠకులకు అందించడం జరిగింది.



2020లో తీవ్రరూపం దాల్చిన కోవిడ్ నేపథ్యంతో మొదలు పెట్టిన ఈ కథనాలు, మూడు సంవత్సరాల పాటు కొనసాగిస్తూ, విభిన్న వాతావరణ, పర్యావరణ, జీవావరణ, భూసంబంధిత అంశాల్ని ఒకే దగ్గర, ముఖ్యంగా సులభమైన సరళితో, విద్యార్థి లోకానికి అందించాలన్న నా తపన నెరవేరిందని భావిస్తున్నాను. కాబట్టి, పాఠకలోకం దీన్ని తులానాత్మకంగా తూచాలని కూడా కోరుతున్నాను.

వార, మాస పత్రికలు కనుమరుగై పోతున్న కాలంలో దక్కన్ ల్యాండ్, పాఠకులకు చేరువై, విభిన్న పత్రికల సమూహారంగా నిలవడం ఓ గొప్ప విషయం. ప్రతీ సంచికలో సామాజిక, చైతన్య కలిగించే ఓ కార్టూన్ (RK Laxman లాంటి) వుంటే బాగుంటుంది.

ఈ కథనాల్ని రాయడానికి కోవిడ్-19 కల్గించిన నిర్వేదం, ఒంటరితనం, సహచరులను కోల్పోవడం ఒక కారణమైతే, దక్కన్‌లాండ్ పత్రిక పాఠకలోకాన్ని మేలుకొల్పడం, పర్యావరణ సంబంధ కథనాలకు పెద్ద పీట వేసి, అందులో **ఎం. వేదకుమార్** గారు నాకు స్థానం కల్పించడం ప్రధానం!

ఈ కథనాలకు సార్థకత చేకూరాలంటే ప్రకృతి, పర్యావరణ అంశాలకే పరిమితం కాకుండా 2000 సం॥లో (2YK) ప్రపంచ శాస్త్రజ్ఞులు ప్రకటించిన **18 ప్రకృతి సూత్రాలను** క్రోఢీకరించి రాయాలని, అప్పుడే విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ప్రకృతి ఔత్సాహికులకు వాస్తవమైన శాస్త్రీయ దృక్పథం మరింత బలోపేతం అవుతుందని భావించి వాటిని అన్వయిస్తూ రాయడం జరిగింది. 18 ప్రకృతి సూత్రాలలో చివరి నాలుగు (15-18) జీవశాస్త్ర సంబంధమైనవి కాగా, మొదటి 14 భూ, భౌతిక, రసాయన శాస్త్ర సంబంధమైనవి. అందులో ముందు జీవశాస్త్ర సంబంధమైన నాల్గింటిని పరిచయం చేయడం జరిగింది. మిగతా వాటిలో మొదటి మూడింటిని, తొమ్మిదవ దాన్ని గత (మే-23) సంచికలో ప్రస్తావించడం జరిగింది. ఇక మిగిలిన పది సూత్రాల్నిని అవకాశాన్ని బట్టి వివరించడం జరుగుతుంది.

పత్రికలకు రచయితలెంత ప్రధానమో, సంపాదకులు, ప్రచురణ కర్తలు అంతే ప్రధానమని వేదకుమార్ గారు **దక్కన్‌లాండ్** పత్రిక నిర్వహణతో నిరూపించారు. నాలో నాలుగు దశాబ్దాలుగా పోగుపడిన ప్రకృతి, పర్యావరణ అంశాలకు అక్షరరూపం ఇచ్చేలా దోహదపడిన వేదకుమార్ గారికి, నా కథనాల్ని గత మూడు సంవత్సరాలుగా ఓర్పుతో డిటిపి చేసిన శ్రీహరికి, పత్రికను సుందరంగా తీర్చిదిద్దిన పేజీమేకర్స్‌కు డెస్క్, సర్క్యులేషన్, ఇన్ చార్జీలకు, ప్రెస్ మరియు ఇతర పనివారకు వినమ్రంగా నమస్కరిస్తున్నాను.

పత్రికలు చదివే ఓపిక కనుమరుగైతున్న కాలంలో దక్కన్‌ల్యాండ్ పత్రిక పాఠకుల్ని తిరిగా చేరుకున్న విధానం గొప్ప విషయమే! నా కథనాల్ని చదివి స్పందించిన పాఠకులకు సర్వదా కృతజ్ఞున్ని. పోతే, వీటిని చదివి, సమాచారం బాగుందని కాకుండా, ఈ అవగాహనతో రేపటి తరానికి శాస్త్రీయ ఆలోచనా విధానాన్ని అందించాల్సిన బాధ్యతను కూడా పాఠకులు, ముఖ్యంగా ఉపాధ్యాయులు తీసుకోవాలని, తీసుకుంటారని ఆశిస్తూ, కోరుతూ...

- డా॥ లచ్చయ్య గాండ్ల,
m : 9440116162
e : drglachaiah@gmail.com





# భువనగిరిలో అష్టాదశప్రజల శాసనం

ఇటీవల యాదగిరిగుట్ట-భువనగిరి జిల్లా కేంద్రంలో దొరికిన కాకతీయ శాసనం చిన్న శాసనమే. కాని, కాకతీయుల కాలం నాటి ఈ శాసనం అప్పటి సామాజికపాలన వ్యవస్థ గురించి వివరిస్తున్నది. ప్రతి గ్రామంలో ఏదైనా కార్యక్రమం నిర్వహించాలంటే ఆ గ్రామంలోని అష్టాదశప్రజలు, అధికారులు, కరణాలు అందరు కలిసి నిర్ణయం తీసుకోవాల్సిందే.

భువనగిరిలోని శ్రీ వీరభద్రేశ్వరస్వామి అంగభోగానికై, పురోహితులకు, వ్రిత్తులకు భువనగిరికి చెందిన అష్టాదశప్రజలు అంటే 18కులాలవారు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యవహారిక, గోరక్షక, శిల్పక, వంచాణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాతుక, లబ్ధక, చండాల, మాతంగులు, కలిసి



మహారాజుకు, లెంకలకు, అధికారులకు, కరణాలకు, తమకు పుణ్యం కోరి దానం చేసారు. భువనగిరిలో వ్యాపారం చేసే బలంజలు పెఱుకలతో తెచ్చిన బండారాం నుంచి పెఱుకకు సోలెడు, ప్రతి మలిగెకు(వ్యాపారపు అడ్డా) వెండు ఫలం, వక్కలు, అసిబెనులున్న 5పొనికెలు ఇవ్వాలని, గుడిలో దీపానికి వడ్డెలగండె గానుగువారు నిత్యం సోలెడు నూనె ఆచంద్రార్కం పోసేటట్లు కట్టుబాటుతో ధారవోసి దానం చేసినారు. ఈ శాసనం పాటించటం పుణ్యం అని ఫలశ్రుతిగా చెప్పారు.

భువనగిరి ఖిలా కందకంలో కొత్త శిల్పాలు బయటపడ్డాయి. నగరంలోని గాంధీనగర్లో అభివృద్ధిపనుల కొరకు చేపట్టిన తవ్వకాలలో ఒక శాసనం బయటపడింది. లిపినిబట్టి 14వ శతాబ్దానికి, శాసనంలో తేదీని బట్టి కాకతీయ మహామండలేశ్వరుడు ప్రతాపరుద్రుని కాలంలో 1318 జూన్ 14న వేయబడిన దాన శాసనం అది.

**భువనగిరి శాసన పాఠం:**

1. స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతి
2. య్య ప్రతాపరుద్రదేవ మహారాజు
3. లు సుఖసంకథావినోదంబుల
4. 0 బ్రిదివి రాజ్యంబు సేయుచుం
5. దంగాను శక వరుషాలు 1240 అ
6. వు కాళయుక్తి సంవత్సర ఆషాఢ
7. శు 15గు భునగిరి అష్టాదశప్రజను
8. మహారాజునకూను లెంకలకూను
9. అధికారులకూను కరణాలకూను తమ
10. కూం బుణ్యముగాను గొని ఆయూరి శ్రీవి
11. రద్రేశ్వర దేవరకూను ఆ పురోతు
12. లకు అంగభోగార్తమై బలంజ
13. లు పెఱుకందెచ్చిన బండానను పెఱు
14. కను సోలందూను ప్రతి మలగను
15. ఫలమెండూను వా02కలు అసి
16. బెను లయిదు పొంకలూను దీపా
17. నకు వడ్డలగండె గానుగును నిత్య
18. సోలెండు నూనెను ఆచంద్రస్తాయిగా
19. ను చెల్లను ధారవొస్తిమి ...క్రమ
20. ము యట్లచెల్లించుట మహాపుణ్య
21. ము అయినందుగాను శ్రీరామ
22. వాక్యం శ్లోకం.. సామాన్యోయం

**శాసన సారం:**

మహామండలేశ్వరుడైన కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజు పాలిస్తుండగా శక సం.లు 1240, కాళయుక్తి సం. ఆషాఢ శు. 15/ పౌర్ణిమ గురువారం అనగా క్రీ.శ.1318 జూన్ 14వ తేదీన భువనగిరికి చెందిన అష్టాదశప్రజలు, మహారాజుకు, లెంకలకు,

అధికారులకు, కరణాలకు, తమకు పుణ్యంగా ఆవూరి అనగా భువనగిరి శ్రీవీరభద్రేశ్వర దేవరకు, పురోహితులకు, అంగభోగ నిమిత్తం బలంజులు పెఱుకలో తెచ్చిన బండా(రం)ను పెఱుకకు సోలెడు, ప్రతి మలగకుగాను ఫలమెండూగ, వాకలు(వక్కలు), అసిబెనులు అయిదు పొంకలు, దీపానికి వడ్డెలగండె గానుగునూనె నిత్యం సోలెడు ఆచంద్రార్కం(ఆ సూర్య, చంద్రులున్నంతవరకు) చెల్లేటట్లు ధారవోసినారు. ఈ క్రమం చెల్లించటం పుణ్యం.



కాకతీయుల పాలనలో ప్రజలకు సంఘమర్యాదల పేరుతో ప్రజాధికారాలుండేవని శాసనాలవల్ల తెలుస్తున్నది. సాంఘికాచారాలలో భాగంగా కొన్నికట్టుదిట్టాలుండేవి. అవి న్యాయసమ్మతమైవుండాలి. ప్రజలకున్న అధికారాలు రాజప్రభుత్వానికున్న అధికారాలు ఏవైనా బాధ్యతాయుతమైనవే. రాచరికపాలనలు ఎక్కువపాళ్ళు నియంతృత్వ విధానంలోనే వుంటాయి. విశేషించి ప్రజాభిప్రాయం కోరే సందర్భాలు తక్కువ. కాకతీయులు కాని, అంతకు ముందున్న రాజవంశాలు వారు కానీ, గ్రామాలలో గ్రామాధికారుల(గావుండాల) వ్యవస్థను ఏర్పాటు చేసి, ఆ గ్రామాలలో ఏ ప్రభుత్వ, ప్రభుత్వేతర వ్యవహారమైనా, దానమైనా, ధర్మమైనా ఆ గ్రామ(జన)సభ నిర్ణయం మేరకే చెల్లేది. కొన్నిసార్లు అష్టాదశ ప్రజలన్నా, మహాజనసభలన్నా అటువంటివే. గావుండాల అనుమతితోనే ఆ గ్రామాలలో రాచరికం చేసిన నిర్ణయాలు చెల్లుతుండేవని ఆయా రాజుల పాలనాకాలాల నాటి శాసనాలు చెప్తున్నాయి.



కాకతీయులు రాజ్యమేలుతున్న కాలంలో ప్రభుత్వంతో నిమిత్తం లేని ప్రజాధికారం చెల్లేదని తెలుస్తున్నది. వారి కాలంలో వుండే గ్రామసభలను 'అశేషప్రజ' లేదా 'సమస్త ప్రజ' అని, అష్టాదశప్రజ అని కూడా పిలుస్తుండేవారు. నిజానికి అన్ని గ్రామాలలో 18 కులాలవారు సభలో వుండేవారో లేదో కాని, సభకు ఆ పేరే వుండేది.

శనిగరం గ్రామంలో కాకతీయ 1వ బేతరస ప్రెగ్గడ నారణయ్య ఆ గ్రామం గావుండ(గ్రామ సంఘాధ్యక్షుడు) ముప్పడయ్య, మరొక గావుండ పున్నిరడ్డిల సమ్మతితో దుద్ధమల్ల జినాలయాన్ని బాగుచేయించి, 1 రాటణాన్ని దానం చేసాడు. అదే వూరిలో మధుపేశ్వరాలయానికి దానం చేయడానికి అప్పటి కాకతీయరాజు 2వ ప్రోలుడు అక్కడి గావుండల అనుమతి తీసుకున్నాడు. శనిగరం పెద్దలనే కాక తానివ్వదలచుకున్న భూములున్న గ్రామం బెజవాంక గావుండాల సమ్మతిని కూడా తీసుకున్నాడు.

ఆ కాలంలో గ్రామాలలోని భూములు, నివేశన స్థలాలు ఒక మేరకు గ్రామసంఘాల అధీనంలో వుండేవని తెలుస్తున్నది.

యాదగిరిగుట్ట-భువనగిరి జిల్లా బీబీనగర్ మండలంలోని వెంకిర్యాల (శాసనంలో ఇంక్రియాల్) గ్రామం బయట పాడువద్ద గుడులున్నచోట గతంలో పురావస్తుశాఖవారికి లభించిన క్రీ.శ.1292 (శక సం.1214)నాటి శాసనం కూడా కాకతీయ ప్రతాపరుద్రుని ఏలుబడిలో మహామండలేశ్వరుడుగా వున్న పెండ్లికొడుకు మల్లిదేవ మహారాజు లెంక 'ఎల్లు రవుతు' ఘూసీనది ఒడ్డున వుండే వెనకరేవుల (వెంకిర్యాల,శాసనంలో ఇంక్రియాల్), రేవురేల(రావిరాల), రుద్రపురం (రుద్రెల్లి) అనే 3ఊర్ల కాపులను, అశేషప్రజను పిలిపించి, వారిచేత చేయించిన దానం గురించి ఈ దానం చెపుతున్నది. ఈ పెండ్లికొడ్కు మల్లిదేవమహారాజు పాతర్లపాడు శాసనంలో ప్రస్తావించబడ్డాడు.

ఇతని లెంక(ప్రాణమిచ్చే సైనికాధికారి 'ఎల్లు రవుతు' మూడూర్ల ప్రజలను, పెద్దలను పిలిపించి గుడిమంటపంలో సభ చేసి, దానం విషయమై విన్నపం చేసినాడు. మల్లినాథదేవుని గుడికి దానం చేసేందుకు తనకధికారం లేనందువల్ల తనలెంక ద్వారా రాజు ప్రజలకు విన్నపం చేసివుంటాడు.

అపుడు ఆ పెద్దలందరు తాము దున్నుకుంటున్న భూములమీద మర్తురు(1న్నర ఎకరం)భూమికి 1చిన్నం చొప్పున దేవునికి దానం చేయాలని తీర్మానించారు. అంటే ఇట్లా దానాలకు, పన్నులకు ఆనతిచ్చు అధికారం నాటి ప్రజాసభల కుండేదని తెలుస్తున్నది. అన్ని(?)వృత్తుల మీద కూడా 1గద్యాణం పన్ను విధించారు. గుడిలో దీపాని కొరకు 5 ఆవులనిచ్చి, వాటి కోడెలను అమ్మి నూనె కొనమన్నారు. పెయ్యలను జన్నెకొాదలిన దేవుని మందలోనే వుంచాలన్నారు. ఈ శాసనం ప్రజాసంఘాల అధికారాలను వివరించే మంచి ఉదాహరణ.

**వివరణ:** పెఱుక అంటే ఎద్దు, గుర్రంలకు రెండు ప్రక్కల ధాన్యాదులు పోసిన గోనెమూట. పెఱుకలతో వ్యాపార సాయకులుగా వున్నవారు పెఱుకలు. తర్వాత వారి వృత్తి కులంగా రూపొందింది. (శాసన శబ్దకోశం)

**ధన్యవాదాలు:**
శాసనప్రతి సహకారం: ఆవుల వినోద్, భువనగిరి

**- శ్రీరామోజు హరగోపాల్,**
m : 99494 98698
e: akshara25@gmail.com



ప్రకృతే నియంత్రిస్తుంది! **17** ప్రకృతే శాసిస్తుంది!!

# ప్రకృతి ప్రకోపం! జీవరాశులకు మరణశాసనం!!

(గత సంచిక తరువాయి)

'పుట్టింది గిట్టకమానదు! మట్టిలో పుట్టాం! మట్టిలో కలుస్తాం!' లాంటి మాటలు తరుచుగా వింటుంటాం! ఇదో తాత్విక చింతనే అయినా ఇందులో ప్రకృతి సూత్రం ఇమిడి వుంది. ప్రకృతివరణం మొదటి కథనంలోనే (జులై 2020) కిసాగౌతమి అనే బుద్ధుడి జాతక కథను ప్రస్తావించడం ఈ నేపథ్యంలోనే! శాస్త్రీయంగా చూసినప్పుడు, జీవుల నిర్మాణం నిరేంద్రియ (inorganic) పదార్థాల సమ్మేళనమే! ఆ పదార్థాల పొందిక క్రమబద్ధంగా వున్నంతకాలం, అంటే కణంలోని కేంద్రకము (nucleus), కణజాలం (cytoplasm) శక్తివంతంగా వుండి జీవక్రియల్ని సాగించును. ఇందులో నిర్దేశిత క్రమానుగత మారితే కణస్థాయిని కోల్పోయి జీవక్రియలు ఆగిపోవును. దీన్నే నిర్జీవ(non-living) పదార్థంగా భావిస్తాం. సృష్టిలోని జీవులన్నింటికి ఇది వర్తిస్తుంది. ఇదంతా ఓ ప్రకృతి నియంత్రణలో జరిగే ప్రకృతి నియమం. దీనికి భిన్నంగా బాహ్యశక్తుల ప్రభావంతో కణం నియంత్రణ కోల్పోతే అది చలనరహితంగా మారి తిరిగి మట్టిలో కలిసిపోతుంది. ఇదో నిరంతర ప్రక్రియనే






ఎలిజబెత్ కొల్‌బెర్ట్

అయినా, కొన్నిసార్లు ప్రకృతి విపత్తులతో జీవుల సామూహిక వినాశనానికి దారి తీస్తుంది. ఇలాంటి సంఘటనలు భూ చరిత్రలో లక్షలాదిగా చోటు చేసుకున్నాయి. ఈ సందర్భంగా సముద్ర ఆవాసాల నుంచి, భూభాగాల నుంచి వేలాది రకాల జీవజాతులు శాశ్వతంగా కనుమరుగయ్యాయి.

ఇలా కనుమరుగైన జీవజాతుల్లో ప్రధానంగా రాకాసిబల్లుల్ని ఉదాహరణగా చెప్పుకుంటాం! ఈ విధంగా జీవులు కనుమరుగైన క్రమాన్ని బట్టి, కారణాలను బట్టి శాస్త్రజ్ఞులు సంబంధిత కాలాల్ని, కనుమరుగైన (extinct) జీవుల్ని, వాటి సంఖ్యను అంచనావేసి, వాటికో క్రమాన్ని నిర్ణయించారు. వీరి అంచనాల ప్రకారం ఇప్పటిదాకా జరిగిన వినాశకాల్ని **అయిదు దశలుగా** విభజించారు. ఈ కనుమరుగు నిర్దిష్టంగా ఓ కాలానికి (period) పరిమితం కాకుండా నిరంతరం కొనసాగుతూ వుంటుంది, ప్రస్తుతం ఆరో వినాశకర దశలో జీవరాశి వున్నట్లుగా **ఎలిజబెత్ కొల్‌బెర్ట్** అనే అమెరికన్ జర్నలిస్ట్ పరిశీలనలో తేలిన విషయాన్ని గత కథనం (మే-23)లో ప్రస్తావించడం తెలిసిందే!

**ఈ వినాశకర దశల కాలాన్ని, కారణాల్ని, కనుమరుగైన జీవరాశి శాతాన్ని ఈ కింది పట్టికలో చూడవచ్చు!**

| దశ | కారణం | కాలం మిలియన్ సం॥ క్రితం) | శిలాజ కాలం | నశించిన జీవులు (%) |
|---|---|---|---|---|
| 1. | -మంచు ప్రభావం<br>-సముద్ర మట్టాలు తగ్గడం | 444-440 | Ordovician - Silurian | 85% |
| 2. | -అగ్ని పర్వతాల పేలుళ్ళు<br>-గణనీయంగా తగ్గిన ఆక్సిజన్ | 383-365 | Late Devonian | 75% |
| 3. | -అత్యధిక అగ్నిపర్వతాల పేలుళ్ళు<br>(సైబీరియన్ వినాశ దశ) | 253-252 | Permian - Triassic | 96% (జలచర)<br>70% (భూచర) |
| 4. | -అధికంగా పెరిగిన $CO_2$<br>-భూతాపం | 251-201 | Triassic - Jurassic | 80% |
| 5. | -ఉల్కాపాతం | 145-66 | Cretaceous - Paleogene | 76% |
| 6. | -మానవ మమ్మారిచే...<br>-వాతావరణ పెనుమార్పులు | 66 నుంచి ప్రస్తుతం | Anthropocene defaunation | - వందలాది ఆధునిక జీవుల కనుమరుగు<br>- మానవ కనుమరుగు దశ కూడా కావచ్చు! |

**1. Ordovician - Silurian Extinction:**
(444-440 మిలియన్ సం॥ మధ్యన)

జీవం ఏర్పడిన 3.7 బిలియన్ సంవత్సరాల తర్వాత, భూమిపై జంతు సంబంధ ప్రాణులు నడయాడక ముందు, సముద్రాల్లోని లోతట్టు ప్రాంతాల్లోని పగడపు దిబ్బలు, మొలస్కా జాతి (bractiopods) లాంటి జీవులు అంతరించిన దశగా దీన్ని గుర్తిస్తారు. కచ్చితమైన నిర్మాణం తెలియకున్నా, దవడలు లేని చేపలలాంటి జీవులై వుంటాయని శాస్త్రజ్ఞులు ఈ అంతరించిన జాతిని పేర్కొన్నారు. **పాలియోజోయిక్** (Paleozoic) యుగంలోని ఆరు దశల్లోని రెండోదశ కాలంలో ఈ జీవులు వుండి వుంటాయని లభించిన శిలాజల ఆధారంగా దీన్ని గుర్తించడం జరిగింది.


సిలురియన్ దవడ లేని చేప

ఓసియానోలజి (Oceanology)పత్రిక అంచనా ప్రకారం, దక్షిణార్థగోళంలోని గోండ్వానా ఖండం యావత్ మంచుచే ఆక్రమించడంతో సముద్రమట్టాలు అమాంతంగా తగ్గిపోయాయని, దీంతో జంతుజాల ఆవాసప్రాంతాలు, ఆహారపు గొలుసు దెబ్బతిని, ప్రత్యుత్పత్తి కొరవడి ఇవి పూర్తిగా నశించి వుంటాయని అంచనా! ఓహియో స్టేట్ న్యూస్(Ohio State News) ప్రకారం ఉత్తర అమెరికా ప్రాంతంలో ఏర్పడిన మంచు పర్వతాలు క్రమక్షయానికి (erosion) గురికావడం, సిలికేట్ రాళ్ళు (silicate rocks) కరిగి నీటిలో వున్న కార్బన్‌డయాక్సైడ్‌ను తగ్గించడంతో సముద్రనీరు అత్యల్ప ఉష్ణోగ్రతకు చేరడంతో జీవులకు మరణశయ్యగా మారి నశించి వుంటాయనేది మరోవాదన!


ఆర్డోవిషియన్ కాలం

నేషనల్ జియోగ్రఫిక్ (National Geographic) అంచనాల ప్రకారం విషలోహాలు సముద్రనీటిలో కరగడం ద్వారా ఆక్సిజన్ కొరత ఏర్పడి జీవులు అంతరించి వుంటాయని భావన. అమెరికన్ ఫిజికల్ సొసైటీ (APS) కథనాల ప్రకారం, రోదసిలోని ఓ నక్షత్రం సూపర్‌నోవా (Supernova)గా మారడంతో వెలువడిన గామా (gamma) కిరణాల భూమిపై గల ఓజోన్‌పొరకు రంధ్రాన్ని కల్గించడంతో సూర్యుని అతినీల లోహిత (ultraviolet) కిరణాలు నేరుగా సముద్ర జలాలపై ప్రసరించడంతో సముద్రగర్భ జీవులన్నీ నశించాయని భావించింది. మరో వాదన ప్రకారం భూమిపైన, సముద్రగర్భంలోని అగ్ని పర్వతాలు పేలి వీటి వినాశనానికి దారితీసివుంటుందని కూడా గుర్తించారు.

కారణాలు ఏవైనా, విభిన్న ఉపద్రవాలతో ఈ రకం జాతి జీవులు 85శాతం అంతరించి వుంటాయని అంచనా. ఈ విపత్తుకు బతికి బట్టకట్టిన జీవుల నుంచే తర్వాతి తరం సముద్ర జీవులు రూపాంతరం చెందివుంటాయని శాస్త్రజ్ఞుల అంచనా!

**2. Late Devonian Extinction:**
(383-365 మిలియన్ సం॥ మధ్యన)

పాలియోజోయిక్ యుగంనాటి నాల్గవదశలో ఈ విపత్తు జరిగి వుంటుందని, ఈ యుగాన్ని **చేపల యుగం** (fish age) అని కూడా శాస్త్రజ్ఞులు భావిస్తారు. ఇదే కాలంలో సముద్రజీవులు భూమిపైకి పాకుతూ వచ్చిన దశగా కూడా దీన్ని గుర్తిస్తారు. 1995 నాటి జియాలోజికల్ సొసైటీ ఆఫ్ అమెరికా (GSA) పత్రిక కథనం ప్రకారం భూమిపై అభివృద్ధి చెందిన నాళాలు (Xylem, phloem) గల కాండపు వృక్షాలు, పుష్పించే ఇతర మొక్కలు కూడా అంతరించి వుంటాయని, అలాగే బిబిసి (BBC) కథనం ప్రకారం భూమిపై అప్పటికే అభివృద్ధి చెందిన వృక్షజాతి వేళ్ళు నేలను అట్టిపట్టడంతో మరింతగా భూమి పెరగడం, ప్రకృతి విపత్తులకు, క్రమక్షయానికి ఈ నేల గురికావడం, ఆల్గెలాంటి ప్రాథమిక జీవులు నీటిలో జీవించడం, ఇవి మహా సమూహాలుగా సముద్రాల్లో వ్యాప్తి చెందడంతో అత్యధికంగా ఆక్సిజన్‌ను వినియోగించి వుంటాయని, అప్పటికే ముఖకుహరంపై దలసరి కవచంగల చేపలలాంటి భారీ జలచర జీవులు ఆక్సిజన్ కొరతను ఎదుర్కొని కనుమరుగై వుంటాయని పేర్కొన్నది.

మరో కథనం ప్రకారం అగ్ని పర్వతాల పేలుళ్ళ వలన ఈ భారీ చేపలు (33 అడుగు పొడవుగల (dunkleosteus)), నీటి తిమింగలం లాంటి భారీ కాయాలు 75శాతం అంతరించినట్లు గుర్తించారు.

**3. Permian -Triassic Extinction:**
(253-252 మిలియన్ సం॥ మధ్యన)

భూగోళపు చరిత్రలో ఈ దశను జీవులకు అత్యంత వినాశకర దశగా భావిస్తారు. భూమిపై మొదటిసారి నడయాడిన సరీసృపాలు (reptiles) 70శాతం, రూపాంతరం చెందిన విభిన్నరకాల సముద్రజీవులు 90శాతం పూర్తిగా కనుమరుగైన కాలమిది. సరీసృపాలతో పాటుగా ఉభయచరాల్ని, ఎగిరే కీటకాల్ని భూగోళంపై లేకుండా తుడ్చిపెట్టిన దశగా లైవ్‌సైన్స్ (Live science) పత్రిక పేర్కొన్నది. మరో వాదన ప్రకారం సైబీరియా ప్రాంతంలో వరుసగా పేలిన అగ్నిపర్వతాలు కూడా ఈ జీవుల కనుమరుగుకు కారణమని ఓక్‌లాహొమా (Oklahoma) శాస్త్రజ్ఞుడు **సామ్ నొబెల్ మ్యూసిమిన్** (Sam Noble imuseumin) ఉవాచ! వరుసగా పేలిన అగ్నిపర్వతాల నుండి వెలువడిన కార్బన్‌డయాక్సైడ్ భూతాపాన్ని విపరీతంగా పెంచడంతో సముద్రాలు వేడెక్కి నీటిమట్టాలు





డైనోసార్స్ గా రూపాంతరం



జురాసిక్ కాలపు డైనోసార్

పెరిగి వుంటాయని, సముద్ర జలాల్లో ఆక్సిజన్ కొరత ఏర్పడి, ఆమ్లవర్షాలు కూడా కురిసి వుంటాయని, అందుకే జీవరాశికి ఇది అత్యంత ప్రమాదకర దశగా శాస్త్రజ్ఞులు దీన్ని పేర్కొంటారు.

ఇదే కాలంలో భూగోళం ఇప్పుడున్నట్లుగా లేకుండా ఏక ఖండికగా పాంగియా ( Pangaea- మే2021 కథనం చూడాలి!) లా వుండిందని, దీంతో సముద్రజలాల ప్రవాహాలు నిలిచిపోయి కార్బన్‌డయాక్సైడ్ గాఢత పెరగడంతో ఆక్సిజన్ కొరతతో జీవులు మరణించి వుంటాయని మరికొందరి శాస్త్రజ్ఞుల భావన! ఈ సందర్భంగా కనుమరుగైన పగడపు దిబ్బలు తిరిగి పురుడు పోసుకోవడానికి సుమారు 14 మిలియన్ సంవత్సరాలు పట్టినట్లుగా కొందరు మెరైన్ శాస్త్రవేత్తల అభిప్రాయం.

**4. Triassic - Jurassic Extinction :**

(251-201 మిలియన్ సం॥ మధ్యన)

ఈ దశ మెసోజాయిక్ రెండో దశకాలంలో సంభవించినట్లుగా, అప్పుడే అభివృద్ధి చెందిన క్షీరదాల పుట్టుక దశగా దీన్ని గుర్తిస్తారు. మూడో దశలో చోటు చేసుకున్న పరిస్థితుల్లాగానే వరుస అగ్ని పర్వతాల పేలుళ్ళు, ఆక్సిజన్ కొరత ఈ వినాశకర దశకు కారణమై వుంటుందని, దీంతో అభివృద్ధి చెందిన చరిత్ర పూర్వపు సముద్ర మొసళ్ళు, భూమిపై ఎగిరేల పాకుడు జంతువుల ఆవాసాలు దెబ్బతినడంతో అంతరించి వుంటాయని మెరైన్ ఇండిపెండెంట్ జర్నల్ (MIJ) కథనం! ఇలా అత్యధికంగా పెరిగిన కార్బన్‌డయాక్సైడ్‌కు మంచు ఖండికలు (glaciers) కరిగి సముద్రమట్టాలు పెరగడంతో జీవుల ఉనికికి ప్రమాదకరంగా మారి వుంటుందని మరో కథనం!

డిస్కవరి (Discovery) పత్రిక కథనం ప్రకారం శాశ్వత మంచు (perma frost) నుంచి మీథేన్ విడుదల కావడంతో కూడా భూతాపం అనూహ్యంగా పెరిగి ఈ జీవుల అంతానికి కారణమై వుంటుందని పేర్కొన్నది.

ఈ దశలో దాదాపు 80శాతం అభివృద్ధి చెందిన భూచరాలు, ఇతర జీవులు కనుమరుగైనట్లుగా శాస్త్రజ్ఞులు అంచనా వేసారు.

**5. Cretaceous - Paleogence Extinction:**
**(K-Pg Extinction)**

(145-66 మిలియన్ సం॥ మధ్యన)

జీవుల కనుమరుగులో అత్యంత ప్రాధాన్యత గల దశ ఇది. ఈ దశలోనే భూమిపై అభివృద్ధి చెందిన అత్యంత భారీ కాయమైన రాకాసిబల్లులు (Dynosaurs) అంతమైన దశగా దీన్ని గుర్తిస్తారు. ఈదశను కొందరు (K-Pg) దశగా, మరికొందరు (K-T) దశగా వ్యవహరిస్తారు. (K for Kreide means in German Cretaceous))

ఈ భారీ విపత్తుకు కారణం, మెక్సికోలోని యుకాటన్ (Yucatan) ప్రాంతంలో భూమిని భారీ ఉల్క (asteriod) గంటకు 72,000 కి.మీ. వేగంతో ఢీకొనగా, 180 కి.మీ. వెడల్పుతో 19 కి.మీ. లోతైన పెద్ద గొయ్యి (రంధ్రం-) ఏర్పడిందని, దీని ప్రభావం 1450 కి.మీ. పరిధిపై చూపగా, భూగోళం ఓ ఊపుకు గురై వుంటుందని, దీంతో రాకాసిబల్లులతో పాటు, మిగతా జీవులు మొత్తంగా అంతమొంది వుంటాయని లభించిన శిలాజాల ఆధారంగా గుర్తించారు.

లైవ్‌సైన్స్ (Live Science) కథనం ప్రకారం ఉల్క ఢీకొనడంతో కొన్ని నెలలపాటు ఆకాశం చీకటిగా మారిందని, ఉల్క నుంచి విడువడిన కొన్ని శకలాలు చాలాకాలం వాతావరణంలో వుండిపోగా భూతలంపై సూర్యరశ్మి సోకని పరిస్థితి, మొక్కలు కిరణజన్యసంయోగ క్రియ జరుపుకోలేని స్థితి ఏర్పడడంతో ఆహారపు గొలుసు దెబ్బతిని, ఆహారం దొరక్క కూడా రాకాసిబల్లులు మరణించి వుంటాయని తెలిపింది.

ఇలా ఆకాశం కారు చీకట్లు కమ్ముకోవడం, భూమిపై ఉష్ణోగ్రత అమాంతంగా పడిపోవడంతో అతిశీతల వాతావరణం ఏర్పడంతో, దీర్ఘకాలంగా కొనసాగే జీవుల కనుమరుగు దశ కొద్ది నెలల్లోనే జరిగిపోయి వుంటుందనే వాదనలు వున్నాయి. పోతే బొరియల్లో దాక్కొనవి, సముద్రాల్లోకి పాకి ఈదగలిగిన కొన్ని జీవులు మాత్రం బతకడం, మరికొన్ని ఎగరడానికి ప్రయత్నం చేయడం, అవి కాలక్రమంలో ఆధునిక పక్షిజాతికి (రాబందులు/గరుడపక్షులు/డేగలు మొ॥) పురుడు పోసి వుంటాయని మరికొన్ని పరిశోధనలు తెలుపుతున్నాయి. ఓ అంచనా ప్రకారం దాదాపు 10,000 రకాల ఎగిరే జాతి జీవులు ఇలా ఉద్భవించి వుంటాయని భావిస్తున్నారు.

మెసోజోయిక్ చివరి దశలో చోటు చేసుకున్న ఈ పరిమాణంతో రాకాసిబల్లుల లాంటి జీవులు 76 శాతం, సముద్రాల్లోని షార్క్‌లాంటి భారీ చేపలు కూడా అంతరించినట్లు వివిధ పరిశోధనలు ప్రస్తావించాయి.

**ముగింపు:**

పై వివిధ దశల్ని పరిశీలించినట్లైతే జీవరాశి పుట్టుక, కనుమరుగు సమాంతర ప్రకృతి చర్యలని తెలుస్తుంది. వీటిని మానవ మేధస్సు నియంత్రించగలదా అని ప్రశ్నించుకుంటే అసాధ్యమనే తేలుతుంది. పైగా మానవుడే ఓ విధ్వంసకారిగా మారితే, ప్రకృతి ప్రకోపం మరింతగా పెరగడం అనివార్యమని ఆరోదశ ప్రస్తుతం


క్రెటేషియస్ యుగం ఎగిరే జంతువులు

తెలుపుతున్నది.

మానవజాతి మేధోమదనంతో ఏర్పర్చుకున్న అభివృద్ధి నమూనాలు మానవుని సౌకర్యాలను ఎన్నోరెట్లుగా ఇనుమడింప చేయడమే కాక, శ్రమలేకుండా సుఖాల్ని అనుభవించ వర్గమే ఎదిగి ప్రకృతి సంపదల్ని ధ్వంసం చేస్తూ, సొమ్ము చేసుకుంటూ ప్రపంచ రాజకీయాల్ని శాసిస్తున్నది. జన్మనిచ్చిన భూగ్రహాన్ని అన్ని విధాల నాశనం చేస్తూ, కొత్త ఆవాస గ్రహాలకై దారులు వేసుకుంటున్నది. భవిష్యత్‌లో భూ ఆవాసం నివాసయోగ్యం కాకపోతే కొత్త గ్రహాలపై జీవనం సాగించే ఎత్తుగడల్ని ప్రారంభించాయి. పోతే, ఇదే మానవుడు కొత్త గ్రహాన్ని కూడా కాపాడుకుంటాడని అనుకోలేము.

**కాబట్టి, సౌకర్యవంతమైన భూగోళాన్ని పునఃరక్షించుకోవడమొక్కటే మానవుని ముందున్న కర్తవ్యం!**

ప్రస్తుతం కొనసాగుతున్న ఆరవ వినాశకర దశ, అందులో మానవుడి విధ్వంసక పాత్ర గూర్చి కూడా చర్చించాల్సిన ఆవశ్యకత వుంది. దీన్ని కూడా చర్చించే ప్రయత్నం చేద్దాం!

– డా॥ లచ్చయ్య గాండ్ల,
m : 9440116162
e : drglachaiah@gmail.com



## చందాదారులుగా చేరండి... చేర్పించండి...

**పాఠకులకు, రచయితలకు, పరిశోధకులకు... నమస్సులు.**

తెలంగాణ ఉద్యమ సందర్భంలో పుట్టిన తెలుగు మాసపత్రిక దక్కన్‌లాండ్ తొమ్మిదేళ్ళు పూర్తి చేసుకొని పదవ సంవత్సరం లోనికి అడుగు పెట్టింది. తెలంగాణ సాధన ఉద్యమ సమయంలో ఉద్యమానికి దిశా నిర్దేశం చేసేలా ఎందరో ప్రముఖుల వ్యాసాలను అందించింది. టిఆర్‌సి 'చర్చ' సారాంశాలను ప్రజల్లోకి తీసుకెళ్ళింది. తెలంగాణ భావజాలాన్ని బలోపేతం చేసింది.

స్వరాష్ట్ర ఆవిర్భావం తర్వాత దక్కన్‌లాండ్ తెలంగాణ పునర్ నిర్మాణంతో తనదైన పాత్రను పోషిస్తున్నది. తెలంగాణ తనదైన అస్తిత్వాన్ని కాపాడుకోవడానికి, మరింత పరిపుష్టం చేసుకునేదానికి దోహదం చేస్తున్నది.

ఈ నేపథ్యంలో సామాజిక అంశాలతోపాటు, పర్యావరణం, చరిత్ర, వివిధ చేతివృత్తుల కళారూపాలు, నైపుణ్యాలు, వారసత్వం, పర్యాటకం లాంటి అంశాలపై కథనాలను వెలువరిస్తున్నది. ప్రజా సంక్షేమం కోసం జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను ప్రజల దృష్టికి తీసుకెళ్లుతుంది. 2012 సెప్టెంబర్‌లో ప్రారంభమైన పత్రిక ఇప్పటి వరకూ మీ అందరి సహకారాలతో కొనసాగుతూ వస్తుంది. ఇప్పటికే ఎంతో మంది మిత్రులు, శ్రేయోభిలాషులు, తమ చందాలతో పాటు, చందాదారులను చేర్పించడంలో తమ సహకారాన్ని అందిస్తున్నారు. వారికి ధన్యవాదాలు.

అయినప్పటికీ పత్రిక నిర్వహణ కష్టసాధ్యంగా ఉంది. దక్కన్‌లాండ్ మనందరిది. పదికాలాల పాటు పత్రిక సజావుగా వెలువడే బాధ్యత మన అందరిదీ.

చందా పూర్తయిన వారు తమ చందాలను రెన్యూవల్ చేసుకుని కాంప్లిమెంటరీ కాపీలు అందుతున్న వారు కూడా చందాదారులుగా చేరి, మిత్రులను చేర్పించి సహకరిస్తారని ఆశిస్తూ...

ధన్యవాదాలతో... మీ
**– మణికొండ వేదకుమార్**
సంపాదకులు

**చందా వివరాలు:**

| | | |
|---|---|---|
| వార్షిక చందా | : | రూ. 300 |
| 2 సం॥లకు | : | రూ. 600 |

'దక్కన్ ల్యాండ్' పేరిట ఎంఓ, మనీయార్డర్, చెక్ లేదా నగదు రూపంలో చందామొత్తం చెల్లించవచ్చు.

**చిరునామా :**

**DECCAN LAND :**
"CHANDRAM" 3-6-712/2, St.No. 12, Himayatnagar,
Hyderabad - 500 029. Telangana
**Fax: 040-27635644 Mobile: 9030626288**
E-mail:desk.deccan@gmail.com www.deccanland.com

**దక్కన్‌ల్యాండ్ బ్యాంకు ఖాతా వివరములు:**

| | |
|---|---|
| Name | : DECCAN LAND |
| Bank | : KOTAK MAHINDRA BANK |
| A/c No | : 7111218829 |
| IFSC Code | : KKBK0007463 |
| Branch Code | : 007463 |




# బాల సాహిత్య సమ్మేళనం

తెలంగాణ సారస్వత పరిషత్ ఆధ్వర్యంలో మే 24, 25 తేదీలలో రెండు రోజులపాటు బాలసాహిత్య సమ్మేళనం హైదరాబాదులో ఘనంగా నిర్వహించారు. తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల బాలసాహితీవేత్తలు, భాషాభిమానులు, తెలుగు ఉపాధ్యాయులు, బాల కవులు, వివిధ పాఠశాలల విద్యార్థులు వక్తలుగా, ప్రతినిధులుగా పాల్గొన్నారు. ఇటీవల కాలంలో ఇంత పెద్ద ఎత్తున బాల సాహిత్యం పై సదస్సు నిర్వహించడం ఇదే ప్రథమమని చెప్పవచ్చు. 2017లో ప్రపంచ తెలంగాణ తెలుగు మహాసభలు రాష్ట్ర ప్రభుత్వము గొప్పగా నిర్వహించింది. అందులో బాల సాహిత్య రంగానికి పెద్దపీట వేయబడింది. అనేకమంది బాలసాహితీ వేత్తలు, ఉపాధ్యాయులు, విద్యార్థులు పాల్గొన్నారు. ఆ సభల నిర్వహణ ద్వారానే బాల సాహిత్య రంగానికి బలం, బలాలు చేకూరాయి. పెద్దలు రాసినవే కాకుండా పిల్లలు రాసిన అనేక పుస్తకాలు ఆవిష్కరించబడ్డాయి. అంతకు పూర్వం బాల సాహిత్యంలో రచనలు అనుకున్నంత రీతిలో రాలేదనే విమర్శ ఉంది. బాల సాహిత్యం రాసే వారి సంఖ్య కూడా పరిమితంగా ఉండేది. తదనంతరం బాల సాహిత్య రంగంలో పనిచేసే వారి సంఖ్య పెరుగుతూ రాశిలోనూ వాసిలోనూ అభివృద్ధి చెందుతూ వస్తుంది. బాల చెలిమి వంటి సంస్థలు, వ్యక్తులు బాల సాహిత్యాన్ని అందించే దిశగా ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నవి. అయినప్పటికీ బాల సాహిత్యం అనుకున్నంతగా బాలల చెంతకు చేరడం లేదనే విమర్శ కూడా ఉంది. పాఠశాలలో చదివే విద్యార్థులు కేవలం పాఠ్య పుస్తకాలకే పరిమితమయ్యేలా పరిస్థితులు కనిపిస్తూనే ఉన్నవి. ఇటువంటి పరిస్థితులలో మెరుగైన సమాజం నిర్మించడం కోసం అనేక సంస్థలు, వ్యక్తులు దయార్ద్ర హృదయంతో ముందు సాగుతూనే ఉన్నారు. ఇటువంటి నేపథ్యంలోనే 80 సంవత్సరాల చరిత్ర కలిగిన తెలంగాణ సారస్వత పరిషత్తు సాహిత్యంలో ఎన్నో సేవలు అందిస్తూ... ఇవాల బాల సాహిత్య రంగానికి సంబంధించి అద్వితీయమైన సదస్సు నిర్వహించింది. రెండు రోజులపాటు ఎంతోమంది ప్రతినిధులు, ప్రముఖ రచయితలు మేదో మధనం చేశారు. విభిన్న అంశాల పైన ప్రసంగాలు కొనసాగినవి. చర్చ గోష్టులు జరిగినవి. ఉపాధ్యాయులు. విద్యార్థులు పాల్గొని తమ అభిప్రాయాలను పంచుకున్నారు. పెద్దలు రాసినవి పిల్లలు రాసిన అనేక పుస్తకాలు ఆవిష్కరించబడినవి.


డా॥ జె. చెన్నయ్య
పరిషత్తు కార్యదర్శి

మొదటి రోజున ప్రారంభోత్సవం సమావేశంలో పరిషత్తు కార్యదర్శి డా॥ జె. చెన్నయ్యగారు కార్యక్రమం గురించి తెలియజేశారు. తెలంగాణ సారస్వత పరిషత్ బాలల కోసం ప్రచురించిన గ్రంథాల ఆవిష్కరణ జరిగింది. పరిషత్తు అధ్యక్షులు డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి అధ్యక్షతన ప్రారంభమైన సమావేశంలో ప్రత్యేక ఆహ్వానితులుగా హాజరైన శాసన మండలి సభ్యులు, మాట-పాట ద్వారా తెలంగాణ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన గాయకుడు దేశపతి శ్రీనివాస్ చేతుల మీదుగా "బాల కథా సౌరభం" గ్రంథం ఆవిష్కరించబడింది. ఈ గ్రంథం బాల సాహిత్య రంగంలో అద్భుతమైన గ్రంథంగా



నిలబడబోతుందన్నారు. అనంతరం దేశపతి శ్రీనివాస్ మాట్లాడుతూ బాల్యం భయంకర దాడికి గురి అవుతుందని, ఒత్తిడికి లోనవుతుందని ఆవేదన వ్యక్తం చేశారు. దళితుల గురించి, స్త్రీల గురించి మాత్రమే కాకుండా ఇవాల పిల్లల బాల్యం గురించి వారిని రక్షించే విధంగా ఆలోచనలు చేయాలని బాల సాహితీవేత్తలకు పిలుపునిచ్చారు. బాల సాహిత్యం రాయడం అంత సులువైన పని కాదని పిల్లల స్థాయికి ఎదిగి రాయాలని పిల్లల లోకంలోకి వెళ్ళినప్పుడు అద్భుతమైన బాలసాహిత్యం వస్తుందని అన్నారు. తటాకంలోని నీరు కాల్వల ద్వారా ప్రవహిస్తేనే మంచి పంటలు పండుతాయి. అట్లనే బాల సాహిత్య రచనలు పిల్లలకు చేరినప్పుడే మంచి సమాజం ఆవిష్కృతమవుతుంది అన్నారు. అదేవిధంగా సెల్ ఫోను మంచికి ఉపయోగించేలా తల్లిదండ్రులు పిల్లల ఎడల శ్రద్ధ కనబరచాలని, పుస్తకాలు చదవడం నేర్పాలని సూచించారు. ఈ సందర్భంగా సింహం-కుందేలు కథ చెప్పిన తీరు అందరినీ ఆకట్టుకుంది.



గరిపెల్లి అశోక్
బాలచెలిమి

తదుపరి ప్రభుత్వ సలహాదారు కేవీ రమణాచారి మాట్లాడుతూ ఎగురుతున్న పతంగానికి దారం లాంటివాడు వరప్రసాద్ రెడ్డి అని ఈ రెండు రోజుల బాల సాహిత్య సమ్మేళనానికి భారీ మొత్తంలో ఆర్థిక సౌజన్యం కల్పించిన ఆయనను మర్చిపోమని అన్నారు. మన భాషా సంస్కృతులు, సంప్రదాయాలు పిల్లలకు తెలియాల్సిన అవసరం ఎంతైనా ఉందని, మనం ఏం చేస్తే బాలల్లో మార్పు వస్తుందో అది చేయాలని తెలిపారు. ఉత్తమ బాల సాహిత్యం మరింతగా పిల్లకు అందించాలి. చిన్నప్పటి నుండే నైతిక విలువలను పెంపొందించాలి. ఈ పని జరిగేందుకు సారస్వత పరిషత్తు చేస్తున్న కృషి అభినందనీయమన్నారు. పద్మభూషణ్ డాక్టర్ కె ఐ వరప్రసాద రెడ్డి తొలి పలుకులు మాట్లాడుతూ బాలల కోసం చేపట్టే కార్యక్రమాలలో తన వంతు సహాయం అందిస్తానని హామీ ఇవ్వడం జరిగింది. ఇది ఆయన దాతృత్వానికి ప్రతీకగా చెప్పవచ్చు. సమావేశాన్ని డాక్టర్ వత్తిపాక మోహన్ సమన్వయపరిచారు. డాక్టర్ ఎం భూపాల్, కన్నెగంటి అనసూయ తదితరులు బాల సాహిత్యంపై మాట్లాడారు.

అనంతరం జరిగిన మొదటి సదస్సులో "బాల సాహిత్యం-మౌలిక అంశాలు" అనే అంశం గురించి దాసరి వెంకటరమణ అధ్యక్షతన తిరునగరి వేదాంత సూరి ఆత్మీయ అతిథిగా పాల్గొని మాట్లాడారు. "బాల సాహిత్యము భాష, శైలి, వస్తువు" అంశం గురించి కృష్ణకుమారి, నైతిక విలువలు మానవ సంబంధాలు అనే అంశం గురించి డాక్టర్ ఎం.హరి కిషన్, వైజ్ఞానిక అంశాల గురించి శాంతారావు, ఆంగ్లంలో బాల సాహిత్యం గురించి స్వర్ణ కిలారి ప్రసంగాల ద్వారా అనేకమైన సూచనలు, సలహాలు అందజేశారు. కూకట్ల తిరుపతి ఈ కార్యక్రమానికి సమన్వయకర్తగా వ్యవహరించారు. తదుపరి జరిగిన రెండవ సదస్సులో "బాల సాహిత్యం నాడు- నేడు" అనే అంశం పైన చర్చ గోష్టి జరిగింది. డాక్టర్ అమరవాది నీరజ అధ్యక్షతన కోమటిరెడ్డి బుచ్చిరెడ్డి, పుప్పాల కృష్ణమూర్తి, ఉండ్రాల రాజేశం, సంఘనభట్ల రామకృష్ణయ్య, అబ్దుల్ ఘని, ఉమా గాంధీ, జయశ్రీ, హారిక తదితర బాలసాహితీవేత్తలు తమ అభిప్రాయాలు వ్యక్తపరిచారు. డాక్టర్ అమ్మిన శ్రీనివాసరాజు సమన్వయకర్తగా వ్యవహరించారు.

మూడవ సదస్సులో బాలల కోసం వివిధ నైపుణ్యాలు అంశం గురించి ప్రముఖ రచయిత్రి శాంతి ప్రబోధ, ఉపన్యాస కల గురించి జివిఎన్ రాజు, కథలు చెప్పే కళ గురించి చొక్కాపు వెంకటరమణ విలువైన సమాచారాన్ని తమ ప్రసంగాల ద్వారా సమావేశాన్ని మంత్రముగ్ధులు చేశారు. ఈ కార్యక్రమంలో పులి జమున సమన్వయకర్తగా వ్యవహరించారు.

అనంతరం నాలుగో సదస్సులో బాలల కథా రచన మెలుకువల గురించి డాక్టర్ వి.ఆర్. శర్మ అధ్యక్షతన సి.ఎ.ప్రసాద్ వస్తువు, శిల్పం గురించి మాట్లాడారు. పైడిమర్రి రామకృష్ణ సమన్వయకర్తగా వ్యవహరించడం జరిగింది.

రెండవ రోజు ఐదో సదస్సు లలిత కళా పరిచయం గురించి డాక్టర్ వడ్డేపల్లి కృష్ణ, సంగీత పరిచయం గురించి కలగ కృష్ణమోహన్, చిత్రలేఖనం శిల్పకళా పరిచయం గురించి జి వెంకటేశ్వర్లు, నాటక పరిచయం గురించి విజయకుమార్, నృత్య పరిచయం, వివరాలు విశేషాలు కళాకృష్ణ ఆసక్తికరమైన విషయాలు వెల్లడించారు. బైతి దుర్గయ్య సమన్వయం చేశారు. ఆరవ సదస్సులో "పాఠశాలలు బాలసాహిత్య వికాస కేంద్రాలు" అనే అంశం మీద ఉపాధ్యాయుల చర్చాగోష్టి ఆచార్య వెల్దండ నిత్యానంద రావు అధ్యక్షతన జరిగింది.



అనేక మంది ఉపాధ్యాయులు తమ అభిప్రాయాలను పంచుకున్నారు. ఏడవ సదస్సులో బాల రచయితల యిష్టా గోష్టి కార్యక్రమాన్ని కొసరాజు సురేష్‌గారు అధ్యక్షత వహించగా, సి. కిరణ్ సమన్వయం చేసారు.

చివర ముగింపు సమావేశంలో బాలచెలిమి 'పర్యావరణ పోటీలు - 2023' విద్యార్థులు రాసిన కథలను ఆవిష్కరించారు. ఈ సమావేశానికి విశిష్ట అతిథులుగా హాజరైన దక్కన్ ల్యాండ్ మాస పత్రిక సంపాదకులు మణికొండ వేదకుమార్ మాట్లాడుతూ రెండు రోజుల నుండి ఇంత చక్కటి సమావేశం ఏర్పాటు చేయడం, విభిన్న అంశాల పట్ల చర్చలు జరగడం మంచి ఫలం వస్తుందని ఆశించారు. ఈ రెండు రోజుల సదస్సు బాల సాహిత్య రంగంలో మైలురాయిగా నిలుస్తుందని, సరైన సమయంలో ఈ సదస్సు నిర్వహించడం పట్ల సంతోషం వ్యక్తం చేశారు. పాఠశాల స్థాయిలో లలిత కళలకు సంబంధించి కూడా ప్లాట్ ఫామ్స్ ఉండాలని, అకాడమిక్ ప్రమాణాలతో పాటు ఇటువంటి అంశాలు జరిగేలా సిలబస్ రూపొందించబడాలని తెలియజేశారు. ఈ సమ్మేళనంలో వచ్చిన అంశాలను ప్రభుత్వానికి నివేదించి అమలు జరిగే విధంగా అందరూ ప్రయత్నించాలని కోరారు. గౌరవ అతిథులుగా వసుంధర, కృష్ణ వర్ధన్ రెడ్డి, తురగా ఉషా రమణి పాల్గొని బాల సాహిత్యంపై తమ అమూల్యమైన అభిప్రాయాలను సభికులకు అందించారు. రెండు రోజుల సమావేశంలోని అంశాలను నివేదిక రూపంలో గరిపెల్లి అశోక్ చదివి వినిపించారు. పాఠశాలల్లో తెలుగు భాషా పరిరక్షణ కొరకు చర్యలు చేపట్టుట, ఆయా పాఠశాలలకు కవులను రచయితలను రప్పించి బాల సాహిత్యంపై సమావేశాలు ఏర్పాటు చేయుట, పిల్లలకు కథలు గేయాలతో పాటు సంగీతము నృత్యము వంటి అంశాలపై అవగాహన కల్పించుటకు కవి పండితులను ఆహ్వానించడం. విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అవగాహన నిమిత్తము అనేక బాల సాహిత్య కార్యశాలలు ఏర్పాటు చేయాలని ఏకగ్రీవంగా ఐదు తీర్మానాలు ప్రవేశపెట్టగా సదస్సు ఆమోదించింది.

ప్రతి సదస్సు చివరలో సారస్వత పరిషత్తు ప్రధాన కార్యదర్శి జె. చెన్నయ్య ఆధ్వర్యంలో సమ్మేళనంలో పాల్గొన్న ప్రతినిధులను డజను పుస్తకాల చేతి సంచితో, ప్రశంసా పత్రంతో గౌరవంగా సన్మానించారు.

బాల సాహిత్య సమ్మేళనంలో రెండు రోజులపాటు జరిగిన చర్చలు, అభిప్రాయాలు, ప్రసంగాలు, రాబోవు కాలంలో బాల సాహిత్యంలో అద్భుత ఫలితాలు వస్తాయని ఆశిద్దాం.

- కోమటిరెడ్డి బుచ్చిరెడ్డి,

m : 9441561655

e: komatireddy.arunabuchireddy@gmail.com

ద

# చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ
(Regd. 720/1982)
హైదరాబాద్




## తెలంగాణ బడి పిల్లల కథలు



**10 పుస్తకాల సెట్ ధర రూ. 330 • తగ్గింపు ధర రూ. 300**

పిల్లలకు అత్యంత ఆనందానిచ్చేది ఆట బొమ్మలు, కథల పుస్తకాలే. పాఠ్యపుస్తకాలు అందించే జ్ఞానానికి సమాంతరంగా మరెంతో లోకజ్ఞానాన్ని అందించేది బాల సాహిత్యమే. పుస్తకాలు పిల్లల ఆలోచనా నైపుణ్యాలను పెంచుతాయి. వారి ఊహలకు ప్రాణం పోస్తాయి. వారిలో సృజనాత్మకతను పెంచుతాయి. చరిత్ర, సంస్కృతి, కళలు, సైన్స్, మానవ స్వభావాలు, జంతు స్వభావాలు, ఆరోగ్య సంబంధిత అంశాలు - ఒకటేమిటి ప్రాథమిక విజ్ఞానఖని బాలసాహిత్యం, పిల్లలో నైతికతను, ఆధ్యాత్మికతను, సక్రమమైన ప్రవర్తనను, మంచి చెడుల అవగాహనను పెంచే బాధ్యతను బాలసాహిత్యమే నెరవేర్చగలదు.

ఇవి అచ్చంగా మన పిల్లలు రాసిన కథలు, స్వచ్ఛమైన కథలు. 'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' తెలంగాణలోని ఉమ్మడి 10 జిల్లాల **"బడి పిల్లల కథలు"** సంకలనాలుగా అందమైన బొమ్మలతో గతంలో వెలువరించింది. అవి రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ విశేష ఆదరణ పొందాయి.

అలాగే ఇప్పుడు పిల్లలకోసం తెలంగాణలోని ఉమ్మడి పది జిల్లాల బాల సాహిత్య రచయితలు రాసిన **"పెద్దలు రాసిన పిల్లల కథలు"** పది సంకలనాలను అందమైన బొమ్మలతో వెలువరించింది. చిన్నారులు, పెద్దలు, సాహితీ వేత్తలు ఎప్పటివలె ఈ పుస్తకాలను ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

**-మణికొండ వేదకుమార్**
చైర్మన్, చిల్డ్రన్స్ ఎడ్యుకేషన్ అకాడమీ

## పెద్దలు రాసిన పిల్లల కథలు (ఉమ్మడి పది జిల్లాలు)



**10 పుస్తకాల సెట్ ధర రూ. 350 • తగ్గింపు ధర రూ. 300**

सोने की मछली

**ప్రతులకు**

అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు. మరియు
'భూపతి సదన్' 3-6-716, స్ట్రీట్ నెం.12, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029
ఫోన్ : 9030 6262 88

*email: edit.chelimi@gmail.com* *website : www.balachelimi.com*

आलसी कबूतर

## చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ ప్రచురించిన ఇతర పుస్తకాలు



# పర్యావరణ దారిలో తెలుగు సాహితీ వెలుగులు

మనకు ఆవాసనిలయమైన పుడమి తల్లికి, వస్త్ర రూపం మన అందాల ప్రకృతి అనబడే "పర్యావరణం", మానవుడు తన శరీర రక్షణ సొగసుల కోసం ఉపయోగించే వస్త్రాల కొరకు పెట్టే ఖర్చు, శ్రద్ధ, ఇష్టాల్లో సగమైన మన మనుగడకు కారణభూతమైన భూమాతకు వస్త్ర సమానమైన పర్యావరణ రక్షణ కోసం కేటాయిస్తే ఎంత బాగుంటుంది??

పాశ్చాత్య సంస్కృతి వ్యామోహం లో పడి నిండైన మన వస్త్ర సంస్కృతిని చీలిక పేలికలు చేసుకొని ఆధునీకరణతో ఎలా మురిసి పోతున్నామో అలాగే స్వార్థం సౌఖ్యం అనబడే కనిపించని ఆయుధాలు చేబూని నిత్యం మన పర్యావరణ వస్త్రాలను చిద్రం చేసుకుంటూ కనిపించని క్రతువుతో మన తరంకే కాక భావితరాలకు భారీ ప్రమాదాన్ని అందించే పనిలో ఎవరికి వారం బిజీ అయిపోతున్నాం.

ఇలాంటి క్లిష్ట తరుణంలో నిత్యం సమాజ చైతన్య దీపికలు, సాంస్కృతిక పరిరక్షకులు అయిన అక్షర సైనికులు అనునిత్యం తమ కలాలతో కవాతులు చేస్తూనే ఉన్నారు, ఉంటారు.

నిత్య జాగరూకులైన మన తెలుగు సాహితీ మూర్తులు పర్యావరణ పరిరక్షణలో చేసిన కృషి గురించి రేఖా మాత్ర విహంగ వీక్షణం చేద్దాం.






మన ప్రాచీన కాలపు తెలుగు సాహిత్యమంతా అందాల ప్రకృతి వర్ణనలతో అలరించింది, ముఖ్యంగా 16వ శతాబ్ది కాలంలో దేదీప్య మానంగా వెల్లి విరిసిన ప్రబంధ యుగం నిండా ప్రకృతి అందాలే ఆగుపిస్తాయి, ప్రకృతి నుంచి జన్మించి ఆ ప్రకృతిలోనే జీవించే మానవునికి ప్రకృతి అనబడే పర్యావరణానికి విడదీయలేని అవినాభావ సంబంధం ఈనాటిది కాదు ఆనాటిదే!!

అనంతర కాలంలో వచ్చిన భావ కవిత్వం, ఆధునిక సాహిత్యం వివిధ సామాజిక స్పృహ ప్రక్రియలతో అడుగులు వేస్తూ కవన భూమిలో కవాతు చేసింది,

"సైలెంట్ స్ప్రింగ్" పేరిట 1962లో "రాచెల్ కార్సన్" వ్రాసిన రచన ప్రకృతి, పర్యావరణ విధ్వంసాల గురించి ప్రపంచ దేశాలకు చాటి చెప్పింది, ఇంచుమించు అదే కాలంలో తెలుగులో ప్రజా కవి కాళోజి ప్రకృతి మానవ ప్రవృత్తి పర్యావరణం అనే భావనల పట్ల స్పష్టమైన అవగాహనతో "స్వగతం" అనే కవితలో కంటకాల మధ్య నేను/ కాలినడక నడిచినాను/ కాలు బయట పెట్టకుండా/ కాలమెంతో గడిపినాను/ గుట్టలపై ఎక్కి ఎక్కి/ గట్టుల దిగజారినాను/ లోయలోకి దూకి దూకి/ లోతులెన్నో చూసినాను/ నే పోకని ఎత్తు లేదు/ నే జారని లోతు లేదు,... అనడంలో కాళోజికి గల పర్యావరణ సంబంధపు చైతన్యం కనిపిస్తుంది మనిషి తనకు తాను ప్రకృతికి యజమానిగా ప్రకటించుకున్నాడు ఆ యజమాని భావన వదులుకోవాలన్నదే కాళోజి అభిమతం.

తెలంగాణ ప్రాంతంలోని ప్రకృతి వనరులపై సాగిస్తున్న ఆధిపత్యాలకు వ్యతిరేకంగా నడిచిన ఉద్యమంగా తెలంగాణ ఉద్యమాన్ని చెప్పవచ్చు. ఆ కోణాన్ని మొదటగా అర్థం చేసుకున్నది కూడా కాళోజీ నారాయణరావు అనవచ్చు.

ఇలా కవితా ప్రక్రియలోని పర్యావరణ జాగృతిని ఆశిస్తూ అడప దడపా అనేక కవితలు వెలవడుతూనే ఉన్నాయి. అందులో ముకుటాయమానంగా నిలిచేవి ప్రధానంగా రెండు దీర్ఘకావ్యాలు. డా: సి నా రె, కి జ్ఞానపీఠం అందించిన విశ్వంభర, డా:ఎన్. గోపి,కి గొప్ప ఖ్యాతిని అందించిన జల గీతం,

"విశ్వంభర" మొత్తం ప్రకృతి ఆధారంగా సాగిన మానవ పరిణామ క్రమం. మానవుడు స్వార్థంతో చేసిన ప్రకృతి విధ్వంసం గురించి సి.నా.రె తనదైన నర్మగర్భ శైలిలో చెబుతూ మానవ మనుగడకు పర్యావరణ సంరక్షణ ఆవశ్యకత గురించి తేట తెల్లం చేశారు.

ఇక "జలగీతం" లో కవి గోపి పర్యావరణలో ప్రధాన భాగమైన నీటి గురించి జల వ్యవస్థ, ముఖ్యంగా చెరువుల అంతర్దానం గురించి ఆవేధనతో కూడిన ధర్మాగ్రహం వ్యక్తం చేస్తూ జనావళిని జాగృతం చేశారు తన "జలగీతం" సాయంగా.

సుమారు 130 సంవత్సరాల వయసు గల తెలుగు నవలా ప్రక్రియలో సామాజిక, తాత్విక, మానసిక, చిత్రణలతో అనేక నవలలు వెలువడ్డాయి కానీ గ్రామీణ పర్యావరణంపై వెలువడ్డ తొలి నవలగా పెద్దింటి అశోక్ కుమార్ వ్రాసిన "దాడి" నవలను చెప్పవచ్చు. 2005లో ఆంధ్రభూమి దినపత్రికలో ధారావాహికంగా వెలువడ్డ ఈ నవల నాలుగు తరాల చరిత్ర నేపథ్యంగా చెప్పబడి త్రాగునీరు లేక ఒక ఊరు ఖాళీ అయిన తీరును దాని పర్యవసానాలకు కారణాలు, భవిష్యత్తు చిత్రంగా ఈ నవలను చక్కని శైలిలో తీర్చిదిద్దారు రచయిత, ఇది ప్రాంతాలకు అతీతంగా ప్రపంచంలోని ప్రతి ఊరి కథ, ప్రాంతీయ అస్తిత్వ వేదనను ప్రపంచపు బాధగా సర్వస్థల, కాల, ఆమోదంగా నిలిచిపోతుంది "దాడి" నవల.

తెలుగు సాహిత్యంలో నేటి తరానికి చెందిన ప్రతి ఆధునిక కవి ప్రత్యేక సందర్భాలలో ఉగాది సంక్రాంతి లాంటి ప్రకృతి పర్యావరణ

పండుగలు నేపథ్యంలో పర్యావరణం గురించి పాటలు కవితలు రాస్తూనే ఉన్నారు కానీ అచ్చంగా పర్యావరణ రచయితలుగా ఉన్నవారు చాలా అరుదు. అలాంటి అరుదైన పర్యావరణ రచయితల్లో ఒకరు తల్లావఝ్ఝల పతంజలి శాస్త్రి. ఆయన పురావస్తు శాస్త్రంలో పరిశోధన చేసి కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ విరమణ అనంతరం 20 సంవత్సరాలుగా కేవలం పర్యావరణం పరిరక్షణ కోసం సాహిత్యం ఆధారంగా విశేషమైన కృషి చేశారు, "పర్యావరణ భారతి" అనే త్రైమాసిక సంచిక, కూడా కొంతకాలం నడిపించారంటే పర్యావరణ పరిరక్షణ కోసం ఆయన కృషి గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. పర్యావరణ పరిరక్షకులైన వనవాసి ప్రాంతాలను పర్యటించి వారి మౌఖిక గాథలను సంకలనం చేసిన ఘనత కూడా ఆయనకే చెల్లుతుంది,

సాహిత్య పరంగా పతంజలి శాస్త్రి కృషిలో భాగంగా ఆయన వ్రాసిన "దేవరకోటేశు" అనే నవలిక ను ప్రధానంగా పేర్కొనవచ్చు దీనితోపాటు అనేక వ్యాసాలు, అనువాదాలు, ఆయన కలం నుంచి వెలువడ్డాయి.

వృత్తిరీత్యా న్యాయవాది అయిన కే అశోక్ రెడ్డి "అశోక్ ఆర్కే" పేరున పత్రికలకు అనేక పర్యావరణ సంబంధిత వ్యాసాలు రాశారు, వాటి అన్నిటితో ఆయన ప్రచురించిన వ్యాస సంపుటి "బ్రహ్మపదార్థం" దీనిలో మొత్తం 76 వ్యాసాలు ఉన్నాయి.

వాటిని పర్యావరణం, అవి- ఇవి, చెరువులు- సరస్సులు, కాలుష్యం, నదులు-వివాదాలు, అనే భాగాలుగా విభజించి ఒక్కో అంశంపై కూలంకషంగా చర్చించారు, తెలుగు సాహిత్యంలో అరుదుగా వస్తున్న పర్యావరణ సాహిత్యంలో ఇది మేటి పుస్తకం అనడంలో సందేహం లేదు. టి విజయేంద్ర అనే మరో సామాజిక కార్యకర్త రచయిత "మంచి పుస్తకం" పేరుతో పర్యావరణ పరిరక్షణ ప్రధాన అంశంగా వ్యాస సంపుటి వెలువరించారు.

"ఈ విశాల విశ్వంలో స్వర్గం లాంటిది ఏదైనా ఉంటే అది మన భూమండలమే" అనే కవితాత్మక వాక్యంతో ప్రారంభమయ్యే ఈ పుస్తకంలో భూగోళం ఎందుకు వేడెక్కుతుంది? శాస్త్రవేత్తలు పరిశోధనల పేర ఎలాంటి తప్పిదాలు చేస్తున్నారో.. చెబుతూ ప్రజలు ప్రత్యామ్నాయ యుద్ధాలు చేసి పాలకులను మట్టికరిపించి నేలతల్లిని రక్షించాలనే ఆలోచనలు ఈ "మంచిపుస్తకం" అందిస్తుంది.

ఇలా ప్రతి సామాజిక అవసరాల పట్ల ప్రతిస్పందించే తెలుగు కలాలు ప్రారంభంలో పర్యావరణాన్ని అభివర్ణిస్తూ ఆహ్లాదాన్ని అందిస్తే, ఆధునిక కాలంలో మనుషులు స్వార్థం సోకిన బుద్ధితో పర్యావరణ సమతుల్యానికి చేస్తున్న చేటును అరికట్టే పనిలో పడ్డాయి, పర్యావరణ కాలుష్యానికి మానవుల అతి ప్రయాణాలు, వ్యవహారాలు, ఎలా దోహదపడుతున్నాయో ఇటీవల ప్రపంచాన్ని పట్టిపీడించిన "కరోనా" కారణంగా మనం ఏర్పరచుకున్న "స్వీయనిర్భంద"మే ప్రత్యక్షంగా నిరూపించింది.

కరోనా మహమ్మారి మానవ సమాజాన్ని మట్టుపెట్టే పనిలో విజృంభిస్తుండగా ఒకవైపు బాధపడుతూనే మరోవైపు "పర్యావరణం", కాలుష్యం బారి నుంచి రక్షించబడుతుందని సంతోషించే విచిత్ర పరిస్థితి నెలకొంది. ఇలా పర్యావరణ పరిరక్షణ గురించిన ప్రత్యక్ష సంఘటనలు అనుభవాలను చూసిన నేటి ఆధునిక విలాస మానవుల ఆలోచనల్లో మార్పు రావాలని ఆశిద్దాం.

పర్యావరణ పరిరక్షణ నేటి ఆధునిక సమాజానికి అత్యవసరం, అందుకే భావి భారత పౌరుల చదువుల్లో "పర్యావరణ విద్య" పాఠ్యాంశంగా కూడా అందించబడుతుంది, ఇలా అటు పాలకులు, ఇటు రచయితలు, జమిలిగా ఎంత కృషిచేసిన, వాటిని ప్రజలు ఆచరించని నాడు వారి ఆశయాలు నిర్వీర్యమే...!!

కవులు ఎప్పుడూ ఆశాజీవులే. సమాజాన్ని సన్మార్గంలో నడిపించే ప్రయత్నంలో భాగంగా జనావళి అనబడే ఏనుగు ని జాగృతీకరించ డానికి ప్రతి రచయిత తన సాహితీ ప్రక్రియలనబడే"అంకుశాల"తో మావటి వాళ్ళ అవతారం ఎత్తక తప్పదు.

కవుల ఆశయాలకు సత్వర ఫలితాలు అందకపోవచ్చునేమో.. గాని సమాజ మార్పుకు సాహిత్యం ఏనాటికైనా తప్పక సహకరించి తీరుతుందని చెప్పాలి, దానికి సాక్షిభూతంగా అలనాటి సాంఘిక దురాచారాల మార్పు అయితేనేమి, స్వరాజ్య ఉద్యమాలు అయితేనేమి, ప్రతి పనిలో సాహిత్యం సమూల మార్పులకు చేయూతనిచ్చింది,అన్నది మాత్రం నిజం.

ప్రస్తుతం పర్యావరణ పరిరక్షణ కూడా ఉద్యమ రూపం సంతరించుకుంది, సాహితీవేత్తలు కూడా ఇతర వాదాలవలెనే "పర్యావరణ వాదం"తో అన్ని వాదాల వారు కలిసి ముందుకు రావాలి, అలాంటి ఐక్యతా భావంతో తెలుగు కలాలు పర్యావరణ పరిరక్షణ కోసం కదలాలి.

-డా. అమ్మిన శ్రీనివాసరాజు
m : 77298 83223
e: srinivasarajuammina@gmail.com



# విత్తనం పరిరక్షణకు 'చిరు'యత్నం

'ఇంటర్నేషనల్ సీడ్ డే'... ఇలాంటి ఓ రోజు ఉందా! ఉంది... అయితే ప్రచారమే పెద్దగా ఉండదు. ఇది గ్లామర్ మార్కెట్ వస్తువు కాకపోవడమే కారణం. ఈ రోజును రైతు మహిళలు నిర్వహిస్తున్నారు.

'చిరు'సాగు చేసి కళ్లాల్లో రాశులు పోసిన చేతులవి. విత్తనాన్ని కాపాడాలనే ముందుచూపున్న చేతలవి.

రాగి ముద్ద స్టార్ హొటల్ మెనూలో కనిపిస్తోంది. స్మార్ట్‌గా ఆర్డర్ చేస్తే అందమైన ప్యాక్‌తో ఇంటిముందు వాలుతోంది. అలాగే సజ్జ ఇడ్లీ, ఊదల దోసె, కొర్రల కర్డ్ మీల్, జొన్న రొట్టె, మిల్లెట్ చపాతీ, మిల్లెట్ పొంగలి... ఇలా బ్రేక్ ఫాస్ట్ సెంటర్‌లు కొత్త రూపుదిద్దుకున్నాయి. ఎక్కడో మారుమూల గ్రామాల్లో నీటి వసతి లేని నేలను నమ్ముకుని బతికే వాళ్ల ఆకలి తీర్చిన చిరుధాన్యాలు ఇప్పుడు బెంజ్‌కారులో బ్రేక్‌ఫాస్ట్‌కి వెళ్లే సంపన్నుల టేబుల్ మీదకు చేరాయి.

ఒకప్పుడు చిన్న చూపుకు గురైన చిరుధాన్యాలు నేడు సిరిధాన్యాలుగా మన దైనందిన జీవితంలో ప్రధాన భూమికను పోషిస్తున్నాయి. వీటి వెనుక నిరుపేద మహిళల శ్రమ ఉంది. పాతికేళ్లుగా ఈ నిరుపేద మహిళలు చిరుధాన్యాలతోనే జీవించారు, చిరుధాన్యాల పరిరక్షణ కోసమే జీవించారు.

సేంద్రియ సేద్యంతో చిరుధాన్యాల జీవాన్ని నిలిపారు. అంతర్జాతీయ విత్తన దినోత్సవం (ఏప్రిల్ 26) సందర్భంగా వీరంతా మెదక్ జిల్లా, జహీరాబాద్ మండలం, పస్తాపూర్‌లో తమ దగ్గరున్న పంటల విత్తనాలను సగర్వంగా ప్రదర్శించారు. హైబ్రీడ్ వంగడాల మాయలో పడకుండా మన విత్తనాలను మనం కాపాడుకోవాలని ఒట్టు పెట్టుకున్నారు. ఈ సందర్భంగా హైదరాబాద్ కేంద్రంగా పని చేస్తున్న దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ బోర్డు సభ్యులు రుక్మిణీరావు తెలుపుతున్న వివరాలివి.

**ఈ నేల... ఈ విత్తనం... మన సొంతం**

"చిరుధాన్యాల పట్ల అవగాహన కోసం ఈ ఏడాదిని 'ఇంటర్నేషనల్ ఇయర్ ఆఫ్ మిల్లెట్స్' నిర్వహించుకున్నాం. ఈ ఏడాది సీడ్ డే రోజున మేము చిరుధాన్యాల విత్తనాల పరిరక్షణ, ప్రదర్శన నిర్వహించాం. పస్తాపూర్ కేంద్రంగా జరిగిన ఈ కార్యక్రమంలో 26 పరిసర గ్రామాల నుంచి వందకు పైగా మహిళలు వారు పండించి, పరిరక్షించిన విత్తనాలను తీసుకువచ్చారు. చిరుధాన్యాలతోపాటు పప్పుధాన్యాలు, నూనె గింజల విత్తనాలు మొత్తం యాభైకి పైగా పంటల విత్తనాలకు ఈ ప్రదర్శన వేదికైంది. ఇవన్నీ సేంద్రియ సేద్యంలో పండించినవే.

**ఆహారం - ఆకలి!**

ఆహారం మన ఆకలి తీర్చాలి, దేహానికి శక్తినివ్వాలి. 'వరి అన్నం తిని పొలానికి వెళ్తే పని మొదలు పెట్టిన గంట సేపటికే మళ్లీ ఆకలవుతుంది. రొట్టె తిని వెళ్తే ఎక్కువ సేపు పని చేసుకోగలుగుతున్నాం. అందుకే మేము కొర్రలు, జొన్నలు తింటున్నాం' అని ఈ మహిళలు చెప్పిన మాటలను తోసిపుచ్చలేదు సైంటిస్టులు. వారి అనుభవం నుంచి పరిశోధన మొదలు పెట్టారు. అందుకే మిల్లెట్స్‌లో దాగి ఉన్న శక్తిని ప్రపంచ వేదికల మీద ప్రదర్శించగలిగారు. అలాగే ఈ మహిళలు విదేశాల్లో రైతు సదస్సులకు హాజరై తమ అనుభవాలను వారితో పంచుకున్నారు.



భూగోళం ఎదుర్కొంటున్న మరో విపత్తు క్లైమేట్ చేంజ్. ఈ పంటలైతే వాతావరణ ఒడిదొడుకులను ఎదుర్కొని పంటనిస్తాయి. పదిహేను రోజులు నీరు అందకపోయినప్పటికీ జీవాన్ని నిలుపుకుని ఉంటాయి. చిరుధాన్యాలకు గాను మన ముందున్న బాధ్యత ఈ విత్తనాలను కాపాడుకోవడం. ఎట్టి పరిస్థితుల్లోనూ వీటి మీద హక్కులను కార్పొరేట్ సంస్థలు తన్నుకుపోకుండా చూసుకోవాలి. అవసరమైతే ఉద్యమించాలి. ఇదే మనం డీడీఎస్ స్థాపకులు మిల్లెట్ మ్యాన్ పీవీ సతీశ్‌గారికి ఇచ్చే నివాళి".

చిరుధాన్యాలను పండించడంలో ముందడుగు వేసేశాం. ఇక మన ముందున్న బాధ్యత ఈ విత్తనాలను కాపాడుకోవడం. ఈ విత్తనాల మీద పూర్తి హక్కులు ఈ పేద రైతు మహిళలవే.

- రుక్మిణీరావు, బోర్డు సభ్యులు,
దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ ◙

# బంగారు భవిష్యత్తుకు బాటలు

ఏ దేశం, ఏ జాతి బాలల్ని, వాళ్ళ సాహిత్యాన్ని పట్టించుకోదో ఆ దేశం, ఆ జాతి అభివృద్ధిని ఊహించలేం. పిల్లల మానసిక, బౌద్ధిక వికాసానికి తోడ్పడే చక్కని సాహిత్యాన్ని వారసత్వంగా అందించాల్సిన బాధ్యత కుటుంబం, ఉపాధ్యాయులతో పాటు మనందరి మీద ఉంది. ఆ దిశగా కృషి చేసిన **'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' బాలచెలిమి** ఉమ్మడి పది జిల్లాల వారీగా బాలసాహితీవేత్తలు రాసిన **'పెద్దలు రాసిన పిల్లల కథలు'** పది సంకలనాలుగా ఇప్పుడు వెలువరించింది. ఆ పది జిల్లాల 'పెద్దలు రాసిన పిల్లల కథలు' దక్కన్‌ల్యాండ్ పాఠకులకు పరిచయం చేయడంలో భాగంగా 'మెదక్ జిల్లా - పెద్దలు రాసిన పిల్లల కథలు' తెలంగాణ సాహిత్య అకాడమీ చైర్మన్ **నందిని సిధారెడ్డి** గారి విశ్లేషణ.




కథల కోసం చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ వారి ఆహ్వానం మేరకు మెదక్ జిల్లా 'పెద్దలు రాసిన పిల్లల కథలు' ఎంపిక కోసం 52 కథలు రాగా కథల కార్యశాలలో పాల్గొన్న నిష్ణాతులైన బాలసాహితీవేత్తలు 14 కథలను ఎంపిక చేశారు. ఈ పుస్తకానికి కవర్, లోపలి బొమ్మలు **టి.వి. రాంకిషన్** వేశారు. ఈ బాధ్యతను నెరవేర్చే క్రమంలో 'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' నిష్ణాతులతో ఎన్నో సమావేశాలు, సదస్సులు, చర్చలు, బాల చెలిమి ముచ్చట్లు నిర్వహించింది.

**- బాలచెలిమి ఎడిటర్**

రేపటి తరాన్ని ఆదర్శంగా తీర్చిదిద్దే మహత్తర శక్తి బాలసాహిత్యం. బాలల్లో విలువల నిర్మాణానికి, వ్యక్తిత్వ వికాసానికి విశేషంగా బాలసాహిత్యం తప్పకుండా తోడ్పడుతుంది. కథలన్నా, పాటలన్నా, ఆటలన్నా ఆసక్తి ఉండని బాలలెవరూ ఉండరు. చదువులన్నీ మార్కుల చుట్టూ గిరగిర తిరుగుతున్న స్థితి నుంచి మార్చవలసిన అవసరమున్నది. స్వతహాగా బాలల్లో జ్ఞానపిపాస ఎక్కువ. వినాలని, తెలుసుకోవాలని, ఏదో చేయాలని, గుర్తింపబడాలని రకరకాల ఆసక్తులుంటాయి. అనుకరణ గుణం ఎక్కువగా ఉంటుంది. జంతువుల్ని, మనుషుల్ని, పక్షుల్ని అనుకరించే స్వభావం కనబడుతుంది. వివిధ జీవరాశుల మీద పెట్టి కథలు చెప్తుంటే తమనుతాము మరచి పోయి వినడం మనకందరకు తెలిసిందే. అట్లాంటి అద్భుత బాల్యాన్ని సాంకేతిక పరికరాలు ఆక్రమించి సహజ శక్తులను కొల్లగొట్టడం నిజంగా పెద్ద విషాదం. తిరిగి వాళ్లను సహజ స్వభావంతో నిలబెట్టేది బాల సాహిత్యమే. వాళ్లలోని సృజనశక్తులకు పదును పెట్టే ఈ అవకాశం బాల సాహిత్యానికే ఉంది.

మెదక్ జిల్లా పెద్దలు రాసిన 14 కథలు ఇందులో ఉన్నాయి. ఏ కథకు ఆ కథ ప్రత్యేకమైందే. అయినా ఈ కథలన్నీ బాలల వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడే విధంగా రూపొందించటం సంతోషం.

ఈ సంకలనంలోని అన్ని కథలు సందేశాత్మకంగా సాగుతాయి. బైతి దుర్గయ్య రచించిన 'కోతిరాయబారం', ఉండ్రాళ్లరాజేశం 'స్ఫూర్తి', అనితా గిరి 'స్ఫూర్తి' మూడు కథలు చెట్లు నాటవలసిన అవసరాన్ని వివరిస్తాయి. పర్యావరణ పరిరక్షణను ప్రబోధిస్తాయి. బి.ప్రశాంతి రచించిన 'బాలాస్ఫూర్తి' ఇంకుడు గుంతల ఆవశ్యకతను, ఆత్మవిశ్వాసాన్ని ప్రకటిస్తుంది. చొప్పదండి సుధాకర్ 'మనచేతుల్లో మన ఆరోగ్యం' ఉందని పరిశుభ్రత బోధిస్తుంది. రసాయన కాలుష్యము, తిరిగి చెరువు ఏడుస్తున్న స్థితిని వి. పద్మ చిత్రించింది.

ఇతరులకు సహాయం చేయాలని కొమరవెల్లి అంజయ్య కథ ద్వారా తెలుస్తుంది. టూర్ వల్ల కలిగే ఆనందం కంటే నాన్న కష్టాన్ని అర్థం చేసుకొని, పొందే ఆనందం ఎక్కువని బి. సుధాకర్ కథ చెప్తుతుంది. ఊరి అభిమానం పొందిన ఆదర్శ టీచర్ గురించి గుండ్లరాజు 'టీచరంటే'లో వివరించాడు. హరీష్ 'గండభేరుండం -గండుతుమ్మెద' కథ ద్వారా ప్రపంచంలో పనికిరాని వస్తువు, జీవి ఉండదని ఎవరి పరిధిలో వారు గొప్ప అని బోధించాడు. వినోదం కోసం రాజ్యం విడిచివెళ్ళిన రాజు కంటే ఊరి కోసం త్యాగం చేసిన వ్యక్తి గొప్పదనాన్ని తైదల అంజయ్య 'దేవగన్నేరు' కథలో చిత్రించాడు - కొడిచెల్లి రామానుజ 'మాతృప్రేమ', బిడ్డకోసం తల్లి పడే తపన సాహసాలను వివరిస్తుంది. అందరు కలిసి ఉన్నప్పుడే కుటుంబం రాణిస్తుందని ఐతా చంద్రయ్య చెప్పాడు.

కథలు చదివిన బాలలు తప్పకుండా భవిష్యత్తులో రాణిస్తారు. మంచి పౌరులుగా ఎదుగుతారు. చుట్టూ మానవత్వం, మంచితనం విస్తరించాలంటే బాలసాహిత్యం సృష్టించాలి. బాలల చేత బాల సాహిత్యం చదివించాలి. కథల మాలను కూర్చిన బాలచెలిమి 'వేదకుమార్'కు, బాలచెలిమి ప్రచురణలు కన్వీనర్ గరిపెల్లి అశోక్‌కు శుభాభినందనలు.

**- నందిని సిధారెడ్డి**
తెలంగాణ సాహిత్య అకాడమీ చైర్మన్ 





# సూర్యుడూ బుజ్జి మొక్క

అనగనగనగా ఒక బుజ్జి మొక్క మొలిచింది. అప్పుడే కళ్ళు తెరిచి చుట్టూ చూసింది. ఎవరూ లేరు, దానికి ఏమీ అర్థం కాలేదు. కొంచం భయం కూడా వేసింది. ఎవరన్నా పలకరిస్తారేమో అని చూసింది. కొంచం దూరంలో ఒక పెద్ద చెట్టు కనిపించింది. చెట్టు నిండా పళ్ళు. చూస్తుంటే నోరూరుతోంది. బుజ్జి మొక్కకి ఆకలి గుర్తొచ్చింది. ఆ చెట్టుని పలకరించబోతే మొహం తిప్పేసుకుంది.

ఏమి చెయ్యాలో బుజ్జి మొక్కకి తోచలేదు. అటుగా వెళ్తున్న ఒక చీమ కనిపించింది. అదేమిటో ఈ బుజ్జి మొక్కకి తెలియదు, కానీ భలే ఉంది, గబాగబా పాక్కుంటూ వెళ్తోందని చూసింది. తను కూడా కదలగలదేమో అని ప్రయత్నించింది. ఊహూ... కదలలేక పోయింది. వెంటనే ఆ చీమని గొంతెత్తి పిలిచింది, "ఇదిగో... నిన్నే, ఓ సారి ఇలా వస్తావా" అంది. చీమ ఓ క్షణం మొక్క కేసి చూసి, "ఉండవమ్మా... నా పనిలో నేనున్నా... ఆహారం తీసుకురాకపోతే మా రాణీ గారు తంతారు. నేను త్వరగా వెళ్ళాలి, అసలే మబ్బుగా ఉంది" అని వెళ్ళిపోయింది.




బుజ్జి మొక్కకి ఏమి చెయ్యాలో తోచలేదు. కొంచం ఆకలి కూడా వేసింది. 'ఈ చీమ ఎటో వెళ్ళి ఆహారం తెచ్చుకుంటుంది. నేనేమి చెయ్యాలి? దానికి ఎవరో రాణీ గారు కూడా ఉన్నారుట! నాకెవరు కనపడరే, నాతో ఎవరూ మాట్లాడరే!' అనుకుంది. దానికి బాధ కూడా వేసింది. ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తూ కూర్చుంది.

మర్నాడు పొద్దున్నే మబ్బు వీడి సూర్యుడు వచ్చాడు. బుజ్జి మొక్కకి ఆ వేడిమికి హాయిగా అనిపించింది. బద్దకంగా వళ్ళు విరుచుకొని పైకి చూసింది. చక్కటి రంగులో వెలిగిపోతున్నాడు సూర్యుడు. అది చూడగానే పక్క చెట్టుకి వేళ్ళాడుతున్న పండు లాగ తోచింది బుజ్జి మొక్కకి. మళ్ళీ ఆకలి గుర్తొచ్చింది దానికి. సూర్యుడి వైపు చూసి "ఏయ్ పండూ! నా పేరు బుజ్జి మొక్క. నువ్వెంత బావున్నావో తెలుసా, నీ పేరు మావిడి పండా? నాకు నిన్ను చూస్తుంటే తినాలనుంది" అంది.

ఎవరా మాట్లాడుతోంది అని క్రిందకి చూసిన సూర్యుడు, ఆ బుజ్జి మొక్క తనతోనే మాట్లాడుతోందని చూసి, పలకరింపుగా నవ్వాడు. ఇప్పటికి తనని చూసి ఒకళ్ళు పలకరింపుగా నవ్వారని బోలెడు ఆనందం వేసింది మొక్కకి.

"ఇక్కడికి రా, మనం కబుర్లు చెప్పుకుందాం, నాకెవరూ స్నేహితులు లేరు, నిన్ను తిననులే" అంది. దానికి సూర్యుడు పెద్దగా నవ్వి, "నేను ఇక్కడే ఆకాశంలోనే ఉంటాను, క్రిందకి రాలేను. పైగా నేను తినే పండుని కాదు. నా పేరు సూర్యుడు, నువ్వు నన్ను 'సూర్యా' అని పిలవచ్చు. మనిద్దరం స్నేహితులం ఇంక నుంచి. నీ సంగతులు చెప్పు" అన్నాడు.

దానికి బుజ్జి మొక్క చాలా ఆశ్చర్యంగా "నువ్వు ఆకాశంలోనే ఉంటావా? పండువి కూడా కాదా? భలే ఉందే! నేను నిన్ననే పుట్టాను. నాకెవరూ తెలిసినవాళ్ళు లేరు, ఎవరి పనుల్లో వాళ్ళు ఉన్నారు. నాకేమో నిన్నటి నుంచి బాగా ఆకలి, ఏమి చెయ్యాలో అర్థం కావట్లేదు. నీకేమన్నా తెలిస్తే చెప్పవా సూర్యా, నా స్నేహితుడువి అన్నావు కదా" అంది జాలిగా.

దానికి సూర్యుడు, "అయ్యో, బాగా ఆకలిగా ఉందా, నేను నీకు నా కిరణాలని ఇస్తాను. దానితో నీ ఆకలి తీరుతుంది చూడు." అన్నాడు.

"కిరణాలా? కిరణాలంటే?" అంది బుజ్జి మొక్క

"కిరణాలంటే, నా నుంచి వచ్చే వెలుగు అన్న మాట, అది మీ మొక్కలకి ఆహారం" అని నవ్వుతూ తన కిరణాలని బుజ్జి మొక్క మీద ప్రసరింపచేసాడు.

ఆశ్చర్యం, బుజ్జి మొక్క బుల్లి బొజ్జ నిండి పోయింది. "భలే ఉందే, కడుపు నిండిపోయింది. మరే, నువ్వు రోజూ నాకు ఆహారం ఇస్తావా?" అంది బుజ్జి మొక్క.

"ఓ, తప్పకుండా, నా పనే అది కదా, అందరికీ శక్తిని ఇవ్వటం. నేను మళ్ళీ రేపు వస్తాను" అని వెళ్ళిపోయాడు సూర్యుడు.

ఒకరోజు పొద్దున్నే సూర్యుడు వచ్చి బుజ్జి మొక్కని పలకరించాడు. బుజ్జి మొక్క దిగులుగా కనిపించింది. బుజ్జి మొక్కకి తన కిరణాలని ఇవ్వబోతూ, దిగులుకి కారణమేమిటని అడిగాడు సూర్యుడు, దానికి బుజ్జి మొక్క "ఇవాళ నాకు ఆకలిగా లేదు, నీ కిరణాలు వద్దు. నువ్వు చక్కగా నాలాంటి మొక్కలు ఎన్నిటినో పలకరిస్తావు రోజూ, అన్నిటికీ కడుపు నింపుతావు. కదలలేను మెదలలేను, నేనే ఎవ్వరికీ ఏమీ చెయ్యట్లేదు" అంది బాధగా.

దానికి సూర్యుడు నవ్వి "ఓస్... ఇంతేనా... నువ్వు ఇంక చాలా బుజ్జిదానివి. నువ్వు పెరిగి నీకు ఆకులు పూలు పళ్ళు వస్తాయి చూడు, అప్పుడు ఎంత మందికి సహాయపడతావో తెలుసా. జంతువులు, మనుషులు ఈ ఆకులు, పళ్ళు తిని ఆనందిస్తారు. పూలతో చాలా అందంగా ఉంటావు. నీ పక్కన ఉన్న ఆ పళ్ళచెట్టుని చూడు, రోజూ దాని మీద పాకే చీమలు, వాలే చిలకలు, పిట్టలు, దాని పళ్ళు కోసుకు తినే మనుషులు, ఎంత ఆనందిస్తున్నారో చూడు. అలా నువ్వు కూడా పెరిగి పెద్దయ్యి నలుగురికీ ఉపయోగపడతావు" అన్నాడు.

బుజ్జి మొక్క ఇప్పుడు ఎంతో సంతోషంగా ఉంది. దానికి ఇప్పుడు తను చక్కగా పెరిగినట్టూ, ఆవులు, మేకలు తన ఆకులు తింటూ కడుపు నింపుకుంటున్నట్టు, ఇంకా పెద్దదై, పక్కనే ఉన్న చెట్టంత ఎదిగినట్టూ, ఆ చెట్టు తనని ఆప్యాయంగా పలకరిస్తున్నట్టూ, బోలెడంత మందికి నీడనిస్తూ, తన పళ్ళతో వాళ్ళ ఆకలి తీరుస్తున్నట్టు ఆలోచనలు. బుజ్జి మొక్క మనసుని చదివిన సూర్యుడు, నవ్వుతూ "తథాస్తు!" అన్నాడు.

*(తురగా జానకీరాణీ పిల్లల కథల పోటీలు-2021 - పుస్తకం నుంచి)*

- అనువంశీ, m : 8333947019

# మారిన జనం




పిల్లలకు అత్యంత ఆనందానిచ్చేది ఆట బొమ్మలు.,కథల పుస్తకాలే. పాఠ్య పుస్తకాలు అందించే జ్ఞానానికి సమాంతరంగా మరెంతో లోకజ్ఞానాన్ని అందించేది బాల సాహిత్యమే. భాషకు సంబంధించిన ప్రాథమిక పరిజ్ఞానాన్ని అందించేవి కథలే. కొత్త కొత్త పదాలను పరిచయం చేసేది కథల పుస్తకాలే. పుస్తకాలు పిల్లల ఆలోచనా నైపుణ్యాలను పెంచుతాయి. వారి ఊహలకు ప్రాణం పోస్తాయి. వాటిలో సృజనాత్మకతను పెంచుతాయి.

పిల్లలలో నైతికతను, సక్రమమైన ప్రవర్తనను, మంచి చెడుల అవగాహనను పెంచే బాధ్యతను ఉమ్మడి కుటుంబాల్లో నాయనమ్మలు, అమ్మమ్మలు చెప్పే కథలు నెరవేర్చేవి. మారిన పరిస్థితులలో ఆ బాధ్యతను బాల సాహిత్యమే నెరవేర్చగలదు.

ఈ మే నెలలో బాలచెలిమి పర్యావరణ కథల పోటీలు - *2023* నిర్వహించింది. తక్కువ సమయంలోనే, వేసవి సెలవులు అయినప్పటికీ విద్యార్థుల నుంచి మంచి స్పందన లభించింది. *51* కథలు వచ్చాయి. కథలన్నీ చాలా బావున్నాయి. బాల సాహిత్య నిపుణులు ఈ కథలను చదివి, చర్చించి ప్రచురణకు *24* కథలు ఎంపిక చేశారు. ఈ కథల పోటీలు నిర్వహించి మరియు పుస్తక రూపాన్నిచింది బాలచెలిమి. **- వేదకుమార్ మణికొండ**

**రా**మాపురం అనే గ్రామంలో మల్లయ్య అనే చిన్న రైతు ఉన్నాడు. అతనికి భార్య, ఇద్దరు పిల్లలు. మల్లయ్య అందరితో కలుపుగోలుగా ఉంటాడు. వారి కుటుంబం చిన్న పెంకుటిల్లులో నివసిస్తుంది. అతని ఇంటి ప్రక్కన ఖాళీ స్థలం ఉంది. ఇరుగు పొరుగు వారు,ఆ వీధిలో ఉన్నవారు కొందరు ఆ ఖాళీ స్థలంలో చెత్త పడేస్తున్నారు.

మల్లయ్య మెత్తని మనిషి. చెత్త పడవేయవద్దని ఎవరికి చెప్పినా వినిపించుకోలేదు. అందరు చెత్త వేయడం మానలేదు. ఫలితంగా చెత్త గుట్టలా మారింది. కొన్ని రోజుల తర్వాత మల్లయ్య కు జ్వరం వచ్చింది. డబ్బులు లేనందున మల్లయ్య డాక్టరు వద్దకు వెళ్ళలేదు. చెత్త నుండి వస్తున్న చెడు వాసనతో మల్లయ్య జ్వరం రోజురోజుకు ఎక్కువైంది.

రెండు నెలల తర్వాత మల్లయ్య చనిపోయాడు. దానితో అతని కుటుంబానికి కష్టాలు మొదలయ్యాయి. చెత్త కారణంగానే మల్లయ్య చనిపోయాడని ఊరి వారందరు తెలుసుకున్నారు. పెద్దమనుషులు ట్రాక్టర్లను తెచ్చి చెత్తను తీసుకెళ్ళి, ఊరి బయట వేసి తగులబెట్టారు. చెత్త, ప్లాస్టిక్ వస్తువుల వలన ఎంత పెద్ద నష్టం జరిగిందో ఊరి వారందరు తెలుసుకున్నారు.

మల్లయ్య ఇరుగు పొరుగు వారు, వీధిలో ఉన్న వారికి తమ తప్పు తెలుసుకున్నారు. మల్లయ్య కుటుంబానికి క్షమాపణ చెప్పారు. తమకు తోచినంత డబ్బు జమ చేసి మల్లయ్య కుటుంబానికి ఇచ్చారు. మల్లయ్య పిల్లల పేరున బ్యాంక్‌లో డిపాజిట్ చేసారు. ఆ ఊరి పెద్దమనుషులు పంచాయితీ పెట్టి ఒక తీర్మానం చేసారు.

"చెత్త, ప్లాస్టిక్ వల్ల పర్యావరణం కలుషితమవుతుందని, దీని వల్ల నేల, నీరు, గాలి కూడా కలుషిత మవుతున్నాయని, ఎవరు కూడా చెత్త ఇంటి బయట పడేయవద్దని, గ్రామ పంచాయితీ వారి చెత్త బండిలోనే వేయాలని" పెద్ద మనుషులు చెప్పారు.

మల్లయ్య మరణంతో ఊరి వారిలో చాలా మార్పు వచ్చింది. ఆ రోజు నుండి అందరు ఒకే మాటపై నిలబడి ఊరును పరిశుభ్రంగా తయారు చేసారు. ప్లాస్టిక్ వస్తువులను నిషేధించారు. మురికి కాలువలు ప్రతి రోజు శుభ్రపరిచారు.

సంవత్సరం తర్వాత రామాపురం గ్రామానికి "స్వచ్ఛ పురస్కారం" అవార్డు వచ్చింది. ఊరి వారందరు కలిసి మెలిసి కాలుష్యం ను తరిమి కొట్టారని మిగతా ఊరి జనం మెచ్చుకున్నారు. గ్రామ పంచాయతీ మల్లయ్య కుటుంబానికి ఒక ఇల్లు నిర్మించి ఇచ్చింది.

**- పల్లె వైష్ణవి**
పదవ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల,
జక్కాపూర్, సిద్దిపేట జిల్లా, ఫోన్ :9959 0079 14 ద

**VOL 11 వ** వసంతంలో

**130 ISSUES** నూట ముప్పై వ సంచిక

పూర్తి చేసుకున్న దక్కన్ ల్యాండ్

దక్కన్ ల్యాండ్

# పది సంవత్సరాల ప్రస్థానం...

దక్కన్ ల్యాండ్ 2012 సెప్టెంబర్ - డిసెంబర్

తెలంగాణ ఉద్యమ కాలంలో ఆవిర్భవించిన 'దక్కన్‌ల్యాండ్' మాసపత్రిక 2022 ఆగస్టు సంచికతో 120 నెలలు పూర్తి చేసుకుంది. ఈ పది సంవత్సరాల కాలంలో తెలంగాణ భావజాలాన్ని వ్యాప్తి చేసి, పునర్నిర్మాణ అవసరాన్ని చాటి చెప్పేందుకు 'దక్కన్ ల్యాండ్' ఇప్పటి వరకు వెలువడిన సంచికలను (2012, 2013, 2014, 2015, 2016, 2017, 2018, 2019, 2020, 2021, 2022) సంకలనాలుగా (12 నెలలకు ఒక సంకలనంగా) రూపొందించి పాఠకుల కోరిక మేరకు అందిస్తున్నాం. భవిష్యత్తులో కూడా వచ్చే సంచికలను సంకలనాలుగా తీసుకు వస్తామని తెలియ జేస్తున్నాం. ఆసక్తి కలవారు ఒక్కో సంకలనాన్ని రూ. 400/-లకు పొందవచ్చు (పార్శిల్ ఛార్జీలు అదనం).

దక్కన్ ల్యాండ్ 2022 జనవరి - డిసెంబర్

***ISSN* ఆమోదం పొందిన 'దక్కన్ ల్యాండ్' మాసపత్రిక పట్ల చూపుతున్న ఆదరణకు ధన్యవాదాలు.**

**సంకలనాలు పొందేందుకు మా చిరునామా:**

ఎడిటర్, 'దక్కన్‌ల్యాండ్'
3-6-712/2, స్ట్రీట్ నెం. 12, హిమాయత్‌నగర్,
హైదరాబాదు-500029, తెలంగాణ
మొబైల్: 9030626288
Email: desk.deccan@gmail.com
Website: www.deccanland.com

**ఆన్‌లైన్ ద్వారా చెల్లింపుకోసం:**

NAME : DECCAN LAND
BANK : KOTAK MAHINDRA BANK
ACCOUNT NO : 7111218829
IFSC CODE : KKBK0000555
BANK CODE : 000555
MICR CODE : 500485007





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | NPVMO7A106 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/5/21 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |